G. RAMA GOPAL



# పాతాళదుర్గం

1

అది సువర్ణపురి సమీపంలోని ఓ అడవి. ఆకాశంలో సూర్యుడు నిప్పులు చెరిగిపోస్తున్నట్లు ప్రచండంగా ప్రకాశించసాగాడు. అడవిలో కట్టెలు కొట్టి, వూళ్లో వాటిని అమ్మి జీవనం సాగిస్తోన్న రాముడు, రంగడు అనే వ్యక్తులు ఆదినం కూడా మిట్టమధ్యాహ్నందాకా ఎండుకట్టెలు కొట్టుకుని వాటిని మోపులు కట్టి నగరానికి తీసికెళుతున్నారు. కొంతదూరం నడిచాక రాముడు రంగడితో "అన్నా! నాకు కాస్త కడుపునొప్పిగా వున్నట్లున్నది. ఎక్కడైనా కాసేపు కూర్చుని వెళదాం" అన్నాడు.

రంగడు "దానికేం భాగ్యం. అలాగే చేద్దాం" అని అటూయిటూ చూశాడు. అల్లంత దవ్వులో అతడికి ఏపుగా పచ్చని ఆకులునిండిన కొమ్మలతో ఓ వెపచెట్టు కనిపించింది. ఆ చెట్టుక్రింద అరుగుకూడా వున్నది. రాముణ్ణి వెంటబెట్టుకుని రంగడు అక్కడికి వెళ్లాడు. ఇద్దరూ మోపులు దించి అరుగుమీద కూర్చున్నారు. ఎండ ఎంత భయంకరంగా ఉండినప్పటికీ, అ[illegible] క్రింద చాలా చల్లగావున్నది.

రాముడు "అన్నా! ఇక్కడ కూర్చోగానే ప్రాణం లేచివచ్చినట్లయింది. ఈ అడవిలో అరుగు వుండటం మాత్రం చాలా ఆశ్చర్యంగా వున్నది" అన్నాడు.

రంగడు నవ్వి "ఇందులో ఆశ్చర్యమేమున్నదిరా వెర్రినాగమ్మా! అడవిలో తిరిగే వాళ్లకోసం అక్కడక్కడ కూర్చోడానికి అరుగులు, తాగడానికి మంచినీళ్ల కోనేళ్లు కట్టించటం రాజులపని. అందులోనూ పద్దెనిమిదేళ్లక్రిందట మన రాజ్యాన్ని పాలిస్తూండిన మన మహారాజుగారు చాలా ధర్మాత్ములట. ప్రజలకోసం ఎన్నెన్నో మంచిపనులు చేసేవారట. ఇప్పుడున్న పరిస్థితి వేరూ, అప్పటి పరిస్థితి వేరు. బహుశా మనలాంటి వాళ్లు విశ్రాంతి తీసుకోవటానికి మన మహారాజుగారే పూర్వం ఈ అరుగును కట్టించివుంటారు" అన్నాడు.

కిరణ్ కుమారి



ఆ అరుగు సమవిశాలంగా చక్కని పాలరాళ్లతో కట్టబడివున్నది. పదిమంది ఒకే సమయంలో విశ్రమించటానికి అనుకూలంగా వున్నది. ఆ అరుగుమీద కూర్చుని వాళ్లిద్దరూ పిచ్చాపాటి మాట్లాడుకుంటూండగా ఉన్నట్లుండి అరుగు కొద్దిగా కదిలింది. ఆ కదలికకు కుడివేపు కొద్దిగా ఒరిగిన రాముడు "అన్నా! అరుగు కదులుతున్నట్లున్నదే?" అన్నాడు.

రంగడు "అరుగు కదలటమేమిటిరా పిచ్చి సన్నాసీ!" అంటూనే తనూ ఎడమవేపుకి ఒరిగాడు. అరుగు అటూ ఇటూ కదులుతున్నట్లు అతడికి కూడా అనిపించింది. వెంటనే రాముడు ప్రక్కకుతిరిగి క్రిందికిచూసి ఉలిక్కిపడ్డాడు. అప్పటికే అటూ యిటూ కదులుతూనే ఆ అరుగు కొద్దికొద్దిగా పైకిలేస్తున్నది. క్రింద అరుగుచుట్టూ వున్న మట్టి ప్రక్కకుపోతున్నది. రంగడు "ఓరి నాయనోయ్! ఇదేదో మాయగా కనిపిస్తున్నది. ఏ భూతాలో పిశాచాలో మనల్ని ఆట పట్టిస్తున్నాయి. ప్రాణాలు కాపాడుకుంటే బలుసాకుతిని బతకొచ్చు. కట్టెలొద్దూ, ఏమీవద్దు బాబోయ్, పారిపోదాం పదరా" అని అమాంతం రాముడి చెయ్యి పట్టుకుని కిందికి దూకాడు. ఇద్దరూ ఓ వందగజాలదూరం పరిగెత్తి భయంవల్ల ఏర్పడిన వొణుకుతో ముందుకు పోలేక కింద కూలబడ్డారు. అదురుతూన్న గుండెలతో, ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకుని మళ్లీ అరుగువేపు చూశారు.

అప్పటికి అరుగు పూర్తిగా రెండడుగులు పైకి లేచి కొంతదూరంలో ప్రక్కన పడిపోయింది. అరుగుక్రింది మట్టిని ఎవరో త్రవ్విపోస్తున్నట్లు చిన్న చిన్న పెళ్లలు దుమ్ముతో కలిసి ఎగిరెగిరి ఎడాపెడా పడసాగాయి. అంతవరకు ప్రశాంతంగావున్న ప్రదేశంలో పెనుగాలులు ఉద్ధృతంగా వీచసాగాయి. చెవులు గింగురుమనేట్టు హోరున శబ్దాలు వినిపించనారంభించాయి. చెట్టుకొమ్మలు విరిగి పడిపోతాయేమోనన్నంత వేగంతో కదలటం ప్రారంభించాయి.

రాముడు, రంగడు బిగుసుకుపోయి రాతిబొమ్మల్లా కదలక మెదలక నిలువుగుడ్లుపెట్టుకుని కళ్లార్పకుండా అలా చూస్తూండగానే కొద్దిసేపటికి అరుగువున్న చోట ఏర్పడిన గొయ్యిలోంచి ఓ చిన్న అస్థిపంజరం బైటికి వచ్చింది. మూడడుగుల యెత్తుకలిగిన ఆ అస్థిపంజరం

పైకిరాగానే తలభాగాన్ని ఓమారు అటూయిటూ త్రిప్పింది. ఆ తర్వాత మరబొమ్మలా అడుగులు వేసుకుంటూ అక్కణ్ణుంచి ముందుకు కదలి పోయింది.

అస్థిపంజరం వెళ్లిన కొద్దిసేపటికి రాముడికి, రంగడికి ప్రాణాలు కాస్త కుదుటపడ్డాయి. ఇద్దరూ వూపిరి పీల్చుకున్నారు.

అదేసమయంలో, వాళ్లవెనకగా గుర్రపుగిట్టల చప్పుడు వినిపించటంతో మళ్లీ కంగారు పడ్డారు. రంగడు భయంతో "మళ్లా ఆ చప్పుళ్లేమిటి? అది ఇంకో మాయకాదుగదా? మనం లేచిన వేళావిశేషం మంచిదికాదేమో? పెళ్లాం పిల్లలకు మొహాలు చూపించే అదృష్టం వున్నదో లేదో?" అన్నాడు.

రాముడు వెనుతిరిగిచూసి "ఎవరో ఇద్దరు ఆడవాళ్లు గుర్రాలమీద ఇటే వస్తున్నారురా. లేచి నిల్చో" అని చెప్పి తానుకూడా లేచి నిలబడ్డాడు.

రంగడుకూడా లేచి నిల్చుని అటుకేసిచూసి "అన్నా! ఆ ఇద్దరూ మన రాజపుత్రీ, మంత్రి పుత్రీకదూ!" అన్నాడు. రాముడు. "హమ్మయ్యా! నిజంగా వాళ్లేరా! పద, ఎదురువెళ్లి జరిగింది చెబుదాం" అని ముందుకు నడిచాడు. రంగడు కూడా అతణ్ణి అనుసరించాడు. చేతులు జోడించుకుని ఇద్దరు కష్టజీవులు తమ గుర్రాలు ముందుకు రాగానే, యువతులిద్దరూ తమ గుర్రాలు నిలువరించారు.

రంగడు వొణికే గొంతుకతో "అమ్మాయిగారూ! ఇక్కడంతా మాయగా వున్నది. మీరెందుకొచ్చారో



ఏమోగాని, వెంటనే వెనుతిరగండి తల్లీ! లేక పోతే ప్రాణాలకే ముప్పు" అన్నాడు.

వీరవేషాల్లోవున్న ఇరువురు యువతుల్లో ఒకామె "నేను మంత్రి పుత్రిని; ఈమె మన రాజపుత్రి. మాకు, మీకు వచ్చే ప్రాణభయం ఏమీలేదుగాని, అసలేం జరిగిందో చెప్పు" అన్నది. రంగడు జరిగిందంతా పూసగ్రుచ్చినట్లు చెప్పాడు.

అంతా వినగానే రాజపుత్రి తనమెడలోని ఓ గొలుసుతీసి రంగడికిస్తూ "ఇకనుంచి మీరిద్దరూ ఏదైనా వ్యాపారంచేసుకుంటూ బ్రతకండి. కట్టెల కోసం ఈ అడవికి రావద్దు. అంతేకాదు, ఇప్పుడు మాకు చెప్పిన విశేషాలు వూళ్లో ఎవరికీ చెప్ప వద్దు. భయాందోళనలు కలిగించే వార్తలు ప్రజల్లో ప్రచారం కాకూడదు! తెలిసిందా?" అన్నది.



రంగడు హారం కళ్లకద్దుకుంటూ "అలాగే యువరాణీ!" అన్నాడు. మంత్రిపుత్రి "అరుగు సంగతీ, అస్థిపంజరం విషయమూ, మేం చూసు కుంటాంగాని ఇక మీరు మన వూరికెళ్లిపొండి" అన్నది. రాముడు, రంగడు, వంగి వంగి దండాలు పెట్టి అక్కణ్ణుంచి సువర్ణపురివేపుగా నడక సాగించారు.

రాజపుత్రి "గుణసాగరీ! అరుగుక్రింద మూడ డుగుల అస్థిపంజరమేమిటి, అది మనిషిలా నడుస్తూ వెళ్లడమేమిటి? వీళ్లు చెప్పింది ఆశ్చర్య కరంగానేకాదు; ఆసక్తి కలిగించేదిగా కూడా వున్నది. దీనికి సంబంధించిన విశేషం ఏమైవుంటుందో తార్కిక బుద్ధితో ఆలోచించి చెప్పు" అన్నది.

గుణసాగరి నవ్వి మనోహరీ! కట్టెలుకొట్టే



వాళ్లు కూర్చున్న పాలరాతి అరుగు ఓ సమాధి. విలువైన వ్యక్తులకే అలాంటి సమాధులు కడతారు. మూడడగుల అస్థిపంజరం గనుక, ఐదారు సంవత్సరాల వయస్సు కలిగిన మనిషిదై వుంటుంది. ఆ సమాధి ఎప్పుడు కట్టారో, ఆ మనిషికి మరణం ఎప్పుడు ఎందుకు కలిగిందో వూహించడం కష్టం. అయితే, సమాధిని పెకల్చు కుని, ఐదారు సంవత్సరాల మనిషికి చెందిన అస్థిపంజరం అలా పైకి వచ్చి, నడుస్తూ ఎక్కడికో వెళ్లగలడం అంటే, దాని వెనక ఏదో అద్భుతమైన కథ ఇమిడి వున్నది. దానిని తెలుసుకోవాలంటే, ఇప్పుడు మనం ఆ అస్థిపంజరాన్ని అనుసరించాలి" అన్నది.

మనోహరి గుర్రపు కళ్లాన్ని సడలించి "అయితే పద" అన్నది. మరుక్షణం రెండు గుర్రాలు ఒకదాని ప్రక్కగా మరొకటి దౌడు తీయడం ప్రారంభించాయి.

కొంతదూరం వెళ్లేసరికి అల్లంత దవ్వులో అస్థి పంజరం కనిపించింది. అది ముందుకు నడు స్తున్న తీరుకు విస్మయం చెందుతూనే, మనోహరి గుర్రపు కళ్లాన్ని బిగించింది. గుణసాగరి కూడా అలాగే చేసింది.

మనోహరి "గుణా! క్రిందికి దిగు. ఇద్దరం నడుస్తూ అస్థిపంజరాన్ని అనుసరిద్దాం" అని క్రిందికి దిగింది. గుణసాగరి కూడా అశ్వంనుండి క్రిందికి దిగింది.

గుర్రాలు రెండూ పచ్చిక మేయడం ప్రారంభించాయి. కొన్ని క్షణాలపాటు మనోహరి,

గుణసాగరి అక్కడే నిల్చుని అప్పుడే ఓ పుంతలోకి దిగుతూన్న అస్థిపంజరాన్ని గమనించసాగారు. వాళ్లు చూస్తుండగానే అస్థిపంజరం పుంతలోకి దిగి, కనుమరుగైంది. ఒకర్నొకరు హెచ్చరించుకుని మనోహరి, గుణసాగరి అస్థిపంజరం వెళ్లిన పుంతవేపు నడక సాగించారు. కాసేపటికే అక్కడికి చేరుకున్నారు.

పుంత దారిన నడుస్తూ అస్థిపంజరం ఎడంవేపు తిరిగి ఓ వనంలోకి ప్రవేశించింది. ముళ్లకంపల చెట్లతో, అడ్డబిడ్డంగా ఎదిగిన తీగెలతో గజిబిజిగా వుంటే అడవిలా కాకుండా, ఆ వనం పచ్చటి ఆకులు, రకరకాల పువ్వులు కలిగిన ఆకర్షణీయమైన ప్రదేశంగా కనిపించింది. రాజపుత్రి, మంత్రిపుత్రి కూడా కొద్దిసేపటికే ఆ వనంలోకి చేరారు.

ఆ వనంమధ్య ఎత్తైన ఓ రావిచెట్టుక్రింద గల తిన్నెవెనక పచ్చని ఆకులమీద కూర్చునివున్న ఓ యోగిని కనిపించగానే, మనోహరి అడుగు ముందుకు వెయ్యకుండా మంత్రిపుత్రి చెయ్యి పట్టుకున్నది. ఏమిటన్నట్లు ప్రశ్నార్థకంగా మనోహరి వేపుచూసింది గుణసాగరి. అక్కడికి దగ్గరేవున్న ఓ పెద్ద చెట్టువద్దకు నవడవమన్నట్లు సంజ్ఞచేసి మనోహరి అక్కడికి చేరుకున్నది. గుణసాగరి కూడా తన దగ్గరికి రాగానే "గుణా! మనం ఇక్కడేవుండి ఆ యోగిని చర్యలను కనిపెడదాం. బహుశా ఈ అస్థిపంజరాన్ని తన తాంత్రికశక్తితో ఆమె ఇక్కడికి ఏదో ప్రయోజనంకోరి రప్పించుకుని వుండవచ్చు" అన్నది మెల్లని స్వరంతో.




గుణసాగరి మనోహరితోబాటు ఆ చెట్టు మొదలు వెనకనే నిల్చుని ఓరగా ముందుకు చూసింది. కొద్ది క్షణాలు గడిచాక "మనోహరీ! నువ్వు అనుకున్నట్లు ఆమె తాంత్రిక శక్తిగల మంత్రగత్తెగ నాకు అనిపించటంలేదు. అపూర్వమైన ముఖవర్చస్సుతో ప్రకాశించే ఆమెలో ఒక సిద్ధ యోగినికి ఉండవలసిన శక్తులు వుండవచ్చనుకుంటున్నాను. నలభై సంవత్సరాల వయస్సులో వున్నట్లున్నది. మనం ఇక్కడేవుంటే, ఆ అస్థిపంజరాన్ని ఆమె ఎందుకు తన దగ్గరికి రప్పించుకున్నదో ఎలా తెలుస్తుంది?" అన్నది.

మనోహరి గుణసాగరి మాటలు వింటూనే తనూ తల ప్రక్కకు తిప్పి ఆ నడివయస్కురాలినే చూస్తున్నది. అప్పటికి అస్థిపంజరం ఆమెదగ్గరికి



వెళ్ళి ఎదుట నిల్చుని వుండడంకూడా ఇద్దరూ గమనించారు.

యోగిని అస్థిపంజరాన్ని రెప్పవాల్చకుండా కొద్ది క్షణాలు చూసింది. ఆమె కళ్లవెంబడి బాష్పాలు రాలటం ప్రారంభించాయి. అస్థిపంజరాన్ని రెండుచేతులతో పొదివి పట్టుకుని అక్కునచేర్చు కుని ముద్దాడసాగింది.

ఆ చర్యలు మనోహరికి, గుణసాగరికి, విభ్రాంతిని కలిగించాయి. ఇద్దరూ సంజ్ఞల తోనే ఒకర్నొకరు హెచ్చరించుకుని క్రింద కూర్చున్నారు. ఆ తర్వాత ఎండుటాకులు తమ శరీరాలకు తగిలి శబ్దంచేయకుండా జాగ్రత్తపడుతూ, మోకాళ్ల మీదుగా ప్రాకుతూ యోగిని కూర్చున్న చోటికి పది అడుగుల దూరంలోగల ఓ పొదరిల్లు చాటున దాక్కున్నారు.

యోగిని 'బాబూ! నా తండ్రీ! ఎంతకాలానికి నిన్ను చూడగలిగాను నాయనా! పద్దెనిమిది సంవత్సరాలక్రిందట కొందరు పాపాత్ములు మన జీవితాలకు చేసిన దారుణమైన అపకారానికి ప్రతీకారంచేసే శక్తివంతునిగా నిన్ను రూపొందించటానికి నేను పడిన శ్రమ యీనాటికి ఫలించింది'' అన్నది.

ఆమె మాటలకు దిగ్భ్రమచెంది మనోహరి, గుణసాగరి, కళ్ళార్పకుండా చూస్తుండగానే యోగిని అస్థిపంజరాన్ని తన ఎదుట నిల్పో బెట్టింది. ఆ తర్వాత, ఆవాహన చేసుకుంటూనే తన ప్రక్కనవున్న ఓ మూటను విప్పింది. అందు లోంచి ఓ చిన్న డబ్బీని కుడిచేతికి తీసుకున్నది. దానిని అస్థిపంజరం తలమీద వుంచింది. కమండలంలోని నీటిని ఆ డబ్బీమీద మంత్ర పూర్వకంగా ఓ చిన్న ధారగా విడిచింది. నిశ్చ లంగా కళ్లుమూసుకుని ''అష్టాదశవర్షకాలే-అస్థికా నిర్మాణకౌశలే-ప్రాప్యతాం మహాబలే'' అని ఎముకల ఎదుగుదలకు, పటుత్వానికి సంబంధించిన మంత్రాన్ని జపించింది. వెంటనే మనోహరికి, గుణసాగరికి, వూహాతీతమైన విస్మయాన్ని కలిగిస్తూ డబ్బీమూత విడివడి ప్రక్కనపడటం, డబ్బీలోని పసుపుపచ్చద్రావకం అస్థిపంజరం శిరభాగంనుంచి కాళ్ల చివర భాగాలదాకా అంగుల మంగుళాన్ని తడుపుతూ పోవటం క్షణాలుమీద జరిగాయి. అనంతరం యోగిని మూటలోంచి మరో డబ్బీని తీసి, అస్థిపంజరం తలమీది మొదటి

డబ్బీని తొలగించి, దాని స్థానంలో రెండవ డబ్బీని వుంచింది. దానిమీద కమండల జలాన్ని ధార విడిచి మళ్లీ కళ్లుమూసుకున్నది. "అష్టాదశ వర్ష సమయే-రక్తమాంసమేధోమయే-బుద్ధిజ్ఞాన విద్యా స్పర్శ పరాక్రమ వినిమయే-ప్రాప్యతాం పరంత పయే" అని చర్మమూ, రక్తమూ, నరాలూ, మెదడు, జ్ఞాపకము, జ్ఞానము, శౌర్యము, విద్య మొదలైనవన్నీ ఏర్పడి అవి పెరగటానికి సంబంధించిన మంత్రాన్ని పఠించింది. ఆ డబ్బీలోంచికూడా మొదటి డబ్బీలోంచిలాగే ద్రావకం మూతను ఛేదించుకునివచ్చి అస్థిపంజరాన్ని పూర్తిగా తడిపింది. అటుపిమ్మట యోగిని ఇంకోడబ్బీతో వేరొక ప్రక్రియను చేసింది. మరడబ్బీతో ఇంకో విధానం కలిగించింది. అన్నీ పూర్తయ్యాక నిశ్చల గంభీరదృష్టులను అస్థిపంజరంవేపు ప్రసరింపజేస్తూ "చిరంజీవీ! రాజవంశంలో జన్మించిన స్త్రీనైన నేను పద్దెనిమిది సంవత్సరాల పాటు తపస్వినిలా దీక్ష వహించి ఎన్నో అద్భుత విద్యలు సాధించాను. హిమాలయాల్లోని గొప్ప గొప్ప ఔషధులను, సంజీవని, శల్యకరణి, గైరిక, ప్రాణప్రతిష్ఠ, మొదలైన అపురూపపు మూలికలను సిద్ధులద్వారా సంపాదించి వాటినన్నిటినీ మిశ్రమం చేసి నీకు విని యోగించాను. వీటి ప్రభావం ఇక కొద్దిసేపటిలోనే నీపై ఆవహిస్తుంది. ఎప్పుడెప్పుడు నిన్ను మళ్లీ కన్నులపండువుగా చూడగలనా అని క్షణాలను లెక్కపెట్టుకుంటూ నీకోసం చూస్తూంటాను. వెళ్ళిరా తండ్రీ!" అని అస్థిపంజరాన్ని మరోమారు తనివితీరా ముద్దాడి అదృశ్యమైపోయింది.

ఆ తర్వాత అస్థిపంజరం వెనుతిరిగి ముందు



లాగే నడుస్తూ వెళ్లసాగింది. జరిగిన సంఘటనలూ! చూసిన దృశ్యాలూ తమలో ఉత్సుకతను రేకెత్తి స్తూండగా మనోహరి, గుణసాగరి, పొదరింటి చాటునుంచి బైటికి వచ్చారు. గుణసాగరి మనో హరిని చూస్తూ "యువరాణీ! దేవతవంటి ఒకానొక రాజపత్ని దర్శనంవల్ల మనం ధన్యత చెందాము. యోగినిగా మార్పుచెందిన ఆమె, గతంలో ఎన్నో విషమ సమస్యలను ధైర్యంగా ఎదుర్కొని, ఈనాటికి తనలక్ష్యం నెరవేర్చుకున్నట్లున్నది. ఆ అస్థిపంజరం నిస్సందేహంగా ఆమె కుమారుడే! మనం ఇంకా కొన్ని విశేషాలు తెలుసుకోవటానికి అవకాశం ఏర్పడవచ్చు. ముందుకు పద" అని మనోహరితో కలిసి నిశ్శబ్దంగా అస్థిపంజరం వెనుకగా కొద్దిదూరంలో నడవసాగింది.

అస్థిపంజరం మళ్లీపుంతలోంచి పైకి నడిచి, మరికొంతసేపటికి అంతకాలంనుంచి తానువున్న సమాధిదగ్గరికి చేరుకున్నది. కాస్తదూరంలో మనోహరి, గుణసాగరి ఆగారు.

సమాధి గోతిలోంచి కొన్ని దివ్యకిరణాలు సూర్య కాంతినిమించి ప్రకాశిస్తూ పైకి వచ్చాయి. అవి ఓమారు అస్థిపంజరం చుట్టూతిరిగి, దానిలో లీనమయ్యాయి. మరుక్షణం, అస్థిపంజరం పరిమాణం పెరిగింది. దానికి చర్మం ఏర్పడింది. తక్కిన అవయవాలు చక్కగా అమరాయి. మనోహరి కళ్లు ఆనందోత్సాహాలతో మిలమిల మెరుస్తూండగా, అస్థిపంజరం ఇరవైమూడు సంవత్సరాల అందమైన యువకుడుగా మార్పు చెందింది. వెంటనే మనోహరి రెండుచేతులూ సాచి ఉద్వేగంతో "మదనా!" అని ముందుకు పరిగెత్తింది. గుణసాగరి చకితురాలై ఆ మదను డెవరో? ఎల్లప్పుడూ రాజకుమారిని అంటి పెట్టుకుని ఉండే తనకి తెలీకుండా ఈ మనోహరికి ఎప్పుడు ఎలా పరిచయమయ్యాడో అర్థంకాక, అస్థిపంజరంగా ఉండి, యువకుడుగా మారిన మదనుణ్ణీ, అతని వద్దకు చేరిన మనోహరినీ చూస్తూ అలా ప్రతిమలా నిలబడి చూస్తుండిపోయింది. (ఇంకావుంది)





2

[జరిగిన కథ: సువర్ణపురి సమీపంలోని ఒక అడవిలో రంగడు, రాముడు ఇద్దరూ కట్టెలు కొట్టి తెచ్చి నగరంలో అమ్ముకునేవారు. ఒకరోజు వారు ఆ అడవిలో ఒక అరుగుమీద కూర్చొని విశ్రాంతి తీసుకుంటూండగా ఆ అరుగు కదిలి, దాని మూత బైటపడి, అందులో నుంచి ఓ చిన్న అస్థిపంజరం బైటికి వచ్చి, నడుచుకుంటూ ఎక్కడికో పోతుంది. కొంతసేపటికి అక్కడికి వచ్చిన ఆ దేశపు రాజకుమారి మనోహరి, మంత్రి కుమారి గుణసాగరీ రంగడు, రాముడు మూలంగా ఆ అస్థిపంజరం విషయం తెలుసుకుని దాన్ని అనుసరిస్తూ వెళతారు. ఆ అస్థివంజరం నడుస్తూ ఓ వనంలో ప్రవేశిస్తుంది. అక్కడ దాని రాకనే ఎదురుచూస్తూ కూర్చున్న ఒక యోగిని, ఆ అస్థివంజరాన్ని ముద్దాడి, తర్వాత తన దగ్గరున్న డబ్బీల మూతలను తెరిచి మంత్రించి ఆ అస్థిపంజరం తలపైన వుంచగా అందులోని ద్రావకం దాన్ని పూర్తిగా తడిపివేస్తుంది. యోగిని అదృశ్యమైపోయిన తర్వాత ఆ అస్థిపంజరం వెనక్కు తిరిగివచ్చి, ఆ అరుగు సమాధిని సమీపించగా అందులోనుంచి కొన్ని దివ్యకిరణాలు దాని మీద ప్రసరించి అదొక ఇరవైయేళ్ళ యువకుడుగా మారిపోతుంది. దీన్ని చూస్తున్న మనోహరి 'మదనా' అని ఆ యువకుణ్ణి సమీపిస్తుంది. గుణసాగరి ప్రతిమలా రాజకుమారినీ ఆ యువకుణ్ణీ చూస్తుండిపోయింది.... ఇక చదవండి.]

ఆమె కాషాయ వస్త్రాలు ధరించివున్నది. మెడలో రుద్రాక్షమాలికలు వున్నాయి. ముఖం రూపాయంత కుంకుమబొట్టుతో చూపరులను ఆకట్టుకుంటున్నది. ప్రక్కన దండ కమండలాలు వున్నాయి. చూపులలో ప్రశాంతత కొట్టవచ్చినట్లు కనిపిస్తున్నది.

అప్పటికి మూడురోజుల్నుంచి, సంతానంలేని వాళ్లకు పుత్రప్రాప్తి కలిగించే మహిమకలిగిన సన్యాసినిగా ఆ స్త్రీ విజయపురి పట్టణంలో పేరు మోసినందువల్ల నగరంలోని సంతానం లేని యువతులంతా గుంపులుగా ఆమె దర్శనం కోసం వస్తున్నారు. రాజమందిరం ప్రక్కనేవున్న సత్రంలో ఆ సన్యాసిని బసచేసివున్నది.

వచ్చిన వాళ్లందరినీ ఆశాజనకములైన మాటలతో సంతృప్తిపరుస్తూ, వీబూది బొట్టు పెడుతూ, తలమీద లేపనం రాస్తూ, సంవత్సరం తిరిగేసరికి తన ప్రక్రియలద్వారా పండంటి కొడుకు పుడతాడని చెబుతూవున్నది. వచ్చే పోయే యువతులతో ఆ సత్రం కిటకిటలాడుతున్నది. కొంతసేపటికి ఇద్దరు పరిచారికలు వచ్చి ఆ సన్యాసినికి నమస్కరించి, రాజపత్ని దర్శనంకోరి వచ్చివున్నదని సన్యాసినికి చెప్పారు.

రాజపత్ని రాక తెలుసుకున్న యువతులంతా అటూయిటూ బారులుతీరి, భక్తిశ్రద్ధలతో నిల్చు న్నారు. సన్యాసిని ఓ పరిచారికను చూస్తూ

కిరణ్ కుమారి



'మాకందరూ ఒకటే. వచ్చి ఆమెకేంకావాలో అడగమని చెప్పు.'' అన్నది. పరిచారికలు వెళ్లిన కొద్దిసేపటికి రాజపత్నివచ్చి సన్యాసినికి నమస్కరించి, ఎదురుగా కూర్చున్నది. సన్యాసిని ''మహారాణీ! మీ వయస్సు దాదాపు ఇరవైవుండొచ్చు. పిల్లలు కలుగరేమోనన్న ఆలోచన అప్పుడే మీకెందుకు కలిగింది?'' అన్నది.

రాజపత్ని వినయంతో ''మాతా! మీ దర్శనంవల్ల వచ్చే నష్టమేమీ లేదుకదా? జరిగితే మంచి జరుగుతుందిగాని, చెడు జరగదుకదా?'' అన్నది.

సన్యాసిని నవ్వి "మంచి మనస్సుతో వచ్చిన కు మంచే జరుగుతుంది.'' అని అంతకుముందు రయువతులకు చేసిన ప్రక్రియలనే చేసింది.

రాజపత్ని "అమ్మా! ీకభ్యంతరం లేకపోతే నా మందిరంలో విడిదిచెయ్యండి. మీకిష్టమైనంత కాలం వుండొచ్చు'' అన్నది. సన్యాసిని తల అడ్డంగా వూగిస్తూ "సునందాదేవీ! నేను సంపాదించిన శక్తులను సాటి స్త్రీలకు వుపయోగిస్తూ దేశాలన్నీ తిరుగుతున్నాను. ఒకేచోట వుండటం నాకిష్టంలేదు. అదీగాక జోగినులమైన మాకు రాజమందిరాలు నివాసయోగ్యాలు కావు. నేను వచ్చి ఇప్పటికి మూడు రోజులైంది. మూడురోజులకంటె ఎక్కువ కాలం ఎక్కడావుండను. మీకు కుమారుడు కల్గిన తర్వాత మళ్లీ వస్తానులే'' అన్నది

ఆ తర్వాత సునంద సన్యాసినికి పాద నమస్కారంచేసి, అక్కడినుంచి వెళ్లిపోయింది. స్వయంగా మహారాణే సత్రానికివచ్చి సామాన్య యువతిలా సన్యాసినిని సేవించి, అనుగ్రహం పొందిందన్నవార్త నగరంలోని వాడవాడలా ప్రాకిపోయింది. అందువల్ల సంతాంలేని యువతులంతా తండోపతండాలుగా సత్రంలోకి రాసాగారు.

వచ్చిన యువతులందరికీ సన్యాసిని యథాప్రకారం విబూది బొట్టుపెట్టి, తలలమీద లేపనంరాసి, దీవించి పంపించింది. దాదాపు అర్ధరాత్రిదాకా సన్యాసినికోసం విజయపురిలోని యువతులంతా పుత్రసంతానప్రాప్తి పొందే ఆశతో రాకపోకలను కొనసాగించారు. అర్ధరాత్రి తర్వాత సన్యాసిని సత్రం విడిచి వెళ్లిపోయింది.

అర్ధరాత్రికీ, సూర్యోదయానికీ, మధ్యదశను నిర్దేశించే నగారా కోటలో మ్రోగింది. దక్షిణం బురుజు వీధిలోని గురవయ్య ఇల్లు నిశ్శబ్దవాతావరణంలో నిద్రపోతున్నట్లున్నది. గురవయ్య కోడలు

నాగులమ్మ ఇరవైరెండు సంవత్సరాలయువతి. సన్యాసిని దర్శించిన యువతుల్లో ఆమె కూడా ఒకతె. నగారా మ్రోగిన కొద్ది క్షణాల తర్వాత గాఢనిద్రలోవున్న నాగులమ్మ ఎవరో తట్టి లేపినట్లు కళ్లు తెరిచింది. తనమీద చెయ్యి వేసి, గుర్రు పెట్టి నిద్రిస్తూన్న భర్తను చీడపురుగులా చూసింది. అతడి చేతిని విసుగుగా ప్రక్కకు తొలగించి లేచి మంచం దిగింది. ఆమె చెవులకు "రా-నా దగ్గరికి-రా-రా-రా" అన్న మాటలు ఓ స్త్రీ గొంతుకనుంచి కర్కశంగా వినిపించ సాగాయి. నాగులమ్మ ముఖంలో మార్పువచ్చింది. కళ్లు చింతనిప్పుల్లా ఎర్రగా అయ్యాయి. శరీరాన్ని కరుకుదనం ఆవరించుకున్నది. గదినుంచి బైటికి వచ్చి అత్తమామలు నిద్రిస్తూన్న మంచాలమధ్యగా వీధివాకిలివేపు నడిచింది. అలా నడుస్తూండగా కుడిచెయ్యి అత్త శరీరానికి తగిలింది. ఆమె చెయ్యి తగిలినచోట చురుక్కుమనగా అత్త బాధతో అరుస్తూ మేల్కొన్నది.

భార్య అరుపు వినగానే గురవయ్య వులిక్కిపడి లేచాడు. నిద్ర చెడిపోయినందుకు విసుక్కుంటూ "ఏమైందే నీకు? ఎందుకలా కొంప మునిగినట్టు గావుకేక పెట్టావు?" అన్నాడు.

ఆమె శరీరానికి కోడలు చెయ్యి తగిలినచోట ఇంకా మండుతూనే వున్నది. బాధ వ్యక్తం అవుతూన్న స్వరంతో "ఏ తేలో, జర్రో కుట్టినట్లయిందండీ. మంట ఇంకా సలుపుతూనేవున్నది" అన్నది.

గురవయ్య మంచందిగి "దీపం వెలిగిస్తాను




వుండు. అయినా, తేలూ, జర్రీ మంచాలమీది కెక్కి కుట్టటం ప్రారంభించాయన్నమాట." అంటూ ప్రక్కకుతిరిగి "అఁ? వీదివాకిలి తీసుకుని కోడలుపిల్ల ఎక్కడికో పోతున్నదే?" అన్నాడు. ఆ మాటలతో గురవయ్య భార్యకూడా మంచం నుండి దిగి "అయ్యో, అయ్యో! ఇంత రాత్రప్పుడు ఒక్కతే ఎక్కడికి పోతుందండీ! పదండి అడుగుదాం" అన్నది.

గురవయ్య "నువ్వు వెళ్లి అడుగు. నేనూ నీవెంటే వస్తాను." అన్నాడు. భార్యాభర్తలిద్దరూ గబగబా వీధిలోకి వచ్చారు. అప్పటికే నాగులమ్మ వీధినపడి ముందుకు సాగిపోతున్నది. గురవయ్య భార్య గబగబా వెళ్లి "అమ్మాయ్, నాగులూ! ఎక్కడికే అలా వెళుతున్నావ్? ఎవరైనా చూసే



బావుండదు. ఇంట్లోకిపద. అబ్బాయీ నువ్వూ దెబ్బలాడుకున్నారా?" అని మెల్లిగా అడుగుతూ వెంట నడవసాగింది. నాగులు మాట్లాడలేదు. ముందుకు నడుస్తూనేవున్నది.

గురవయ్య భార్య "మాట్లాడవేమే? మంచీ మర్యాదా లేకుండా అర్ధరాత్రీ అపరరాత్రీ వయసులోవున్న ఆడది వీధులవెంట తిరగ్గూడదని తెలీదూ?" అని నాగులు చెయ్యిపట్టుకుని ఆప బోయింది. మరుక్షణం, విద్యుత్తు తగిలినట్లు శరీరం అంతటా వేడిపుట్టగా కెవ్వున అరిచి దభాలున క్రింద పడిపోయింది. గురవయ్య ఆ సంఘటనకు గుండెలు బాదుకుంటూ తనూ ముందుకు పరుగెత్తి కోడలి చెయ్యి పట్టుకుని వెనక్కిలాగబోయాడు. అతడికి కూడా భార్యగతే పట్టింది. నాగులు అదేమీ పట్టనట్లు ముందుకు సాగిపోయింది.

అదే సమయంలో రాజవీధిలో అప్పటిదాకా గస్తీతిరిగిన శరభయ్య అనే భటుడు ప్రక్కవీధి తిరగటానికి మలుపుదగ్గరికి వచ్చాడు. అప్పుడే ప్రక్కనవున్న ఒ ఇంటి వీధివాకిలి తెరుచుకుని ఓ యువతి బైటికి వచ్చింది.

శరభయ్య చూస్తూండగానే ఆ యువతి తననేదో పిశాచం ఆవహించినట్లు సూటిగా ముందుకు చూస్తూ కోటద్వారంవున్న వీధివేపు నడక సాగించింది. ఆమె బైటికి రావటానికే ఆశ్చర్య పడుతూన్న శరభయ్యకు ఆ నడుస్తూన్న తీరు, ఆ చూపూ మరింత ఆశ్చర్యాన్ని కలిగించింది.

అతడు గబగబా ఆమెదగ్గరికి వెళ్లి "అమ్మాయ్! నువ్వు పుల్లమ్మ కోడలివికదూ? తెల్లవారుఝాము కూడా కాని ఈరాత్రిసమయంలో ఒంటరిగా ఎక్కడికి వెళుతున్నావమ్మా?" అని అడిగాడు.

కాని, ఆ యువతి అతడికి సమాధానం చెప్పలేదు. కన్నెత్తికూడా చూడలేదు. యధాప్రకారం తనధోరణిలో తాను ముందుకు పోసాగింది.

శరభయ్య ఆమె ప్రవర్తనకు విస్తుపోతూనే "మీ అత్తతో పోట్లాడావేమిటి? అలిగి పుట్టింటికి పోతున్నావా? తెల్లారాక నేను వచ్చి మాట్లాడుతాలే! ఇంటికిపద" అన్నాడు.

పుల్లమ్మ కోడలు ఆగలేదు. శరభయ్య మాటలు తనకు వినిపించనట్లు తదేకంగా ముందుకు చూస్తూ అలాగే వెళ్లసాగింది.

13

శరభయ్య ఇక మాటల్లో లాభంలేదనుకుని "ఆయ్! రాజవీధిలో కావలా కాసే వాడిని, నాకు ఈ వీధిలోవాళ్లంతా మర్యాదయిస్తారు. నువ్వు బదులుకూడా చెప్పవేమిటి? ఇలా రాత్రిళ్లు వీధులు తిరిగేవాళ్లని పట్టుకుని ఖైదులో పెట్టించటమే నాపని. చెప్పినట్లు వినకపోతే, చివరకు చెరసాల పాలవుతావు. ఆగు" అని ఆ యువతి చెయ్యి పట్టుకున్నాడు.

మరుక్షణం శరభయ్య కెవ్వున ఓ గావుకేకవేసి బొంగరంతిరిగినట్లు గిరగిరా తిరుగుతూ క్రింద పడి స్పృహ కోల్పోయాడు. పుల్లమ్మకోడలు కన్నార్పకుండా ముందుకే చూస్తూ ముందుకు నడవ సాగింది.

ఆ విధంగా విజయపురిలోని వివాహిత యువతులంతా విచిత్రమైన అవస్థకు లోనై, తమ్ము ముట్టుకున్న వాళ్లనందరిని విద్యుదాఘతంసోకిన వాళ్లనుగాచేస్తూ, ఊరికి దక్షిణంగా కొస్తదూరంలోవున్న స్మశానందగ్గరికి చేరుకున్నారు. నగరంలోని దాదాపు పెళ్ళయిన యువతు లందరూ కొన్నివేలమంది అక్కడ గుమిగూడారు. వాళ్లలో రాజపత్ని సునందాదేవికూడా వున్నది. అంత మందివున్నా అక్కడ కోలాహలం లేదు.

స్మశానం మధ్యలో ఓ సమాధిమీద కూర్చుని, అంతకుముందు మూడురోజుల్నుంచి విజయపురిలోని పెళ్ళయిన యువతులమీద ప్రయోగం చేసిన సన్యాసిని 'రా-నా దగ్గరికి రా- రా- రా- రా" అని ఇంకా పిలుస్తూనే వున్నది.

కొద్దిసేపటికి "ఓసీ! కాలంధర తాంత్రకీ! రావలసిన వాళ్లంతా వచ్చారు. నీ ఉపాసనకు మెచ్చి, నీ కోరిక ప్రకారం ఇంతసేపూ నిన్ను ఆవహించిన కర్ణపిశాచినైన నేను ఇక నిన్ను వదలి వెళుతున్నాను. తర్వాత కాగల కార్యానికి ఏర్పాట్లు చేసుకో" అన్న మాటలు సన్యాసిని చెవులకు వినిపించటమూ, ఆ సన్యాసిని నోటినుంచి "రా- నా దగ్గరికి రా- రా- రా- రా" అన్నమాటలు ఆగిపోవడమూ ఒక్కసారిగా జరిగాయి.



కర్ణపిశాచి తననుండి విడిపోగానే మామూలు స్థితికి వచ్చిన కాలంధర అనే మంత్రగత్తె తన ఎదుట గుంపులు గుంపులుగా నిల్చొనివున్న యువతులకేసి ఓమారు సంతృప్తిగా చూస్తూనే "హహ్హహ్హహ్హ! సన్యాసినిగానటించి, నా అభీష్టం నెరవేర్చుకున్నాను. ఇక వీళ్లనందరినీ నా నివా



సానికి చేర్పించాలి. పెళ్లై, భర్తలతో కాపురం చేస్తూ, సంతానం లేని వందమంది క్షత్రియ యువతులూ, అదే కోవకి చెందిన ఇతర జాతుల యువతులు లక్షమంది కావాలి. మిగిలిన వాళ్లను కూడా ఇలాగే యుక్తిగా నా అధీనంలోకి తెచ్చుకుని, ఆ తర్వాత కాలభైరవ మాంత్రికుణ్ణి కలుసు కుంటాను'' అని సమాధిమీదినుండి లేచింది.

ఆ తర్వాత, సునందాదేవిని వుద్దేశించి తన దగ్గరికి రమ్మన్నట్లు చెయ్యి వూగించింది. ఏదో పూనకం ఆవహించినదానిలా రాజపత్ని కాలంధర ఎదుటికి వచ్చింది. ఆ మంత్రగత్తె రాజయువతిని చిరునవ్వుతో చూస్తూ ''రాణీ! నువ్వెవరివి?'' అన్నది.

సునంద నిశ్చలంగా కాలంధరను చూస్తూ ''నువ్వేది చెప్పినా చెయ్యటానికి సిద్ధంగావున్న నీ సేవికను'' అన్నది.

కాలంధర తక్కిన యువతులకేసి చూస్తు బిగ్గరగా ''మీరంతా ఎవరు?'' అన్నది. వారందరూ ఏకగ్రీవంగా "నీ సేవికలం" అన్నారు.

అనంతరం మంత్రగత్తె కుడిచేతిని పైకెత్తి గాల్లో వూపుతూ ఓ మంత్రాన్ని వుచ్చరించింది. మరుక్షణం ఓ తాంత్రికకోల ఆ చేతిలోకి వచ్చింది. కాలంధర ఆ మంత్రకోలను తన నుదుటిమీద ముమ్మారు సోకించి "అహెరా, జంబోధర నాయకా!" అని అరిచింది.

వెంటనే ఆ పరిసర ప్రదేశమంతా అదిరి పోయేట్లు భయంకరంగా వికృతమైన అట్టహాసం చేస్తూ, ఓ రాక్షసుడు అక్కడ ఆవిర్భవించాడు.

కాలంధర అతణ్ణి చూస్తూ ''నీ దేహం పెంచి ఈ యువతులందరినీ తలమిద, భుజాలమీద ఎక్కించుకుని మన నివాసానికి తీసుకురా!'' అన్నది.

ఆ రాక్షసుడు తలవంచి 'అలాగే నాయకీ!' అన్నాడు. కాలంధర మళ్లీ మంత్రకోలను నుదుటికి సోకించుకుని, అక్కణ్ణుంచి అదృశ్యురాలైంది.

ఆ సమయంలో విజయపురి యువరాజు సూర్యప్రతాపసింహుడు గురుకులంలో విద్యాభ్యాసం ముగించుకుని, స్వదేశానికి తిరిగివస్తున్నాడు. చిన్నప్పుడే పోగొట్టుకున్న తల్లిదండ్రులను మరిపిస్తూ తన్ను ఎంతో గారాబంగా ప్రాణసమానంగా చూసుకునే అన్న ప్రభాకరసింహుడు, వదినె సునందాదేవిని ఎప్పుడెప్పుడు కన్నుల

పండువుగా చూడగలనా, అన్న ఆదుర్దాతో అతడు గురుకులంనుంచి బయలుదేరినప్పటి నుండి ఎక్కడా విశ్రాంతి తీసుకోకుండా హుటా హుటిగా ప్రయాణిస్తూ నగరానికి చాలా సమీపంగా వచ్చాడు.

అప్పటికి తెల్లవారుఝాము కూడా దాటి పోయింది. ఉషస్సు ఉదయించటానికి ఇంకా ఎంతోసేపు లేదు.

సూర్యప్రతాపునికి అల్లంతదవ్వులో కోట, బురుజులు, గోపురాలు, మేడలు కనిపించగానే మనస్సు ఉత్సాహంతో నిండిపోయింది. చల్లగాలి కన్నతల్లి చెయ్యిలా శరీరాన్ని సోకుతుండగా అతడు గుర్రాన్ని పరుగులు తీయిస్తూ స్మశానం ప్రక్కగావున్న పెద్దబాటమీదకు వచ్చాడు. అక్కడికి రాగానే గుర్రం సకిలిస్తూ ఆగిపోయింది..

హఠాత్తుగా తనగుర్రం ముందుకి వెళ్ళకుండా అలా మొండికి వెయ్యటానికి ఆశ్చర్యపోతూనే ప్రతాపుడు తలత్రిప్పి అటూ ఇటూ చూశాడు. అశ్వదృష్టి అంటే ఏమిటో అప్పుడర్థమైంది అతనికి. గుర్రాలకు ఎదురుచూపుకంటే ప్రక్క చూపులెక్కువనీ, అందుకే వాటిదృష్టి ప్రక్కకు పోకుండా కళ్ళదగ్గర చర్మపు తొడుగులను వుంచుతారనీ అతడు చదివేవున్నాడు. అశ్వం గ్రహించి, సంజ్ఞాపూర్వకంగా తనకు తెలియజేసిన విశేషాన్ని ప్రతాపుడు విభ్రాంతితో కొన్ని క్షణాలు చూశాడు.

స్మశాన మధ్యభాగంలో అతిభీకరాకారుడైన ఓ రాక్షసుడు క్రమక్రమంగా పెరుగుతున్నాడు. అతడు ఎత్తుకు పెరిగేకొద్దీ శరీరావయవాలు కూడా పెద్దవవుతున్నాయి.

ఆ రాక్షసుని ఎదురుగా కొన్నివేలమంది



యువతులు నిల్చునివున్నారు. వాళ్లంతా యెవరు? ఆ రాక్షసుడెందుకు అలా శరీరాన్ని పెంచుతున్నాడు? తమ రాజధాని ముందు ఈ సంఘటన జరగటానికి కారణమేమిటి?

ఒకవేళ ఆ ఆడవాళ్లంతా తన అన్న పరిపాలనలోవున్న తమ రాజ్యానికి చెందినవాళ్లా? లేక, ఇతర రాజ్యాలకు సంబంధించినవాళ్ళా?...

సూర్యప్రతాపుడు అలా ఆలోచిస్తూండగానే రాక్షసుడు ఓ చిన్న కొండంత పరిమాణానికి తన శరీరాన్ని పెంచి, అంతటితో ఆ పెరుగుదలను ఆపి, యువతుల ముందు కూర్చున్నాడు. యువతులంతా నిచ్చెనలమీదనుంచి ఎక్కినట్లు రాక్షసుడి శరీరం మీదకి ఎక్కి తలనుంచి ఉదర భాగందాకా చెట్లకొమ్మలా విస్తరించిన రోమాలమీద కూర్చున్నారు. అప్పటికి తెల్లగా తెల్లవారింది.

విజయపురి యువతులంతా రాక్షసుడి శరీరాన్ని ఆక్రమించగానే, చిట్టచివరన సునందాదేవి కూడా అతడి శరీరాన్ని ఆరోహిస్తూ ప్రతాపుడికి దిగ్భ్రాంతిని కలిగించింది. అక్కడి పరిస్థితి ఏమిటో తనకేమాత్రం అర్థం కాకపోయినా, వదినను కాపాడుకోవాలన్న తాపత్రయంతో అతడు గుర్రాన్ని ప్రక్కకు మళ్ళించి ముందుకు పరుగులు తీయించాడు.

ప్రతాపుడు సరిగా ఆ జంబోదర రాక్షసుడి దగ్గరికి వచ్చేసరికి వికృతాట్టహాసాలతో ఆ ప్రదేశాన్ని దద్దరిల్లజేస్తూ, ఆ రాక్షసుడు పైకిలేచాడు. వెంటనే ప్రయాణాన్ని సంకల్పించుకుని ఆకాశానికి ఎగురబోయాడు. ప్రతాపుడు గుర్రం మీది నుండి అలాగే పైకి లంఘించి రాక్షసుడి కుడి కాలి చిటికెనవ్రేలిని రెండుచేతులతో గట్టిగా పట్టుకున్నాడు. ఓపెద్ద కొమ్మను పట్టుకున్నట్లు అనుభూతి చెందుతూ ప్రతాపుడు రాక్షసుడితోబాటు ఆకాశానికి చేరుకోసాగాడు. అశ్వం మోరపైకెత్తి ఆ దృశ్యాన్ని చూస్తూ దీనంగా సకిలించటం ప్రారంభించింది. (ఇంకావుంది)





[జరిగిన కథ: విజయపురి పట్టణంలోని సత్రంలో బసచేసిన ఒక సన్యాసినిని ఆ నగరంలోని సంతానంలేని వివాహిత యువతులందరూ వెళ్ళి దర్శిస్తారు. విజయపురి రాజపత్ని సునందాదేవి కూడా స్వయంగా వెళ్ళి సన్యాసినిని కలుసుకుంటుంది. ఆ వచ్చిన వాళ్ళందరికీ సంవత్సరం తిరక్కుండానే పండంటి కొడుకు పుడతాడని, బొట్టుపెట్టి లేపనం తలపైన రాస్తుంది సన్యాసిని. మూడవ రోజు రాత్రి ఆ సన్యాసిని సత్రం వదిలి వెళ్ళిపోయిన తరువాత, అర్థరాత్రికీ, సూర్యోదయానికీ మధ్య కోటలో నగారి మ్రోగగానే, ఆ సన్యాసినిచే బొట్టు పెట్టబడిన యువతులందరూ, మహారాణితో సహా లేచి, ఒక్కొక్కరుగా ఊరి చివరనున్న స్మశానం వైపు వెళ్ళి తమ కోసం ఎదురు చూస్తున్న ఆ సన్యాసిని ముందర నిలబడతారు. సన్యాసిని జంబోదర అనే రాక్షసుణ్ణి పిలిచి, ఆ యువతులందర్నీ తన నివాసం చేర్చమంటుంది. ఆ రాక్షసుడు కొండంత పెరిగి, యువతులందర్నీ తనమీద ఎక్కించుకుని, బయలుదేరే సమయంలో, విజయపురి యువరాజు గురుకులంనుంచి తిరిగి వస్తూ, ఆ దృశ్యాన్ని చూసి, రాక్షసుని మీదున్న యువతుల్లో తన వదిన కూడా ఉండటం చూసి, దిగ్భ్రాంతుడై, గుర్రం దిగి వెంటనే వెళ్ళి ఆ రాక్షసుని సమీపిస్తాడు. అంతలో రాక్షసుడు ఆకాశంలోకి ఎగురుతుండగా, సూర్యప్రతాపుడు రాక్షసుని కాలి చిటికెన వేలు పట్టుకుని వేలాడుతూ తనూ రాక్షసుడితో బాటు ఆకాశాన్ని చేరుకుంటాడు. ఇక చదవండి]

"మదనా! మదనా!!" అంటూ పరుగెత్తి వచ్చి తన్ను కౌగలించుకున్న అందాల బొమ్మనే వింతగా చూస్తూ ఆ యువకుడు ఆమె కౌగిలిని విడిపించుకుని కొంచెం ప్రక్కకు తొలగి నిల్చున్నాడు. అప్పటికే ఆ యువతిని సమీపించి గట్టిగా చెయ్యి పట్టుకుని వూగిస్తూ "మనోహరీ! మనోహరీ! ఏమైంది నీకు? అసందర్భంగా ఈ మాటలేమిటి? నీ ప్రవర్తన ఎందుకిలా మారింది? ఆయన పేరు మదనుడని ఎవరు చెప్పారు నీకు?" అన్నది గుణసాగరి.

యువకుడు గుణసాగరిని గౌరవదృష్టులతో చూస్తూ "సోదరీ! ఆమెకెవరు చెప్పారో తెలియదు గాని, నాపేరు మదనుడే! చిన్నప్పుడు నా తల్లి దండ్రులు పెట్టిన పేరు అదే!" అన్నాడు. అతడి మాటలకు గుణసాగరి విస్మయం చెందింది.

మనోహరి మదనుణ్ణి ప్రేమ నిండిన చూపులతో ఆపాదమస్తకం అభిషేకిస్తూ "ఏవరో కాదు, మీరే చెప్పారు" అన్నది.

మదనుడు అందమైన కనుబొమ్మలు సుందర ముఖ మండలానికి మరింత వనె తెస్తూండగా

కిరణ్ కుమారి



భ్రూకుటి ముడివడజేసి "నేనా? మిమ్మల్నెప్పుడు చూశాను" అన్నాడు.

మనోహరి చిరునవ్వుతో "విజయపురిలోని రాజ మందిరంలో" అన్నది. ఆమె మాట్లాడుతున్న ధోరణి తనకి పిచ్చెక్కిస్తుందేమోనని గుణసాగరి భయపడింది.

—మదనుడనే ఒకానొక రాజకుమారుడు ఏ కారణంచేతనో ఐదేళ్ల పసి వయస్సులో మృతి చెందాడు. అతడి తల్లియైన ఒక మహారాణి భర్తను కూడా శాశ్వతంగా పోగొట్టుకున్నది. అయితే, ఆమె పిరికితనంతో ఆత్మహత్య చేసుకోవటమో, జీవితాంతం కుమిలిపోవటమో చెయ్యకుండా ధైర్యంతో ఆశతో భవిష్యత్తును తనకు అనుకూలంగా మల్చుకోవటానికి నిశ్చయించుకున్నది. ఆ నిశ్చయం రూపొందించిన ఒకానొక అద్భుతమైన పథకాన్ని ఆచరణలో పెట్టటానికి పూనుకున్నది.

పద్ధెనిమిది సంవత్సరాలు ఎక్కడెక్కడో తిరిగి, గొప్ప గొప్ప యోగినీ యోగపుంగవులకు శుశ్రూషలు చేసి వారి వాత్సల్యాన్ని చూరగొన్నది. ఎన్నెన్నో యోగవిద్యలను, మహిమలను సంపాదించగలిగింది. హిమాలయాలకు వెళ్లి, తాను నేర్చిన దివ్య విద్యలు ఆధారంగా మహత్తరములైన ఓషధులను, మూలికలను సేకరించగలిగింది.

శరీరం వెయ్యి ముక్కలు అయినా, కేవలం స్పర్శ మాత్రంతోనే ఏ జీవి అయినా తిరిగి యధా ప్రకారంగా శరీరాన్ని పొంది జీవించేట్టు చేయగల సంజీవనిని గురించి పురాణాలు స్పష్టం చేశాయి. అలాగే ప్రాణ ప్రతిష్ఠకు అవసరమైన శక్తి కలిగిన గైరివాది ధాతువులు కూడా వున్నాయి. అటువంటి వాటినన్నిటినీ కలిపి మర్దనం చేసి, ద్రవీ భూతమైన ద్రావకాలుగా తయారు చేసింది. వాటిని తీసుకొని ఆనందంతో పద్దెనిమిది సంవత్సరాల క్రింద సమాధి చేయబడిన తన కుమారుని అస్థి పంజరం వున్న చోటుకి సమీపంగా రహస్యమై ఒక ఏకాంత ప్రదేశంలో విడిది చేసింది. తన యోగ విద్యా బలంతో సమాధిని పెకల్చుకుని, కుమారుని అస్థిపంజరం తన దగ్గరికి నడిచి వచ్చేట్టు చేసుకున్నది. అలా వచ్చి సన్నిధిచేసిన అస్థిపంజరాన్ని పద్దెనిమిది సంవత్సరాల మధ్యకాలంలో ఎదగవలసిన విధంగా ఎదిగేట్టు తను నేర్చిన దివ్య మంత్రాలను

ఆవాహన చేయించి, ద్రావకాలతో అభిషేకించింది. ఫలితంగా ఐదు సంవత్సరాల వయస్సులో మరణించిన మదనుడనే ఈ రాజపుత్రుడు ఇరవై మూడు సంవత్సరాల యువకుడుగా అద్భుత రీతిలో మార్పు చెందాడు. తల్లి ప్రసాదించిన దివ్య శక్తుల ప్రభావంవల్ల ఐదేళ్ల తర్వాత ఇప్పటిదాకా ఒక సుక్షత్రియపుత్రునికి అలవడవలసిన గుణాలు, సాహస పరాక్రమాలు, సర్వ విద్యలు, జ్ఞానశక్తులూ, అన్నీ అలవడ్డాయి.... తాను, మనోహరి కబ్బెలు కొట్టుకునే వాళ్ళిద్దరూ చెప్పిన మాటలు విని అస్థిపంజరాన్ని అనుసరించగా తెలిసిన విషయాలు ఇవి!...

అయితే, మనోహరి మదనుణ్ణి పేరు పెట్టి పిల్చింది. భర్తను భార్య కౌగలించుకునేట్టు అతణ్ణి కౌగలించుకున్నది. పైగా విజయపురిలోని రాజ మందిరంలో కలుసుకున్నదట! విజయపురి రాజమందిరానికి మనోహరికి రాక పోకలు వున్నాయి గాని, మదనునికి ఆ అవకాశమేది? ఐదు సంవత్సరాల వయస్సులో మరణించి, ఇప్పటికి కొంత సేపటికి క్రిందటే పునర్జన్మ పొందినట్లు శరీరాన్ని పొందాడు—

ఆ విధంగా ఉవ్వెత్తునా కెరటాల్లా తనలో లేచి చెలరేగుతూన్న ఆలోచనలను బలవంతంగా అణచుకుంటూ, ఇద్దరి మాటల వల్ల తేలేదేమిటో స్వయంగా విని తెలుసు కోవాలిసిందేగాని, వూహించటానికి వీలు కాదని భావించిన గుణసాగరి తదేకంగా వాళ్లవేపే చూడసాగింది.

మనోహరి మాటలకు ఆశ్చర్యం చెందుతూనే




కొంత తడవు తీవ్రంగా ఆలోచించి మదనుడు "సుందరీ! ఎంత ఆలోచించినా జ్ఞాపకం రావడం లేదు. విజయపురి రాజమందిరానికి నేనేందుకు వస్తాను? అక్కడ నాకెవరూ లేరే?" అన్నాడు.

మనోహరి ఓరగా అతణ్ణి చూస్తూనే "నాకున్నారు. ప్రభాకరసింహుడు, సూర్యప్రతాపసింహుడు, వరుసకు నా అన్నలు. పెళ్లైన నాలుగేళ్లనుంచి నెలకొకసారైనా నేను వాళ్ల మందిరానికి వచ్చి కొన్ని దినాలు అక్కడ వుండాలని మా వదినె సునందాదేవి పట్టుబట్టేది. అందువల్ల అప్పుడప్పుడు మా మంత్రి పుత్రియైన ఈ గుణసాగరితో కలిసి విజయపురి వెళ్లేదానిని. సంవత్సరం క్రిందట అక్కడొకసారి మిమ్మల్ని కలుసుకున్నాను. మీపేరు కూడా చెప్పారు. అంతే కాదు, మనం ఒకర్నొకరు



ప్రేమించుకోవడం తెలుసుకున్న మా వదినె మనిద్దరికీ వివాహం కూడా జరిపించింది" అన్నది.

ఈసారి మనోహరి మాటలు మదనునిలో ఏ విధమైన ఆశ్చర్యాన్ని కలిగించలేదు. అప్పటికే, ఆమె పిచ్చిదై వుంటుందని అతడొక నిర్ధారణకు వచ్చాడు.

కాని, గుణసాగరి మాత్రం ఇక వుండబట్టలేక పోయింది. మళ్లీ చెయ్యిని గట్టిగా వూగిస్తూ "యువరాణీ, అయితే, నీపెళ్లి సమయంలో నేను నీదగ్గర లేనా?" అన్నది.

మనోహరి నవ్వి "మదనుడితో బాటు నువ్వు కూడా నా కలలోకి వచ్చివుంటే వుండేదానివి అన్నది. ఆ మాటలకు మదనుడు తల వూగిస్తూ "రాజపుత్రీ! ప్రస్తుతం నేను నాతల్లి ఆజ్ఞ ప్రకారం కొన్ని కార్యాలను సాధించటానికి వెళుతున్నాను. ఇంతకు ముందు నీ కలలోకి రావటానికి కూడా నాకు వీలు కాకపోవచ్చు. ఏదో కారణంగా పరిచయమై ఏదో విధంగా నామీద అభిమానం చూపించిన మీకిద్దరికీ కృతజ్ఞతలు" అని చెప్పి కళ్లు మూసుకున్నాడు. మనస్సులో తల్లిని ధ్యానించుకొని రూపాంతరాన్ని తను కోరిన విధంగా సంకల్పించుకున్నాడు.

మరుక్షణం మదనుడు సమవిశాలములైన రెక్కలతో, వాడియైన ముక్కుతో, పొడవైన వాడికాళ్ల గోళ్లతో, దిగ్భ్రాంతి కలిగించే బ్రహ్మాండమైన ఓ పక్షిగా మారిపోయాడు. మనోహరి నిరాశగా, గుణసాగరి వింతగా చూస్తూండగానే ఆ పక్షి రెక్కలు టపటపలాడిస్తూ పైకి లేచింది. ఉత్తర క్షణం కన్నుమూసి తెరిచేలోగా గగనమండలానికి చేరుకొని అక్కడినుండి రివ్వున ముందుకు సాగిపోవడం ప్రారంభించింది.

ఆపక్షిరాజం కనిపించే దాకా చూసి, కనుమరుగు కాగానే మనోహరి "గుణసాగరీ! ఇప్పటి దాకా జరిగిదంతా ఇంద్రజాలంలా వున్నది కదూ?" అన్నది.

గుణసాగరి తల అడ్డంగా త్రిప్పి "మహాతల్లీ! ఇప్పటిదాకా జరిగింది ఇంద్రజాలం కాదు గాని, నువ్వు మదనుణ్ణి అలా కౌగిలించుకోవటమూ, పేరు పెట్టి పిలవడం, విజయపురి రాజమందిరంలో కలుసుకోవటం, మీ వదినగారైన సునందా మహారాణిగారు మీకిద్దరికీ పెళ్లి చెయ్యటమూ మాత్రం మహేంద్రజాలంలా వున్నది. ఇంతకూ

ఆ కల ఏమిటి, కలలోకి మదనుడు రావడమేమిటి? సంవత్సరం నుంచి నాకు ఈ విషయం చెప్పలేదే?" అన్నది.

మనోహరి గోముగా గుణసాగరిని చూస్తూ "చెబితే నవ్విపోతావని చెప్పలేదు గుణా! పోనీ, ఇప్పుడు చెప్పనా?" అన్నది.

గుణసాగరి నవ్వి "ఇప్పుడైనా నవ్విపోనని ఎలా అనుకుంటున్నావు? నేను మంత్రి పుత్రినన్నమాట మర్చిపోకు సుమా! మదనుడు పక్షి రూపంలోకి మారి తన లక్ష్యాన్ని నెరవేర్చుకుని తిరిగి వచ్చాక చెబుదువుగాని, ఇక మన నగరానికి వెళదాం పద" అన్నది.

మనోహరి విచిత్రంగా కళ్లు త్రిప్పుతూ "అతడే మన్నాడో వినలేదా? మళ్లీ నా కళ్లకి కనిపించే అవకాశం తనకు లేకపోవచ్చుని చెప్పిన మాటలు నీకు వినిపించలేదా?" అన్నది.

గుణసాగరి "అతడు కనిపించే అవకాశం లేదని చెప్పినా, మనసు వూరుకుంటుందా? ఎప్పుడో నీకు విరహవేదన ఎక్కువై, మదనుల వారి జాడ తెలుసుకునేందుకు రహస్యంగా మందిరం విడిచిపెట్టి వెళదాం పదవే అని నా ప్రాణాలు తోడవూ? అదిగాక భువనమనోహరివైన నీ రూపం అతడి గుండెల్లో గూడు కట్టుకునే వుంటుంది. తను వచ్చినా రావచ్చు. ఈ వయస్సులో ప్రేమ పుట్టాలే గాని అది ఎన్నెన్ని పనులు చేయిస్తుందో మనం చదివిన చాలా పుస్తకాలు చెప్పాయి" అన్నది.

మనోహరి చిరుకోపంతో "అది సరే, నాకలలోని



వృత్తాంతం చెబితే ఇప్పుడైనా నవ్విపోకుండా ఎలా వుంటానన్నావు, నేను మంత్రిపుత్రినన్నమాట మర్చిపోకు అన్నావు. ఆ మాటలకు అర్థం చెప్పు" అన్నది.

గుణసాగరి పగలబడి నవ్వుతూ "ఆ సంగతి నేను వూహించానని తెలుసుకోలేవా మనోహరి! సత్ప్రవర్తన కలిగిన ఒక శీలవతికి అనుకూల వరుడు కలలో కనిపించటం వెనక ఏదో దైవఘటన వుండి తీరుతుంది. ఏ దేవతో ముచ్చటపడి, భవిష్యత్తును నీకు సూచాయగా తెలియజేయటానికి కలలో మదనుణ్ణి నీకు చూపించి, అతడి పేరు కూడా వెల్లడి చేయించి, అంతటితో ఆగకుండా మీ ధరికి మీ వదినెద్వారా వివాహం కూడా చేయించి వుంటుంది. ఉదాత్తములైన చరిత్రలు



కలిగిన యువతీ యువకులు అంతకు ముందు ఒకర్నొకరు చూడకపోయినా, ఒకరిని గురించి మరొకరు తెలుసుకోకపోయినా కలల్లో మాత్రం భలే గమ్మత్తుగా కలుసుకుంటూ వుంటారు. ఇది నాకు బాగా తెలుసు. అందుకే నీ కలను వూహించాను. పానకంలో పుడకలా నువ్వెందుకని ఆ దేవత నన్ను నీ కలలోకి రానివ్వలేదు. సరేనా? సందేహం తీరిందిగా? ఇక పద. గుర్రాలు కూడా కడుపుల నిండా పచ్చిక మేసి, మన రాకకోసం ఎదురుచూస్తున్నాయి" అని చెప్పి తన తార్కికదృష్టికి నోరు వెళ్లబెట్టుకుని చూస్తున్న మనోహరిని చెయ్యి పట్టుకుని గుర్రాలవైపు నడిపించ సాగింది.

ఆ సమయంలో "అమ్మా మహారాణి! ఇంతలోకే ఎక్కడికి వెళ్లావు తల్లీ! మహారాణీ!....మహారాణీ...." అన్న కేకలు బిగ్గరగా వినిపించటంతో గుర్రాలను సమీపిస్తూన్న మనోహరి, గుణసాగరి, ఆగిపొయారు. ఆ అడవిలో ఒకదానివెనుక మరొకటిగా జరుగుతున్న ఆశ్చర్యకరములైన సంఘటనలకు విస్తుపోతూనే ఆ ఇద్దరు యువతులూ తలలు త్రిప్పి నలువేపులా చూపులను ప్రసరింపజేశారు.

సుమారు నలభైసంవత్సరాల వయస్సు కలిగిన ఓ యోగిని "మహారాణి! మహారాణి!" అని అరుస్తూ అటూ ఇటూ చూస్తూ కొంతదూరంలో వాళ్ల కంటపడింది.

మనోహరి "గుణసాగరీ! ఆమె ఇంచుమించు మదనుని తల్లివంటి వేషంలోనే వున్నది. అదే వయస్సులో వున్నది. ఏ మహారాణిని ఈ అడవిలో పోగొట్టుకున్నదో ఏమో!" అన్నది.

గుణసాగరి తల వూగిస్తూ "ఆమె మదనుని తల్లిగారి అనుచరురాలై వుంటుంది. కాని, ఇద్దరూ ఎందుకు విడిపోయారో అర్థం కాకుండా వున్నది. 'మహారాణి' అని ఆ యోగిని మదనుని తల్లిగారిని వుద్దేశించే అంటున్నది. అదిగో, మనల్ని చూసి మనవైపు వస్తున్నది, రానీ, వివరాలు తెలుస్తాయి" అన్నది. అంతలో ఆయోగిని వేషంలోని స్త్రీ గబగబా అడుగులు వేస్తూ అక్కడికి రానే వచ్చింది.

ఆమె రాగానే ఇద్దరినీ చూస్తూ "అమ్మలారా! ఈ ప్రాంతంలో నావంటి యోగినిని మీరు చూశారా? ఇంతకు ముందు కొంతసేపటిక్రితం ఆమె ఇక్కడికి దగ్గరలోని ఓ వనంలో వున్నది. నేను వచ్చేసరికి

ఎక్కడికి వెళ్లిందో తెలియదు" అన్నది ఆదుర్దాగా.

మనోహరి కనుబొమలు చిట్లించి "ముందు మీరెవరో చెప్పండి. ఆమెను విడిచి మీరెక్కడికి వెళ్లారు?" అన్నది.

కొత్త యోగిని నిట్టూర్చి "నేనెవరినో చెప్పాలంటే చాలా కథ చెప్పాలి. ముందు మీకే తెలుస్తుంది. నేను వెతుకుతున్నది విశాలపురికి చెందిన ఒకప్పటి మహారాణి, ప్రభావతీదేవిని. నేనామె చెలికత్తెను" అన్నది.

గుణసాగరి ఆ యోగినిని పరిశీలనగా చూస్తూ "విశాలపురి, విజయపురి రాజకుటుంబాలతో మహారాజుగారికి బంధుత్వమున్నది. ప్రభావతి దేవిగారిని, ధర్మపాల మహారాజుగారిని గురించి అప్పుడప్పుడు మా రాజదంపతులు విచారిస్తుంటారు. మేము మీరు అడుగుతున్న యోగినీ రూపంలోని ప్రభావతీదేవిని చూశాం కూడా. కాని, అప్పుడు మాకిన్ని వివరాలు తెలియవు. దయచేసి మీరు కూడా ఎందుకిలా యోగిని రూపంలో వున్నారో, ఆమెను విడిచి మీరు ఎక్కడికి ఎందుకు వెళ్లారో చెప్పండి" అన్నది.

యోగిని ముఖంలో విచారరేఖలు అలుముకుంటూండగా గుణసాగరిని వాత్సల్యంతో చూస్తూ "పుత్రీ! మీరు ఈ ప్రాంతంలోని సువర్ణపురి రాజకుటుంబానికి చెందిన యువతులని మీ మాటలవల్ల అర్థమైంది. మా రాజకుటుంబం, పద్ధెనిమిది సంవత్సరాల క్రిందట కొందరు నయవంచకులు పాపాత్ములై చేసిన ద్రోహంవల్ల క్రూరమైన ఆపదకు లోనైంది. భర్తను, చిన్నారి



కొడుకును పోగొట్టుకున్న మా మహారాణి నాతో కలిసి మందిరం విడిచి అజ్ఞాతంలోకి వెళ్లింది. ఆ తర్వాత మేమిద్దరం ఎంతో కష్టపడి ఎక్కడెక్కడో తిరగాలిసి వచ్చింది. మృతుడైన కుమారుణ్ణి బ్రతికించే అపూర్వములైన శక్తులను మా మహారాణి సంపాదించింది. ఇద్దరం ఈ ఆడవిలోకి వచ్చాం. నాకొక పని అప్పజెప్పి, నేను తిరిగి వచ్చేలోగానే ఆమే కనిపించటం లేదు. మా చరిత్ర సంగ్రహంగా చెప్పాను. మిగిలినదంతా తర్వాత చెబుతానుగాని, ముందు ఆమె ఎక్కడికి వెళ్లిందో చెప్పండి. చూశామన్నారుగా?" అన్నది

గుణసాగరి ఆమేనే చూస్తూ "మీరు చెప్పిందీ, మేము తెలుసుకున్నది కొంచెం తేడాతో ఒకటే. కాని, ఒక సందేహం. అత్యద్భుతమైన, ఊహాతీతములైన,

మానవమాత్రులకు సాధ్యంకాని దివ్యశక్తులు కలిగిన గొప్ప స్త్రీగా మీ మహారాణిని మేము గుర్తించాము. కాని ఇంతకాలం ఆమె వెంట తిరిగి మీలో ఏ శక్తులూ లేకుండా వుండటం ఆశ్చర్యమనిపిస్తున్నది'' అన్నది.

యోగిని ''అమ్మాయి! నువ్వు చాలా తెలివైన దానవనిపిస్తున్నది. అసలువిషయం చెప్పకుండా నాతోనే ఏవేవో చెప్పించుకుంటున్నావు. నాకు మా మహారాణి కొన్ని శక్తులను ప్రసాదించింది. అయితే, అవి ఆమె విషయంలో తప్ప ఇతరుల విషయాల్లో పని చేస్తాయి. ఉదాహరణకు, మా మహారాణికి 'తిరస్కరిణి' అనే యోగవిద్య కూడా వచ్చు. దాని ప్రభావంతో ఆమె అదృశ్యురాలైనప్పుడు ప్రపంచంలోని ఎంతటి శక్తివంతులు కూడా ఆమె జాడ తెలుసుకోలేరు. ప్రస్తుతం తిరస్కరిణీ విద్యా ప్రభావంతో అదృశ్యురాలైన మా మహారాణిని నేను నా మంత్రదృష్టి....అహహ...యోగదృష్టి ద్వారా తెలుసుకోలేకపోతున్నాను'' అన్నది.

గుణసాగరి సాలోచనగా యోగినితో ''అమ్మా! ఒక విధంగా మీరు మాకు ఆప్తులని తెలిసిపోయిందిగా? మీరు మీ మహారాణిగారి జాడ తప్ప మిగతా ఎవరి జాడనైనా తెలుసుకోగలరని మాకు అర్థమైంది. మదనుడనే రాకుమారుడు ఇంతకు ముందే ఇక్కణ్ణుంచి వెళ్లిపోయాడు. అతడెక్కడున్నాడో చెప్పండి. తర్వాత మేము మీ మహారాణి విషయమై చెబుతాము'' అన్నది.

యోగిని తన భుజానికి తగిలించుకున్న సంచి లోంచి కొంత బూడిదను తీసి మనోహరి, గుణసాగరి ముందు గాల్లోకి విసిరింది. ఆ బూడిద తెరలు తెరలుగా వాళ్లముందు ప్రదేశమంతా వ్యాపించిపోయింది. యోగిని చిరునవ్వుతో ''అమ్మాయిలూ! మదనుడనే రాకుమారుడు ప్రస్తుతం ఓ భేరుండపక్షి రూపంలో వున్నాడు. అతడిప్పుడు మీ కళ్లముందున్నాడు. చూడండి'' అన్నది. మనోహరి, గుణసాగరి ఉత్కంఠతతో చూడసాగారు.

(ఇంకావుంది)





4

[జరిగిన కథ: సువర్ణపురి సమీపంలోని అడవిలోకి వెళ్ళిన రాకుమారి మనోహరి, మంత్రికుమారి గుణసాగరి, అక్కడ ఒక సమాధినీ, ఒక అస్థిపంజరాన్నీ ఒక యోగినిని చూస్తారు. యోగిని మాయమైన తరువాత ఆ అస్థి పంజరం తిరిగి సమాధి వద్దకు రాగానే ఒక అందమైన యువకుడుగా మార్పు చెందుతుంది. అప్పుడు మదనా! మదనా! అంటూ ముందుకు వెళ్ళి ఆ యువకుణ్ణి కౌగలించుకుంటుంది మనోహరి. మంత్రికుమారి వారించగా, ఆ యువకుడు నా పేరు మదనుడే! కానీ నేనీమెను ఎన్నడూ చూడలేదు అంటాడు. ఎందుకు చూడలేదు! నన్ను మీరు ప్రేమించారు, మీ వదిన సునందాదేవి మనిద్దరికీ పెళ్ళి కూడా చేసింది, అంటుంది మనోహరి. అది ఆమె కల అని గుణసాగరికి తెలుస్తుంది. ఆ యువకుడు, నా తల్లి అజ్ఞ ప్రకారం కొన్ని కార్యాలు సాధించటానికి వెళుతున్నాను అని చెప్పి ఓ బ్రహ్మాండమైన పక్షిగా మారి గగనమండలం చేరుకుంటాడు. మనోహరీ, గుణసాగరీ — తిరిగి వెళ్ళడానికి తమ గుర్రాలను సమీపిస్తుండగా ఒక యోగిని వారికి సమీపంగా వచ్చి, మా మహారాణి ప్రభావతిదేవిని మీరెక్కడైనా చూశారా? అని అడుగుతుంది. ఆమెతో గుణసాగరి నీ యోగసిద్ధితో ఇప్పుడు ఇక్కడినుంచి పక్షిరూపంలో వెళ్ళిన యువకుణ్ణి మాకు చూపిస్తే, మేము చూసిన మహారాణి గురించి చెబుతాము అంటుంది. ఆకాశంలో ఎగురుతున్న మదనుణ్ణి యోగిని తన మంత్రశక్తితో చూపిన బూడిద వలయాలలో చూస్తుంటారు.

ఇక చదవండి]

మనోహరికి, గుణసాగరికి, యోగినిగా పరిచయమైన స్త్రీ సృష్టించిన బూడిద తెరల్లో కొంతసేపటికి అనంతాకాశంలో రివ్వున పయనిస్తూన్న భేరుండం పక్షి కనిపించింది. క్రింద అప్పుడే ఓ పట్టణం కూడా గోచరించింది. భేరుండం క్రిందికి దృష్టులు సారించి, ఆ నగరాన్ని ఆనందంతో చూసి గమనవేగాన్ని తగ్గించింది. క్రిందికి దిగబోతూ, హఠాత్తుగా ఆగిపోయి చూపులను మళ్లీ పైకి సారించి ముందుకు చూసింది.

అప్పుడే అటువేపు నుంచి కాటుక కొండలా వున్న ఓ రాక్షసుడు ఆ పక్షిదృష్టిలో పడ్డాడు. ఆ రాక్షసుడి శరీరం మీద గుంపులు గుంపులుగ అనేకమంది యువతులు కూర్చుని వున్నారు. అతని కాలివేలిని పట్టుకుని ఓ యువకుడు ఆయాసంతో అటూ ఇటూ వూగిసలాడుతున్నాడు.

మనోహరి తొట్రుపాటుతో "గుణా! అతడు మా చిన్నన్నయ్య - సూర్య ప్రతాపసింహుడు కదూ?" అన్నది.

కిరణ్ కుమారి



గుణసాగరి కూడా ఆ దృశ్యాన్ని అబ్బురపాటుతో విలోకిస్తూ "అవును. అంతా మాయగా వున్నదే, అరెరె, మనోహరీ! ఆ రాక్షసుడి ఉదరభాగంలో మీ వదినె సునందా దేవి కూడా వున్నది." అన్నది.

మనోహరి యోగినితో అమ్మా! మా అన్నయ్య మా వదినె ఆ రాక్షసుడికి చిక్కారా? వాళ్లతోబాటు ఎంతోమంది యువతులు కూడా వున్నారు. వాళ్ల నందరినీ ఆ రాక్షసుడు ఎక్కడికి తీసికెళుతున్నాడు?" అన్నది.

యోగిని నవ్వుతూ "మీరు మదనుడనే వాణ్ణి చూపించమన్నారు. అతడున్న ప్రాంతంలోని దృశ్యాలు కూడా కనిపిస్తున్నాయి. ఇప్పుడు అనుకోకుండా మీ ఆప్తులు కూడా మరికొందరు అక్కడ వున్నారు.



పోనీ, మరికొంత సేపు బూడిద తెరలను నా మంత్ర శక్తి - అహహ - యోగశక్తి ఆవహించి వుంటుంది. దృశ్యాలతో బాటు అక్కడి వాళ్లు మాట్లాడుకునే మాటలు కూడా విని, ఏం జరుగుతుందో పూర్తిగా తెలుసుకొండి." అన్నది.

అప్పుడప్పుడు మంత్రదృష్టి, మంత్రశక్తి అంటూ, అంతలోనే తొట్రుపాటును కప్పి పుచ్చుకుంటూ మంత్ర శక్తి, యోగశక్తి అంటూన్న యోగిని ప్రవర్తనను ఓ కంట కనిపెడుతూనే గుణసాగరి, ముందు భేరుండ పక్షి రూపుదైన మదనుడు రాక్షసుణ్ణి చూసి ఎందుకు ఆగిపోయాడో, తర్వాతేం జరుగుతుందో తెలుసుకోవాలన్న ఉత్సుకతతో అలాగే చూస్తూండిపోయింది.

అప్పటికి రాక్షసుడు భేరుండం పక్షి ప్రక్కగా వచ్చాడు. భేరుండం పక్షి చూస్తూండగా, రాక్షసుడి కాలి వ్రేలి పట్టుతప్పి, సూర్య ప్రతాపుడు క్రిందికి జారిపోసాగాడు. వెంటనే భేరుండం పక్షి తనుకూడా సూర్య ప్రతాపుడు జారే వేగం కంటె రెట్టింపు వేగంతో క్రిందికి జారి, కొంత సేపటిలోనే తన రెండు కాళ్లతో సున్నితంగా అతణ్ణి పట్టుకున్నది. అప్పటికే ఆయాసం విపరీతంగా ముంచుకొచ్చిన సూర్య ప్రతాపుడు, తల పైకెత్తి స్నేహపూర్వకంగా తనను చూస్తూన్న భేరుండం పక్షిని కృతజ్ఞతగా చూస్తూనే స్పృహ కోల్పోయాడు.

భేరుండం అదేవేగంతో క్రిందికి ప్రయాణిస్తూ, భూభాగం సమీపించగానే వేగం తగ్గించింది క్రింద ఓ ఉద్యానవనం గోచరించటంతో గండ భేరుండం మెల్లిగా ఆ ఉద్యానవనంలోని ఓ

పాలరాతి వేదిక మీదికి దిగింది. సూర్య ప్రతాపుణ్ణి ఆ వేదిక మీద వుంచి, తాను క్రిందికి దిగింది. సూర్య ప్రతాపుడు స్పృహలేని పరిస్థితిలో అలాగే శిలావేదిక మీద పడుకుని వుండిపోయాడు. భేరుండం చేసిన పరిచర్యల వల్ల కొద్దిసేపటికి అతడికి స్పృహ వచ్చింది. మెల్లిగా లేచి కూర్చుని, తనకు ప్రాణదానం చేసిన ఆ పక్షిరాజును కృతజ్ఞతగా నమస్కరించాడు. భేరుండం అతడికి అత్యంతమైన విస్మయాన్ని కలిగిస్తూ, అందమైన యువకుడుగా మారిపోయింది.

సూర్య ప్రతాపుడు "మిత్రమా! మీరెవరో మహిమాన్వితులులా వున్నారు. దురదృష్ట వంతుడినై ఆపదలో చిక్కిన నాకు భగవంతుడిలా సాక్షాత్కరించారు. జన్మజన్మలకూ మీ మేలు మర్చిపోలేను" అన్నాడు.

యువకుడు తనుకూడా పాలరాతి శిలావేదిక మీద కూర్చుని "నా పేరు మదనుడు. ఈ వుద్యానవనానికి కొద్దిదూరంలో వున్న విశాలపురి రాజపుత్రుణ్ణి. అయితే - పద్దెనిమిది సంవత్సరాల నుంచి ఈ రాజ్యం మానుంచి జారిపోయింది. నాది చాలా విషాద భరితమైన కథ. వివరంగా తర్వాత చెబుతాను. మీరెవరో, ఆ రాక్షసుడి వ్రేలిని పట్టుకుని ఎందుకూ ప్రమాదం కొనితెచ్చుకున్నారో చెప్పండి" అన్నాడు.

సూర్య ప్రతాపుడు మదనునికి తన వృత్తాంతం చెప్పాడు. అంతా విన్న తర్వాత మదనుడు "విచారించకండి. మీ వదినెగారిని, తక్కిన యువతులను తీసుకొని ఈ పాటికి ఆ



రాక్షసుడు చాలా దూరం వెళ్లివుంటాడు. బహుశా వాడి నివాసానికి కూడా చేరివుండొచ్చు. నేను బయలుదేరింది నా నగరానికే. అయితే, అనుకోకుండా నా మాతృభూమికి చెందిన గగన తలంలో మిమ్మల్ని కలుసుకున్నాను. కాని, ఇప్పుడు నా మొదటి కర్తవ్యం మీకు తోడ్పడటం. తర్వాత నా పని చూసుకుంటాను. ఇంతకూ ఆ రాక్షసుడెవరో, ఎందుకు మీ వదినెగారితో బాటు అంత మంది యువతులను తీసికెళుతున్నాడో వూహించ గలిగారా?" అన్నాడు...

...అంతటితో ఆ దృశ్యం అదృశ్యమైంది. మనోహరికి, గుణసాగరికి ముందున్న బూడిద తెరలు కూడా మాయ మయ్యాయి...అనంతరం—

తనవేపు తిరిగిన ఆ ఇద్దరు యువతులను



విద్యులాసంగా చూస్తూ యోగిని "ఆ రాక్షసుడెవరో, ఎందుకు సునందాదేవిని అంతమంది యువతులను యెక్కడికి తీసికెళుతున్నాడో సూర్య ప్రతాపుడు వూహించలేడు. నేను చెబుతానుగాని, ముందు ప్రభావతీ మహారాణి ఎక్కడికి వెళ్లిందో చెప్పండి" అన్నది.

గుణసాగరి యోగినీ రూపంలోని ప్రభావతీ దేవికి సంబంధించిన విశేషాలు తమకు తెలిసినంత వరకు చెప్పింది. అంతావిని యోగిని "అయితే తిరస్కరిణీ విద్యా ప్రభావంతో అంతర్ధానమైన ఆమె ఆచూకీ మీ ద్వారా తెలుసుకోవాలన్న నా కోరిక నెరవేరలేదన్నమాట. అయినా, మా ఏలిక సానిని కాదని ఎక్కడికి పోతుంది? ఎక్కడున్నా గాలిలా ప్రపంచమంతా వ్యాపించి గాలించి పట్టుకుంటాను" అన్నది.

ఆ మాటలతో మనోహరి అయోమయంలో పడింది. గుణసాగరి నవ్వి "నువ్వు ఏ మంత్రగత్తెవో అయివుంటావేమోనన్న అనుమానం అప్పుడప్పుడు కలిగినా, ఆధారాలు లభించక పోవటంతో నిర్ణయించుకోలేక పోయాను. నీ మాటల వల్ల నా అనుమానం ఇప్పుడు నిజమైంది. నిజం చెప్పు, ఎవరు నువ్వు?" అన్నది.

యోగిని "నేను కాలంధర అనే మహా మాంత్రికురాలి అనుచరురాలిని. నా పేరు మాయామయి. మీ ప్రభావతీ దేవి దివ్యశక్తులు పొంది ఇప్పుడు మామీద, మా ఏలికసాని శిష్యులమీదా పగ తీర్చుకోవాలని వుంది. ఈ విషయం పసికట్టి నేను యోగిని రూపంలో వచ్చి మీతో కపటంగా మాట్లాడాను. ఇక అసలు విషయం చెబుతాను వినండి. విజయపురి మహారాణియైన సునందా దేవిని, విజయపురి యువతులను తీసికెళుతున్న రాక్షసుడి పేరు జంబోదరుడు. అతడు కూడా మా కాలంధర అనుచరుడే. మీ సునందాదేవి వంటి రాజ యువతులు, విజయపురి యువతుల వంటి, ఇంకా చాలామంది మాకు కావాలి. ఇప్పటి నుంచి మీరిద్దరు కూడా మాదగ్గరే వుంటారుగా. అన్నీ తెలుసుకుంటూ వుండండి." అన్నది.

మనోహరి కోపంతో మాయామయిని చూస్తూ "ఓసీ, తంత్రగత్తెవై యుండి ఎంతనాటకం ఆడేవా? మాయలు, మంత్రాలు తెలిసినవాళ్లకు యుక్తులు ఉపాయాలు తక్కువ అంటారు. నీ విషయంలో అది పొరబాటు అనిపిస్తున్నది. నిన్ను కండకండలుగా

కోసి కాకులకూ గ్రద్దలకూ వేస్తాను'' అని ఒరనుంచి కత్తిని దూసింది.

మరుక్షణం, ఆ యువతి చెయ్యి స్తంభించి పోయింది. మాయామయి యోగిని రూపం విడిచి మంత్రగత్తెగా మారిపోయింది.

మనోహరి, గుణసాగరి, వేటకు వచ్చేటప్పుడు వాళ్లవెంట బయలుదేరి వచ్చిన సువర్ణ పురి నగర భటులు అప్పుడే అక్కడికి పరుగెత్తుకుంటూ వచ్చారు.

మాయామయిని చూపిస్తూ ఆ భటులతో గుణ సాగరి "ఈ తొత్తును బంధించండి. ఇది మంత్రగత్తె" అన్నది. భటులు కత్తులు దూసి అడుగులు ముందుకు వేశారు. కాని, వాళ్లంతా హాహాకారాలు చేయటానికి అట్టే సేపు పట్టలేదు. మాయామయి తన మంత్రశక్తిని ప్రేరేపించి అప్పటికే తనలో ఆవహింపజేసుకుని వున్నందున, ఉత్తరక్షణం మనోహరితో, గుణసాగరితో కలిసి అక్కణ్ణుంచి మాయమైంది.

ఓ భటుడు తక్కిన వాళ్లను చూస్తూ దీనంగా "ఇప్పుడేం చెద్దాం రా. రాకుమారి కోసం, మంత్రి కుమారి కోసం అడవంతా వెతికి తీరా ఇక్కడికొచ్చి వాళ్లను సందర్శించేసరికి మనకంటె ముందు మన కర్మ పిశాచి ఇక్కడికి వచ్చి కాచుకునివుంది. ఆ మంత్రగత్తె ఎవరో, యువరాణిని, మంత్రిపుత్రిని ఎక్కడికి తీసికెళ్లిందో, ఎంచేయ బోతుందో కదా?'' అన్నాడు.

మరొకడు "అవన్నీ మంత్రిగారు మహారాజుగారు ఆలోచించవలసిన విషయాలు. మనలాంటి



భటులేం చెయ్యగలుగుతారు. ఆలస్యం చెయ్యకుండా మహారాజుగారికి ఈ దుర్వార్త చెబుదాం పదండి. కాలయాపన చేసే సమయం కాదిది'' అన్నాడు.

తక్కిన భటులంతా ఆ భటుడు చెప్పిందే బావుందనటంతో అందరూ అక్కణ్ణుంచి బయలుదేరారు. వాళ్లు నగరం చేరి మహారాజును సందర్శించి, జరిగిందంతా విన్నవించారు. సువర్ణపురి మహారాజు దుఃఖిస్తూ వెంటనే మంత్రికి కబురు పంపించాడు.

క్రమంగా ఆ వార్త మహారాణికి చేరింది. దుఃఖంతో ఆమె కుప్పకూలిపోయింది.

ఆ సమయంలో, విజయపురినుంచి ఓ భటుడు వచ్చి, సువర్ణ పురి మహారాజుకు ఓ లేఖ ఇచ్చాడు. క్రితంరోజు ఓ మోసగత్తె తమ



నగరంలోని యువతులను, రాజపత్నిని, మాయం చేసుకు వెళ్లినట్లు అనుమానంగా వుందనీ, తమ ప్రభువులు విచారంతో వున్నారనీ, ఓమారు వచ్చి పోవల సిందిగా మంత్రి ఆ లేఖను వ్రాశాడు. రాజు ఆ లేఖను చదివి మంత్రికిచ్చాడు. మంత్రి దానిని చదువుకొని, కొద్ది తడవు ఏదో ఆలోచించి విజయపురి భటుణ్ణి ఇలా ప్రశ్నించాడు.

"భద్రా! ఆ మోసగత్తె మీ నగరానికి ఎప్పుడు వచ్చింది?"

విజయపురి భటుడు వినయంతో "నాల్గురోజుల క్రిందట వచ్చింది" అని చెప్పి కాలంధర మాంత్రికురాలు తమ నగరానికి వచ్చి, ఆమె తిరిగి పోయేదాకా జరిగిన వివరాలను, ఆ తర్వాత సంఘటనలను పూసగుచ్చినట్లు వివరించాడు.

అంతా విన్న తర్వాత మంత్రికి అయోమయ మనిపించింది. కొంత సేపు ఆలోచించి ఆ భటుడితో "భద్రా! నువ్వు చెప్పిన వివరాలను బట్టి ఓ మంత్రగత్తె సన్యాసిని వేషంలో వచ్చి కొన్ని క్షుద్ర ప్రక్రియల ద్వారా రాణిగారిని, తక్కిన యువతులను తన వెంట తీసికెళ్లిందని వూహించవచ్చు. ఆ తాంత్రికురాలు నగరం విడిచిన కొద్ది సేపటికే మహారాణిగారు, నగర యువతులు విచిత్రమైన ప్రవర్తనతో తమ ప్రమేయం లేకుండానే కోట బైటికి వెళ్లిపోయారు. ఆ తర్వాతేం జరిగిందో తెలియటం లేదు. తన క్షుద్రశక్తులతో వాళ్లందర్నీ నగరం వెలుపలికి రప్పించి, ఆ సన్యాసినే ఎక్కడికో తీసికెళ్లి వుంటుంది. అయితే ప్రభాకర సింహలవారు ఉదయం నుంచి ఏ ప్రయత్నాలు చేశారో అది కూడా చెప్పు" అన్నాడు.

విజయపురి భటుడు "మంత్రిగారూ! కొంత మంది రాజభటుల్తో సహా నగరంలోని మగవాళ్లు చాలామంది వీధుల్లో స్పృహ లేని పరిస్థితిలో పడివున్నారు. అలా పడివున్న వాళ్లలో మాయమైన యువతుల అత్తలుకూడా కొందరున్నారు. రాణిగారి చెలికత్తెలు వచ్చి మహారాజుగారితో, తమ యజమానురాలు కనిపించటం లేదని చెప్పగానే ఆయన మందిరమంతా ఆమెకోసం వెతికారు. అప్పుడే స్పృహ తప్పిన పౌరులను, స్త్రీలను వాళ్లవాళ్ల బంధువులు స్పృహలోకి తెప్పించి, వారందరితో కలిసి వచ్చి మా మహారాజు గారిని దర్శించారు. కొన్నివేలమంది వివాహిత యువతుల

కనిపించటం లేదని చెబుతూ, వాళ్లు ఇళ్లు విడిచి పోయేటప్పటి పరిస్థితిని వివరించారు. వెంటనే మంత్రిగారిని పిలిపించి మహారాజుగారు ఆ విషయమై తర్జన భర్జనలు చేశారు. కాపలా భటుల్ని రప్పించి రాత్రి సంఘటనలు, అంతకు ముందు జరిగిన విశేషాలు తెలుసుకున్నారు. సన్యాసినిగా వచ్చిన మంత్రగత్తె చేసినపనే అదంతా అని విశ్వసించారు. వెంటనే మంత్రి గారు ఉత్తరం వ్రాసి ఇచ్చి నన్ను మీ దగ్గరికి పంపించారు'' అన్నాడు.

మంత్రి ''భద్రా! ఇక్కడ కూడా ఇంతకు ముందే మాకు దుఃఖం కలిగించే ఓ సంఘటన జరిగింది. ఎవరో మంత్రగత్తె వచ్చి మా రాజ పుత్రిని, నా పుత్రిని, మాయం చేసుకు వెళ్లింది. ఈ సంగతి మీ ప్రభువులకు తెలియజేసి, మా మహారాజుగారితో కలిసి త్వరలో మీ నగరానికి వస్తున్నానని మనవి చెయ్యి. అన్నీ అక్కడే ఆలోచించి కర్తవ్యం నిర్ణయించుకోవచ్చునని చెప్పు'' అన్నాడు. ఆ భటుడు మహారాజుకు, మంత్రికి నమస్కరించి, అక్కణ్ణుంచి వెళ్ళిపోయాడు.

ఆ సమయంలో, కాలంధర తన తాంత్రిక కోటలో భూతప్రేత పిశాచాలతోనూ, తను వశం చేసుకున్న రాక్షసులతోనూ పరివేష్టించబడి వున్నది. కాలంధర ప్రక్కన మాయామయి వినయంగా నిల్చుని వున్నది. ఎదురుగా సునందాదేవి, విజయపురి యువతులు నిల్చుని వున్నారు. మరోవేపు మనోహరి, గుణసాగరి, దీనంగా నిల్చుని వున్నారు.



కాలంధర మాయామయితో అక్కణ్ణుంచి ఓ అరలోకి వెళ్లబోతూ అంతకు ముందు విజయపురి యువతులందరినీ అక్కడికి చేర్పించిన రాక్షసునితో "జంబోదరా! ఈ యువతులందరినీ ఓ మందిరంలో వుంచి జాగ్రత్తగా కాపలా ఏర్పాటు చెయ్యి. సువర్ణపురి రాకుమారిని, మంత్రి కుమారిని ఇంకో భవనంలో వుంచి కట్టుదిట్టంగా కాపలా పెట్టు. మనకు వెయ్యిమంది కన్యలు కావాలి. కాలభైరవ మాంత్రి కునికి లక్షమంది సామాన్య యువతులు, వందమంది రాజ యువతులు, పెళ్ళై సంతానం లేనివాళ్లు కావాలి. ఒక్క నెలరోజులలో మనం వీళ్లనందరిని సమకూర్చుకోవాలి. తర్వాత వచ్చి కర్తవ్యం చెబుతాను. ముందు వీళ్లనందరిని తీసికెళ్ళు'' అన్నది.

జంబోదరుడు కాలంధరకు తలవంచి

నమస్కరించి "అలాగే మాంత్రిక మాతా!" అన్నాడు. తర్వాత కాలంధర మాయామయితో కలిసి తన రహస్యపు అరలోకి వెళ్లిపోయింది. క్షుద్ర మంత్ర తంత్రాలకు, ప్రక్రియలకు ప్రయోగాలకు సంబంధించిన రకరకాల సాధనాలు ఆ అరలో వున్నాయి.

కాలంధర ఓ ఆసనం మీద కూర్చుంటూ "మాయామయీ! పద్దెనిమిది సంవత్సరాల క్రిందట విశాలనగర రాజుకు అపకారం తలపెట్టి, అతని సామ్రాజ్యాన్ని అపహరించిన నల్గురు రాజులు ప్రస్తుతం మనకు అప్తులు. వాళ్ల సహకారం వల్లనే నేను కొన్ని పనులను నిర్విఘ్నంగా నెరవేర్చు కుంటూ ఈ నాడు ఈ స్థితికి వచ్చాను. ప్రస్తుతం, విశాలపురి మహారాణి అత్యద్భుతమైన శక్తులు పొంది, ఐదేళ్ల పసివయస్సులో మరణించిన తన కుమారుణ్ణి తిరిగి బ్రతికించుకోవటమే గాక, అతణ్ణి యువకుణ్ణిగా చేసి, తన విద్యలను చాలావరకు అతనికి ధారపోసింది. ఇప్పుడు తనకు మిగిలిన ఒకే ఒక 'తిరస్కరిణి' విద్యా ప్రభావంతో రహస్యంగా ఎక్కడో వున్నది. ప్రభావతిని ఆమె కుమారుణ్ణి, ఎలాగైనా మట్టు బెడితే గాని, భవిష్యత్తులో మనకు ఎదురు వుండదు..." అని ఇంకా ఏదో అనబోతుండగానే ఆ అర ప్రతి ధ్వనించేట్లు ఓ గంభీర స్త్రీ స్వరంనుంచి బిగ్గరగా నవ్వు వినిపించింది. కాలంధర, మాయామయి, దిగ్భ్రాంతితో అటూ ఇటూ చూశారు. నవ్వు శబ్దం ఆగి, నువ్వుగింజ రాలినా వినిపించే నిశ్శబ్దం ఆవరించింది.

కొద్ది క్షణాలకు భూమికి కొంచెం పైగా, తెల్లని పరిశుభ్రవస్త్రాలు ధరించి, యోగశక్తుల ప్రభావంతో జాజ్వల్యమానంగా ప్రకాశించే ఓ నలభై సంవత్సరాలు స్త్రీ మూర్తిణి ఆవిర్భవించింది ఆమెను చూడగానే కాలంధర తత్తరపాటుతో తన ఆసనం నుండి లేచి నిల్చున్నది! మాయామయి కంపరమెత్తిపోతూ నిలువుగ్రుడ్లు పెట్టుకుని అలాగే ఆ స్త్రీ మూర్తిణి వంక చూస్తూండిపోయింది. (ఇంకావుంది)



33 G.R.G




5

[జరిగిన కథ: సువర్ణపురి యువరాణి మనోహరి, మంత్రికుమారి గుణసాగరి, తమకు యోగినిగా పరిచయమైన స్త్రీ సృష్టించిన బూడిద తెరల్లో, ఆకాశంలో ఎగురుతున్న జంబోదర రాక్షసుణ్ణీ, పక్షి రూపంలోని మదనుణ్ణీ, అతనిచే రక్షింపబడిన సూర్యప్రతాపుణ్ణీ చూస్తారు. అంతటితో బూడిద తెరలు మాయంకాగా, యోగిని తన మంత్రశక్తితో మనోహరి, గుణసాగరిలను తన వెంట తీసుకు వెడుతుంది. అప్పుడే అక్కడికి చేరుకున్న సువర్ణపురి భటులు, వెంటనే తమ రాజుకు ఈ విషయం తెలియజేస్తారు. అదే సమయం విజయపురి మంత్రి పంపిన లేఖ ఒకటి సువర్ణపురి రాజుకు అందుతుంది. ఆ లేఖలో ఓ మోసగత్తె మా రాజ్యంలోని యువతులతో సహా రాజపత్నినీ మాయం చేసుకు వెళ్ళిందని తెలిసిరాగా, రాజు. మంత్రి అయోమయంలో పడి ఆలోచిస్తుంటారు. అదే సమయంలో మహామాంత్రికురాలు కాలంధర తన తాంత్రిక కోటలోని రహస్య మందిరంలో తన అనుచరురాలు మాయామయితో ఓ వృత్తాంతాన్ని చెబుతుండగా ఓ స్త్రీ కంఠం నవ్వు వినిపిస్తుంది. ఆ స్త్రీ మూర్తిణిని చూసి, కంపరమెత్తి చూస్తుండిపోతారు కాలంధర, మాయామయి...ఇది ఇలా వుండగా విశాలపురి సమీపంలోని వనంలో సూర్యప్రతాపుడూ, మదనుడూ తమ కర్తవ్యాలను గురించి చర్చిస్తుంటారు.

ఇక చదవండి]

విశాలపురి సమీపంలోని ఉద్యానవనంలో — శిలావేదిక మీద కూర్చుని విచారంతో తల వాల్చుకుని వున్న విజయపురి యువరాజైన సూర్యప్రతాపుడి భుజం మీద చెయ్యి వేసి తట్టుతూ మదనుడు "మిత్రమా! మనం ఒకరి వృత్తాంతం పురస్కరం తెలుసుకుని కష్టసుఖాల్లో పాలు పంచుకోవలసిన వాళ్లం. నీ విషయం చెప్పావు. నన్ను గురించి కూడా నువ్వు పూర్తిగా తెలుసుకున్న తర్వాత కర్తవ్యం నిర్ణయించుకుందాం. నీ మనో వేదన ఉపశమించినా హృదయం కాస్త తేలిక పడేట్టు నీకో కథ చెబుతాను విను" అన్నాడు.

ఆ పరిస్థితిలో కథ చెబుతానంటూన్న మదనుని వేపు తలెత్తి ఓమారు చూశాడు సూర్యప్రతాపుడు. అతడలా అనటంలో ఏదో ఒక ప్రయోజనం ఉండి ఉంటుందని భావిస్తూ "అలాగే" అన్నాడు. మదనుడు చెప్పటం ప్రారంభించాడు.

కిరణ్ కుమారి




"చుట్టు ప్రక్కల రాజ్యాల రాజులను సామంతులనుగా చేసుకుని, మహాధర్మాత్ముడైన విశాలపురి సామ్రాజ్యాన్ని చల్లగా పాలిస్తూండేవాడు. ఆ మహారాజు ఏలుబడిలో ప్రజలు ఎటువంటి ఈతిబాధలు లేకుండా హాయిగా జీవిస్తూండేవారు. విశాలపురి రామరాజ్యమని పేరు పొందింది.

ధర్మపాల మహారాజుకు మహారాణి ప్రభావతీ ఉత్తమ దర్మపత్ని అతిధి అభ్యాగతులను ఆదరిస్తూ, భర్తకు అనుకూలవతిగా, ప్రజలకు కన్న తల్లిలా మెలగసాగింది. ధర్మపాల మహారాజుకు స్నేహ వ్యసనం చాలా ఎక్కువగా వుండేది. తన సామంతులను స్నేహితుల్లా చూసుకుంటూ విందు వినోదాల సమయాల్లో వాళ్లను రాజధాని లోని తమ మందిరానికి రప్పించుకుని తను వాళ్లలో ఒకడుగా ఆనందిస్తూండేవాడు. మహారాణి కూడా ఆ రాజులను తన అన్నల్లా భావిస్తూ గౌరవిస్తూండేది.

కొంతకాలానికి మహారాణి నోముల పంటగా ఆమెకో కుమారుడు జన్మించాడు. మహారాజు పూర్ణ చంద్రుణ్ణి సందర్శించిన సముద్ర దేవుడిలా కుమారుణ్ణి చూసి ఆనందంతో పొంగిపోయాడు. వెంటనే కోటలో ఉత్సవాలు జరిపించమని మంత్రికి ఆదేశాలిచ్చి, సామంతులందరికీ జన్మ దినోత్సవంలో పాల్గొనమని ఆహ్వానాలు పంపించాడు. దేశ దేశాలనుంచి రాజులంతా వచ్చారు. ఆ రాజుల్లో ధర్మపాలుని మిత్రులే కాకుండా బంధువులు కూడా ఉన్నారు.

తమకు చిన్నారి యువరాజు జన్మించాడన్న ఆనందంతో విశాలపురి పౌరులు తమతమ ఇళ్లల్లో పండుగలు చేసుకున్నారు. దానధర్మాలతో రాజ దంపతులు బీదసాదలను సంతృప్తి పరిచారు. ఉత్సవాల తర్వాత సామంతులంతా ఎవరి రాజ్యాలకు వాళ్లు వెళ్లిపోయారు.

చిన్ని యువరాజు ప్రతి సంవత్సరం అదే విధంగా జన్మ దినోత్సవాలు జరుపుకుంటూ ఐదో జన్మ దినోత్సవం నాటికి విద్యాభ్యాసం చేయించు కున్నాడు.

ఆ విద్యాభ్యాస సమయంలో నల్గురు సామంత రాజులు మహారాజున పరివేష్టించి వున్నారు. ఆచార్యులు అక్షరాలు దిద్దించిన తర్వాత దాసీలు యువరాజును మహారాణి దగ్గరికి తీసికెళ్లారు.

విందు వినోదాలతో మహారాజు అర్ధరాత్రి దాకా సామంత రాజులతో గడిపి "మిత్రులారా! ఇక మీరు విడిది భవనాలకు వెళ్లి విశ్రాంతి తీసుకోండి. నేను కూడా శయన మందిరానికి వెళ్తాను' అని ఆసనంనుండి లేచాడు.

ఓ సామంతరాజు వికృతంగా నవ్వుతూ "చక్రవర్తీ మిమ్మల్ని మందిరం దాకా సాగనంపి మేము వెళతాం. అయితే, సాగనంపేది మీ శయన మందిరానికి కాదు. యమమందిరానికి" అన్నాడు. ఆ మాటలకు క్రూరంగా నవ్వుతూ తక్కిన ముగ్గురు సామంతులు కూడా అతడితో బాటు ఆసనాల నుండి లేచారు. ధర్మపాలుడు వాళ్ల ప్రవర్తనకు విస్తుపోతూనే నాలుగడుగులు వెనక్కి వేసి "ఏమిటి మీరంటున్నది?" అన్నాడు.

మొదటి సామంతుడు "అవును. సువిశాల విశాలపురి సామ్రాజ్యాన్ని మేము నలుగురం పంచుకునేట్టు ఒప్పందం చేసుకుని, మీ అంతిమ ఘడియలకు శ్రీకారం చుట్టాము. కోట చుట్టూ ఇప్పటికే రహస్యంగా వచ్చి చేరిన మా నాల్గు రాజ్యాలకు చెందిన సైన్యాలు ఇక కొద్ది సేపట్లోనే లోపల చొరబడతాయి. మీ సేనానిని, దళపతులను, అంగరక్షకులను, ఇంకా తక్కిన ముఖ్యులందరినీ ఇంతకు ముందే బంధించినట్లు మీకు తెలియదు. మనం విందు వినోదాల్లో మునిగి వుండగా మావాళ్ళుమీవాళ్ల పనిబట్టారు. రాజ్యం వీరభోజ్యం కదా? ఇప్పుడు ఈ సామ్రాజ్యాధికారం మీ చేతుల్లో వున్నది; ఇక కాసేపట్లో మా చేతుల్లోకి రాబోతున్నది" అని మరో మారు




వికృతంగా నవ్వుతూనే ఒరనుంచి కత్తి దూశాడు.

తక్కిన ముగ్గురు సామంతులు కూడా ధర్మపాల చక్రవర్తిని క్రూరంగా చూస్తూనే ఒరల నుంచి కత్తులు దూశారు.

పరిస్థితి గ్రహించిన ధర్మపాల ప్రభువు క్షణం కూడా ఆలస్యం చెయ్యకుండా తను కూడా ఒరనుంచి కత్తి దూసి పళ్లు పటపట కొరుకుతూ "ఒరీ, ద్రోహుల్లారా! ఇంత మోసాన్ని మనస్సుల్లో వుంచుకుని ఎంత కపటంగా ప్రవర్తించారు. మిమ్మల్ని చిత్రవధ చేస్తాను - కాచుకోండి" అని కొదమ సింహంలా వాళ్లతో తలపడ్డాడు.

ఆ నలుగురూ నలువేపులా చుట్టుకుని సమయం చూసి కత్తులతో పొడవాలని ప్రయత్నించారుగాని, ధర్మపాలుడు నల్గురి కత్తులకు




తన కత్తితో సమాధానం చెబుతూ భీకరంగా పోరాడ సాగాడు.

ఒకదానినొకటి ఢట్టించుకుంటూ కత్తులు ఖంగు ఖంగున శబ్దం చేస్తున్నాయి. విందు వినోదాల కోసం కేటాయించ బడిన ప్రత్యేక ప్రదేశం కాబట్టి ఆ సమయంలో భటులుగాని, పరిచారికలుగాని అక్కడ లేరు.

అయితే; శయన మందిరం అక్కడికి సమీపంలో ఉండటంవల్ల, ఆ కత్తుల శబ్దాలు మహారాణికి వినిపించాయి.

కుమారుణ్ణి నిద్రపుచ్చి, భర్తరాక కోసం ఎదురు చూస్తున్న మహారాణి హఠాత్తుగా కత్తుల శబ్దం వినిపించేసరికి పాన్పునుండి దిగ్గున లేచి వాకిలి ధగ్గరికి నడిచింది. తలుపు తీసుకుని బైటికి వచ్చేసరికి నల్గురు సామంతులతో తన భర్త ఒంటరిగా పోరాడుతున్న దృశ్యం కనిపించింది. అప్పటికే మహారాజు శరీరంలో అక్కడక్కడ గాయాలు ఏర్పడి రక్తం స్రవిస్తూ వున్నది. మహారాణి "ఒరే, పాపాత్ములారా! మిమ్మల్ని స్నేహితుల్లా ఆదరించినందుకు నా భర్తకూ, అన్నల్లా గౌరవించినందుకు నాకూ, మీరు చేసే ఉపకారం ఇదా? ఆ దారుణం ఆపండిరా" అని భోరున ఏడుస్తూ పోరు జరుగుతూన్న చోటుకి దగ్గరగా వెళ్ళి చేరుకున్నది.

ధర్మపాలుడు శక్తినంతా కూడగట్టుకుని పోరాడుతూనే "దేవీ! ప్రస్తుతం మన వాళ్లెవరూ నాకు తోడుగా వచ్చే పరిస్థితిలో లేరు. ఈ పాపాత్ములు ముందే పథకం వేసుకుని అందర్నీ బంధించారు. కొద్ది సేపట్లో వీళ్ల సైన్యాలు కూడా కోటలో చొరబడవచ్చు. నువ్వు నా మాటమీద ఏ మాత్రం గౌరవమున్నా ఇక్కణ్ణుంచి వెళ్లిపో చిరంజీవిని తీసుకుని రహస్యమార్గం గుండా మందిరం విడిచి వెళ్లు" అని ఆజ్ఞాపించాడు.

కాని, కన్నీరు మున్నీరుగా దుఃఖిస్తూ అక్కణ్ణుంచి వెళ్లటానికి కాళ్లాడక మహారాణి స్థాణువులా వుండిపోయింది.

అదే సమయంలో, శత్రుసైన్యాలు కోటలో ప్రవేశించిన అలజడి వినిపించింది. రెట్టించిన ఉత్సాహంతో ఒక సామంతుడు ధర్మపాలు ప్రభువు కడుపులో కత్తితో పొడిచాడు.

బాధగా ఆర్తనాదం చేస్తూనే ధర్మపాలుడు చేతిలోని కత్తిని జారవిడిచి క్రింద పడ్డాడు.

భర్త మరణించినట్లు అర్థంచేసుకుని మహారాణి, ఇక ఆ పాపాత్ములు తన బిడ్డను కూడా విడిచి పెట్టరని భావించి, మసకలు క్రమ్ముతున్న కళ్లను తుడుచుకుంటూ అక్కణ్ణుంచి పరుగెత్తి పోయింది. సామంతులు తమ కత్తులను ఒరల్లో పెట్టుకుని ధర్మపాలుణ్ణి ఎత్తుకుని పిట్టగోడ దగ్గరికి తీసికెళ్లారు.

శయన మందిరంలోకి వెళ్లిన మహారాణి నిద్రలో ఉన్న యువరాజును భుజమ్మీదికి చేర్చు కున్నది. గోడవారకు నడిచి గోడలో కలిసి పోయినట్లున్న ఓ రహస్యపు మీటను నొక్కింది. మరుక్షణం గచ్చులో తివాచిలా ఉన్న ఓ బిలద్వారం ప్రక్కకు తొలగిపోయింది.

మహారాణికి కిటకిలోంచి బైటి దృశ్యం కని పిస్తూనే వున్నది. పిట్టగోడ దగ్గరికి ధర్మపాలుని శరీరాన్ని మోసుకెళ్లిన సామంతులు క్రిందవున్న అగాధమైన కందకంలోకి విసిరి వేశారు.

పెల్లుబుకుతూన్న దుఃఖాన్ని బలవంతంగా అణుచుకుంటూ కేవలం తన కుమారుణ్ణి అయినా కాపాడుకోవాలన్న ఒకే లక్ష్యంతో మహారాణి రహస్య మార్గంలోకి నడిచింది. లోపల ఉన్న మరో మీటను నొక్కింది. వెంటనే బిలద్వారం తిరిగి మూసుకుని, బైటిగచ్చును యథాప్రకారం చేసింది.

మహారాణి ఆ సొరంగంలోని మెట్లమీదుగా కొంచెం దూరం క్రిందికి దిగి, ఆ తర్వాత సాపుగా వున్న భూమి మీద గబగబా నడుస్తూ తాపడం చేయబడిన రత్నాలు దీపాల్లా ప్రకాశిస్తూ వెలు



తురును విరజిమ్ముతూండగా, మహారాణి మూర్తీభవించిన శోక దేవతలా అలాగే ముందుకు సాగిపోయింది.

అలసటను ఎంత మాత్రం దరిచేరనివ్వ కుండా ఎడతెగని ప్రయాణం కొనసాగించి, మహారాణి ఆ సొరంగం అవతలి వేపుకి చేరు కున్నది. అక్కడి గోడకి వున్న రహస్యపు మీటను నొక్కి బిలద్వారాన్ని మూసి ఉన్న తలుపును తొలగించింది. తూరుపు తెలతెలవారుతూండగా, తూలుతూ తూలుతూ మహారాణి సొరంగం బైటి ప్రదేశంలో అడుగు పెట్టింది. భుజమ్మీది యువ రాజు ఇంకా నిద్రిస్తూనే వున్నాడు.

మహారాణి కొంత దూరం నడిచేసరికి గుర్రపు డెక్కల చప్పుళ్లు వినిపించాయి. తాను తన



బిడ్డతో రాజ మందిరం నుంచి తప్పించుకున్న విషయం తెలుసుకుని, తన భర్తను దారుణంగా హతమార్చిన దుష్టసామంతులు పంపిన సైనికులు తమకోసం వస్తున్నారని అనుమానించిన మహారాణి వెంటనే గుబురుగా ఏపుగా వున్న ఓ పొదరింటి చాటున నక్కి దాక్కుంది.

ఆమె అనుకున్నట్లుగానే కొద్ది క్షణాలకే కొందరు శత్రు సైనిక భటులు తమతమ గుర్రాలను నడిపించుకుంటూ అక్కడికి వచ్చారు. గుర్రాలన్నీ పొదరింటికి అటు ప్రక్కగా ఆగాయి. మహారాణి గుండె చప్పుడును కూడా స్వాధీనంలో వుంచుకుంటూ ఆకుల సందుల్లోంచి వాళ్లనే చూస్తుండి పోయింది.

అశ్వికుల్లో ఒకడు "కోటచుట్టూ తిరగాం. రాజ మందిరపు రహస్య బిలానికి చెందిన బైటిద్వారం ఎక్కడా కనిపించదే?" అన్నాడు.

అంతలోనే మరొకడు "అదిగో, అక్కడో బిలద్వారం కనిపిస్తున్నది. ద్వారం తలుపు తెరిచే వున్నది. తప్పకుండా తన కుమారుణ్ణి తీసుకుని ఆ బిలద్వారం నుంచే బైటికి వచ్చి ఉంటుంది. వెళ్లి నలుమూలలా వెతకండిరా - ఇద్దరినీ పట్టుకుని గాని, ప్రాణాలు తీసి గాని తీసుకు వెళ్లామో, మనకందరికి ఒక్కొక్కరికి ఒక్కో కొత్వాలు పదవి కాచుకుని వుంటుంది" అన్నాడు.

వెంటనే గుర్రాలు అక్కణ్ణుంచి బిలద్వారం వేపుగా నడిచాయి. వెనక పోతూన్న భటుడి గుర్రం సమవిశాలమైన ఓ రాతి పలకమీద అడుగు పెట్టి, కాలు జారగా క్రింద పడబోతూ మళ్లీ అంతలోనే నిలదొక్కుకున్నది. అంతలోనే తక్కిన గుర్రాలు ఆ గుర్రం కంటె కాస్త ఎడమయ్యాయి.

మహారాణి మెదడులో అంతదుఃఖంలోనూ ఓ ఉపాయం మెరుపులా తోచింది. తాను తన కుమారునితో బాటు ఇక్కడే వుంటే, ఎలాగైనా ఇంక కొంచెం సేపట్లో ఈ క్రూరాత్ముల బారిన పడక తప్పదు. అప్పుడు జరగబోయే ధేమిటో ఇందాకా ఒకడు తేల్చి చెప్పనే చెప్పాడు. తన కోసం కాకపోయినా, తన చిన్నారి యువరాజు కోసమైనా తెగించాలి... ఆ విధంగా ఆలోచించిన మహారాణి తనకు స్ఫురించిన ఉపాయాన్ని ఆచరణలో పెడుతూ, ప్రక్కనే ఉన్న ఓ రాయిని చేతిలోకి తీసుకున్నది.

అంతే... ఉత్తరక్షణం, మహారాణి చేతిలోని

రాయి విసురుగా ఆ గుర్రంమీది భటుడి కణత కేసి రివ్వున వెళ్లింది. అరవటానికి కూడా అవకాశం లేకుండా ఆ భటుడు గుర్రం మీది నుంచి దభాలున క్రింద పడ్డాడు.

మహారాణి తారాజువ్వలా పొదరింటి చాటు నుంచి లేచింది. రెప్పపాటు కాలంలో గుర్రాన్ని సమీపించింది. పక్కనున్న పాలరాతి మీద నుంచి జూను క్రింద ఇనుప తొడుగుమీద కాలు పెట్టి, గుర్రం మీద కూర్చుని, తన కుమారుణ్ణి ఎడం చేత్తో భుజంమీద అట్టిపెట్టుకుని గుర్రాన్ని ముందుకు పరుగులు తీయించింది. తన పెద తల్లి కుమారుడైన సువర్ణపురి మహారాజు దగ్గరికి వెళ్లి, కుమారుణ్ణి ఆయనకు అప్పగించాలన్న ఉద్దేశంతో, సువర్ణపురివేపుగా, గుర్రాన్ని దౌడు తీయించ సాగింది. సూర్యుడు ఉదయించి, తూర్పు దిశనుంచి ఆ ఉత్తమురాలిని జాలిగా చూడసాగాడు.

రహస్య బిలద్వారం ముందర, ఆ చుట్టు ప్రక్కల వెతికిన భటులు కొద్ది సేపటికి, అంతకు ముందు మహారాణి దాగివున్న పొదరింటి దగ్గరికి వచ్చారు.

అక్కడ కణత మీద బలమైన దెబ్బ తగిలి, గాయంనుంచి రక్తంస్రవించి అట్టకట్టుకుని వుండగా, స్పృహతప్పి పడివున్న తమ అనుచరుణ్ణి చూశారు.

ఒకడు "అరెరె! వీణ్ణి ఇలా కొట్టిందెవరై వుంటారు?" అన్నాడు. వేరొకడు అటు ఇటూ చూసి "ఒరేయ్! వీడి గుర్రంకూడా లేదు" అన్నాడు.




మరొకడు "అర్థమైంది. విశాలపురి రాణి తన కుమారుడితో బాటు ఈ ప్రాంతంలోనే ఎక్కడో దాక్కుని మన రాకను పసికట్టి వుంటుంది. సమయం చూసి ఈ చవటగాణ్ణి ఇలా దెబ్బతీసి, వీడి గుర్రంమీదే ఉడాయించి వుంటుంది. ఎంత దూరమని పోతుంది. పదండి వెంట పడదాం" అన్నాడు.

మహారాణి ఇటూ అటూ వెళితే శతృవుల చేతిలో చిక్కుకుంటానని భావించి ముందుకే సాగిపోయి వుంటుందని నిశ్చయించుకున్న భటులంతా అక్కణ్ణుంచి అభిముఖంగానే తమ తమ గుర్రాలను పరుగెత్తించారు.

మహారాణి ఎడంచేత్తో కుమారుణ్ణి భుజంమీద

పొదివి పట్టుకుని, కుడిచేత్తో గుర్రపు కళ్లాన్ని పట్టుకుని, అప్పుడప్పుడు కాళ్ల మడమలతో గుర్రం కడుపు క్రింద తడుతూ, శరీరాన్ని ముంచుకొస్తూన్న ఆయాసాన్ని లెక్కచెయ్యకుండా ఏకధాటిగా ప్రయాణించ సాగింది. గుర్రం భూమి మీద పాదాలు మోపీ మోపనట్లు ధనుస్సునుండి విడువబడిన బాణంగా ముందుకు దూసుకు పోసాగింది.

క్రమంగా సూర్యుడు తూర్పు దిక్కునుంచి ఆకాశంలో పైపైకి ప్రాకటం ప్రారంభించాడు. లేత ఎండ క్రమంగా మండుటెండగా మారిపోతూ ఉన్నది.

మహారాణి అధిరోహించిన గుర్రం మరికొంత సేపటికే సువర్ణపురిని సమీపించింది. అల్లంత దవ్వులో కోటగోడలూ, బురుజులూ, గోపురాలూ, ఎత్తైన మేడలూ, ఆమెకి గోచరించాయి. ఆ నగరాన్ని చూస్తున్న కొద్దీ ఆత్మీయతా భావం, ఓర్పు, మహారాణిలో ఏర్పడ సాగింది.

ఎవరో తనను ఓదారుస్తున్నట్లు ఆమె తనలో ఏదో అనుభూతి పొందింది.

మనసులో అనుకుంటున్నట్లుగా "అన్నయ్యా శత్రుంజయా!! నీ మేనల్లుణ్ణి నీకు అప్పగించి నేను కన్నుమూస్తాను. ఇకనుంచి నా కుమారుడి ఆలనా పాలనా, అంతా నువ్వే" అని బైట అన్నది.

కాని, ఆ అవకాశం కూడా ఆమెకి ఇవ్వకుండా క్రూరవిధి పగబట్టి ఆమె వెనువెంటనే ఆపదను కూడా తీసుకుని వచ్చింది.

జాడలు తీసి, రెట్టించిన ఉత్సాహంతో వేగంతో తరుముకుంటూ, వచ్చిన శత్రుభటుల గుర్రాలు ఒక్కుమ్మడిగా, మూక ఉమ్మడిగా మహారాణి గుర్రాన్ని సమీపించి చుట్టుముట్టాయి. నిస్సహాయురాలై, చివరి ఆశను కూడా కోల్పోతూన్న ఆ పూజ్యురాలి చెవులకు శత్రుభటుల విషపు నవ్వులు మృత్యు ఘంటికల్లా వినిపించాయి.

(ఇంకా వుంది)





## 6

[జరిగిన కథ: మహా మాంత్రికురాలు కాలంధర, ఆమె అనుచరురాలైన మాయామయితో తన రహస్య అరలో ప్రస్తాపిస్తూండగా, అక్కడ ఒక స్త్రీమూర్తిణి ప్రత్యక్షమౌతుంది. ఆ ఇద్దరు మంత్రగత్తెలు కంపరమెత్తి ఆ స్త్రీమూర్తిణిని అలాగే చూస్తూండిపోతారు...ఇది ఇలావుండగా, విశాలపురి సమీపంలోని ఓ ఉద్యానవనంలో విజయపురి యువరాజు సూర్యప్రతాపుడు గండభేరుండం రూపంలో వచ్చి, తనను కాపాడిన మదనునితో తన వృత్తాంతాన్ని చెబుతాడు. ఆ తరువాత మదనుడూ ఓ కథను సూర్యప్రతాపునికి ఇలా చెబుతాడు: "విశాలపురి రాజ్యాన్ని ధర్మపాలుడనే రాజు పరిపాలిస్తూండేవాడు. అతని కుమారుని ఐదవ ఏటి జన్మదినోత్సవానికి విచ్చేసిన వారిలో నలుగురు సామంతులు విజయపురి రాజ్యాన్ని కాజేయాలని కుట్ర పన్ని, ధర్మపాలుణ్ణి హత్య చేసి, అగాధమైన ఓ కందకంలోనికి తోసివేస్తారు. ఇవన్నీ చూస్తున్న విజయపురి రాణి, తన ఐదేళ్ళ కుమారుణ్ణి వెంట తీసుకుని, రహస్యమార్గం ద్వారా కోట వెలుపలకు చేరుకుని, అక్కడ ఒక శత్రు భటుని దెబ్బతీసి అతని గుర్రం మీద తన కుమారునితో సహా తప్పించుకు వెడుతుంది. కాని శత్రురాజ భటులు గుర్రాల మీద వెంబడించి ఆమెను చుట్టుముట్టారు... ఇక చదవండి]

ఎంతో ఆశతో సువర్ణపురిని చేరాలనుకున్న ప్రభావతీ మహారాణిని శత్రుభటులు చుట్టుముట్టగానే, అప్పుడే నిద్రలేచిన యువరాజు తల్లి భుజమ్మీదనుండే "అమ్మా! నన్నెక్కడికి తీసుకు వచ్చావు?" అని అడిగాడు.

వెంటనే మహారాణి కొడుకును ఒడిలోకి చేర్చుకుని, శత్రుభటుల గుర్రాల మధ్యగా తన గుర్రాన్ని ప్రక్కన ఉన్న ఓ అడవిలోకి పరుగెత్తించింది.

ఓ భటుడు నవ్వుతూ "వంటింటి కుందేలు ఎక్కడికి పోతుందిరా? తరమండి" అన్నాడు.

మరో భటుడు "ఇక కొంతదూరంలో సువర్ణపురి ఉన్నది. ఇలాగే తప్పించుకుంటూ పోతూంటే, అక్కడ మనకు ఆటంకాలు ఏర్పడవచ్చు. పట్టి తీసుకుపోయే అవకాశం తప్పిపోయేట్టున్నది. తుదముట్టించి శవాలనే తీసుకు వెళదాం" అన్నాడు.

కిరణ్ కుమారి




మహారాణి గుర్రం అడవిలోని ఓ ప్రదేశానికి చేరుకునే సరికి శత్రుభటుల్లో ఒకడు పదునైన కత్తిని బలంగా ముందుకు విసిరాడు. రివ్వున దూకును వచ్చిన ఆ కత్తి తల్లి ముందు కూర్చుని అయోమయంగా అటూ ఇటూ చూస్తున్న యువ రాజు మెడను సగంపైగా నరికివేసింది. ఆర్తనాదం గాల్లో కలిసిపోతూండగా యువరాజు కొనవూపిరి కోలుపోతూ గుర్రం మీదనుండి దభాలున క్రింద పడిపోయాడు.

కొడుకు గాయపడి క్రింద పడ్డాడని భావించిన మహారాణి అతణ్ణి రక్షించుకోవటానికి గుర్రాన్ని నిలువరించి క్రిందికి దూకింది.

వాళ్లెవరూ ఊహించని రీతిలో మహారాణి ఓ శత్రుభటుడి ముందుకు లంఘించింది. అతడి చేతిలోని కత్తిని లాక్కుని నిశ్చేష్టుడై ఉండగా బలంగా పొట్టలో పొడచింది. కన్ను మూసి తెరిచేంతలో ప్రక్కకు తిరిగి మరోభటుడి శిరస్సు ఛేదించింది. అందరూ కత్తులు ఝులిపిస్తూ మీదికి రాగా, మహిషాసుర మర్దినిలా విజృంభించి మహారాణి చిత్రవిచిత్రంగా తన చేతిలోని కరవాలాన్ని త్రిప్పుతూ, అందరికి అన్ని రూపాలుగా గోచరిస్తూ, కొద్ది సేపటిలోనే వారంద రిని నేలకూల్చింది.

ఆ తర్వాత చేతిలోని కత్తిని పారేసి, కొడుకు దగ్గరికి వెళ్లింది. కొద్ది పాటిగాయంతో క్రింద పడిఉంటాడనుకున్న కొడుకు మెడ సగంపైగా తెగి పడిఉండటంతో భోరున విలపిస్తూ అతణ్ణి ఎత్తుకున్నది.

యువరాజు శరీరం చల్లగా ఉండటంతో చెయ్యి పట్టుకుని నాడిని చూసింది. నాడి కొట్టుకోక పోవటం వల్ల అతడు తనను శాశ్వతంగా విడిచి పోయాడని భావిస్తూ ఆ అడవి ప్రతిధ్వనించేట్టు ఏడ్చింది. ఆమె రోదన అరణ్యరోదనమని ఆ అడవి ఋజువు చేసింది. ఓదార్చటానికో, కర్తవ్యం బోధించటానికో ఎవరూ లేరు.

మహారాణి అలా ఏడ్చి ఏడ్చి చివరకో నిర్ణయానికి వచ్చింది.

అక్కడికి సమీపంలోని ఓ పొదరింట్లో కుమారుడి శవాన్ని ఉంచి, చెట్ల ఆకులు కోసి, ఆ శవం నిండా కప్పివేసింది.

వెంటనే ఓ గుర్రాన్ని అధిరోహించి సువర్ణపురి వేపుగా ప్రయాణం కొనసాగించింది. ఇప్పుడామెకు

తన అన్నగారైనా శత్రుంజయ మహారాజును కలుసుకోవాలనిపించలేదు. అప్పగించాల్సిన కొడుకు దూరమైనందున ఇక ఆ ఆలోచన ప్రసక్తే లేదు.

మహారాణి ఆరోహించినగుర్రం మరికొద్ది సేపటికే సువర్ణపురిని చేరుకున్నది. ఆమె బంగారు నగల వ్యాపారం జరిగే వీధిలోకి వెళ్లి, ఓ పెద్ద అంగడి ముందు గుర్రాన్ని ఆపింది. గుర్రం దిగి కొట్టులోకి వస్తూన్న మహారాణిని చూడగానే ఎవరో ఓ గొప్పింటి యువతి తన దగ్గర విలువైన ఆభరణాలను కొనటానికి వస్తున్నదేమోనని ఆశ పడిన కొట్టు యజమాని తను కూర్చున్న చోటునుంచి లేచి ఆమె కెదురుగా వచ్చాడు.

అతడు వినయంతో మహారాణిని చూస్తు "ఏం కావాలమ్మా? మీకు ఏ విధమైన నగలు కావాలిసినా ఎంతో విలువైనవి మా దగ్గర ఉన్నాయి. దయచేసి అలా కూర్చోండి'' అన్నాడు ఓ పీఠం చూపిస్తూ.

మహారాణి కొట్టు యజమానితో "బేహారీ! నేనిప్పుడు కష్టదశలో ఉన్నాను. నగలు కొనటానికి మీ దగ్గరికి రాలేదు. నా దగ్గర ఉన్న నగలు అమ్మటానికి వచ్చాను'' అన్నది. ఆమె ధరించిన నగల వేపు అప్పుడు గాని యజమాని దృష్టి పరిశీలనగా పడలేదు. మహారాణి తన ఒంటిమీది నగలన్నిటినీ తీసి బంగారు వ్యాపారి చేతికి ఇచ్చింది.

అతడు వాటిని మరింత బాగా పరిశీలించి "తల్లీ! వీటిని నేను కొనలేను. కొన్ని కోట్ల ఖరీదు



చేసే వీటి విలువను నేను చెల్లించలేను. నేనే ఈ నగరంలో పెద్ద నగల వర్తకుడిని. ఇంకెవరైనా వీటిని కొనగలరని ఆశకూడా పెట్టుకోకుండా, ఇంకో పట్టణంలో ప్రయత్నించు. మా మహారాజుగారి దగ్గరికి వెళ్లు. వారైతే కొనగలరు'' అని చెబుతూ నగలను మహారాణికి తిరిగి ఇవ్వబోయాడు.

మహారాణి నగలను తీసుకోకుండా "శెట్టిగారూ! రాజవంశీయుడైన ఒక వ్యక్తికి సమాధి నిర్మించడం కోసం అవసరమైన సొమ్ము నాకు చాలు. ఇవ్వ గలిగినంతే ఇచ్చి నగలు తీసుకోండి. ఇంతటితో ఈ నగల అవసరం నాకు లేదు'' అన్నది.

ఆమె మాటలు తనకు అయోమయమనిపించినా, ఆ వ్యాపారి నగలను భద్రపరచుకుని, ఇనపపెట్టె తెరిచి ఓ చిన్నమూటను తీశాడు. దానిని మహా



రాణికిస్తూ" తల్లీ! ఇందులో లక్షవరహాలున్నాయి!! అన్నాడు.

మహారాణి మరేమీ మాట్లాడకుండా ఆ వరహాల మూటను తీసుకున్నది. బైటికి వచ్చి గుర్రాన్ని సమీపించింది. ఆమె ప్రవర్తనకు గౌరవమూ, ఆశ్చర్యమూ తనలో ముప్పిరి గొంటూండగా కొట్టు యజమాని ఆమె దగ్గరికి వచ్చి "అమ్మా! కష్టంలో ఉన్నానన్నావు. నా కూతురువంటి దానివి. ఈ ఊళ్లో నీకేదైనా పని ఉంటే చెప్పు తల్లీ! చేతనైనంతా చేస్తాను" అన్నది.

మహారాణి అతనితో "అయ్యా! పాలరాళ్లతో ఒక విలువైన సమాధిని నిర్మించాలి. దానికి అవసరమైన ఏర్పాట్లు చేయించగలిగితే, మీకు కృతజ్ఞురాలిని" అన్నది.

యజమాని "దానికేం భాగ్యం తల్లీ! పరికరాలను, మనుమలను కొద్ది సేపట్లోనే మీ వెంట పంపిస్తాను" అన్నాడు.

"అయితే, ఈ వరహాల మూటను మీ దగ్గరే ఉంచుకోండి" అని తిరిగి మూటను ఇవ్వబోయింది మహారాణి

కొట్టు యజమాని తల అడ్డంగా వూగిస్తూ "వద్దు తల్లీ! ఇప్పటికే నీకు చాలా ఋణపడి ఉన్నాను. ఈ వరహాలను మృతుని పేరుమీదుగా దానధర్మాలుగా చెయ్యటానికి ఉపయోగించండి. ఏర్పాట్లు నేనే చేస్తాను" అన్నాడు.

ఆ తర్వాత, ఆ వ్యాపారి తన మనుమల్ని పంపించి రెండు ఎడ్ల బండ్ల నిండా పాలరాళ్లను, సమాధి నిర్మించటంతో నేర్పరులైన వారిని అక్కడికి రప్పించి, మహారాణికి అప్పజెప్పాడు.

మహారాణి గుర్రం మీద కూర్చుని, ఎడ్లబండ్లు, సమాధి కట్టేవాళ్లు తన వెంట వస్తూండగా అక్కణ్ణుంచి బయలుదేరి, మరికొద్ది సేపటికి తన కుమారుని శవాన్ని ఉంచిన అడవి ప్రదేశానికి చేరుకున్నది. అక్కడికి దగ్గరలోని ఓ వేప చెట్టు క్రింద సమాధి నిర్మించమని పనివాళ్లకి చెప్పింది.

వాళ్లు గొయ్యి తీసి, మహారాణి కన్నీళ్లతో తీసుకొచ్చిన విశాలపురి యువరాజు శవాన్ని అందులో ఉంచారు. దుఃఖంతో పూడుకు పోతూన్న గొంతుకతో "బాబూ! నీ పితృదేవతలు ఈ నీ సమాధిని చల్లగా కాపాడుకుంటూందురు గాక! నిర్భాగ్యురాలైన ఈ నీ తల్లి సంకల్పం నెరవేరితే, ఎప్పటికైనా కన్నుల పండువుగా చూస్తాను. లేకపోతే

ఈ జన్మ కింతే తండ్రీ!" అని ఓ మట్టి పెళ్లను శవం మీద వేసింది.

ఆ తర్వాత పనివాళ్ళు గోతినిండా మట్టిని వేయగా, సమాధి నిర్మాణ కారులు చకచకా తమ పని ప్రారంభించి, కొంత సేపటికి పూర్తి చేశారు. మహారాణి వరహాల సంచి లోంచి కొన్నింటిని తీసి పనివాళ్లకు, సమాధి నిర్మించిన వాళ్లకు ఇచ్చింది. వాళ్లు దీనంగా ఆమెను చూస్తూ వాటిని తీసుకుని నమస్కరించి అక్కణ్ణుంచి వెళ్లిపోయారు.

మహారాణి సమాధి మీద రెండు చేతులూ ఉంచి కొంత తడవు దుఃఖించింది. అనంతరం దుండెను దిటవు పరచుకుంటూ, గుర్రమెక్కి ఆ అడవిలోంచి ఒకదిశగా ప్రయాణం కొనసాగించింది. అప్పటికి సాయంత్రమైంది.

ప్రభావతీదేవి గుర్రం అడవిదాటి కొంతసేపటికి ఓ అగ్రహారం చేరుకున్నది. అక్కడంతా బ్రహ్మణ కుటుంబాలే నివసిస్తున్నాయి.

చూడగానే మనసులో ఏదో గౌరవ భావాన్ని కలిగించే సుందరరూపంతో, మూర్తీభవించిన దైన్యంలా ఓ యువతి తమ అగ్రహారంలో అశ్వారూఢురాలై ప్రవేశించగానే రచ్చసావడి దగ్గర కూర్చుని పిచ్చాపాటి మాట్లాడుకుంటూన్న కొంతమంది బ్రాహ్మణులు లేచినిల్చున్నారు. మహారాణి గుర్రం వాళ్ల దగ్గర ఆగింది.

ఆమె వాళ్లను చూస్తూ అయ్యలారా! ఇది బ్రాహ్మణాగ్రహారమని అర్థమవుతున్నది. వేద వేదాంగాలతో బాటు, దివ్య విద్యలకు సంబంధించిన ఉపాసనలు తెలిసినవాళ్లు మీ అగ్రహారంలో ఉన్నారా?" అని ప్రశ్నించింది.

ఆమె అడగటానికి ఆశ్చర్యపడ్డారు వాళ్లు. ఒక





బ్రాహ్మణుడు "అమ్మా! అదిగో - రామాలయం ప్రక్కనే ఉన్న పెద్ద పెంకుటిల్లు, ఆ ఇంటి యజమానియైన రాఘవాచారిగారు మా అగ్రహారంలో అందరికంటె పెద్ద పెద్ద చదువులు చదివారు. ఎంతోమంది మహానుభావుల వద్ద శుశ్రూషలు చేసి, జ్యోతిష్యము, మొదలైనవి నేర్చుకున్నారు. మీరు వారిని అడిగితే, ఏదైనా మీకు ఉపయోగం ఉండొచ్చు" అన్నాడు.

మహారాణి వెంటనే గుర్రాన్ని అదలించి, బ్రాహ్మణుడు చెప్పిన గురుతుల ప్రకారం రాఘవాచారి ఇల్లు చేరుకున్నది.

ఎవరో యువతి గుర్రం మీద తన గుమ్మం ముందుకు రాగానే, వింతగా ఆమెను చూస్తూ రాఘవాచారి చేతిలోని తాళ పత్రాలను ప్రక్కన ఉంచి లేచి వచ్చాడు.

అతడు ఆప్యాయంగా "ఎవరమ్మా మీరు? ఏం కావాలి?" అని అడిగాడు.

మహారాణి "స్వామీ! రాఘవాచారిగారు మీరేనా?" అన్నది. తల ఊగిస్తూ రాఘవాచారి "చెప్పండి ఏం కావాలో?" అన్నాడు.

మహారాణి "మీతో కొన్ని విషయాలు మాట్లాడాలి" అన్నది. రాఘవాచారి గౌరవంగా "గుర్రం దిగి లోపలికి రామ్మా" అన్నాడు.

మహారాణి గుర్రందిగి అతడి వెంట ఇంట్లోకి నడిచింది. తను కూర్చున్న చాప ప్రక్కన ఇంకో చాప వేసి "కూర్చో అమ్మా!" అని తనూ కూర్చున్నాడు ఆచారి.

మహారాణి చాపమీద కూర్చుని "స్వామీ! రాత్రి మరణించిన వ్యక్తికి, మరుసటిరోజు చీకటి పడేలోగా అపరకర్మలు జరిపించక పోతే, ఏదైనా అనర్థం జరుగుతుందా?" అన్నది.

రాఘవాచారి "అలా జరిపించకపోతే, మృతుని ఆత్మ పిశాచమై గాలిలో పరిభ్రమిస్తూ హీనాతి హీనమైన పనులు చేస్తూ, ఎప్పటికీ ఇంకో జన్మను పొందలేక అలమటిస్తూంటుందని శాస్త్రం చెబుతుంది తల్లీ!" అన్నాడు.

మహారాణి తనదగ్గరున్న వరహాలను రాఘవాచారి ముందు ఉంచి "ఇక సూర్యాస్తమయం కావటానికి ఎంతో సేపు లేదు. దయచేసి మృతుడైన వా చిన్నారి కుమారుని పేరు మీదగా మీ అనుచరులైన ఈ అగ్రహారంలోని బ్రాహ్మణులందరిచేత వేదమంత్రాలు చదివిస్తూ, నా చేత నా బాబు ఆత్మకు ఉదకదానం ఇప్పించండి. ఈ ధనంతో

అందరికీ సంతర్పణ చేయించండి'' అన్నది.

రాఘవాచారి మహారాణీ చెప్పినట్లే అన్నీ జరిపించాడు. అప్పటికి రాత్రి చాలా భాగం గడిచిపోయింది. ఆ తర్వాత మహారాణీ ఒంటరిగా కూర్చుని ఉన్న పందిట్లోకి వచ్చాడు ఆచారి.

అతడు వాత్సల్యంతో ఆమెను చూస్తూ "అమ్మా! మీరు లోపలికి వచ్చి, మీకోసం కేటాయించ బడిన గదిలో విశ్రాంతి తీసుకోండి'' అన్నాడు.

మహారాణీ "స్వామీ! దయచేసి అలా కూర్చోండి. మీతో కొంచెం మాట్లాడాలి'' అన్నది. రాఘవాచారి ఆమె ఎదురుగా ఉన్న బల్లమీద కూర్చున్నాడు.

"ఆచారిగారూ! మీరు ఎన్నో శాస్త్రాలూ, పురాణాలూ, ఇతిహాసాలూ, మహిమలకు సంబంధించిన గ్రంథాలు చదివారు కదా? మరణించిన మనిషి తిరిగి బ్రతికే అవకాశాన్ని కలిగించే సాధనాలుగాని విద్యలుగాని ఉన్నాయా?'' అని అడిగింది రాణి.

అలా అడుగుతున్నప్పుడు ఆమె ముఖంలోని దీక్షను ఆచారి గుర్తించాడు. ఆ విధంగా ఆమె ఎందుకడుగుతున్నదో కూడా వెంటనే అవగతం చేసుకున్నాడు.

"అమ్మా! ప్రారబ్ధకర్మలు అనుభవించాక జీవి ఇహలోక యాత్ర చాలిస్తుందని నాకూ తెలుసు. జనన మరణాలకు సంబంధించిన యథార్థం కూడా అంతే. అయితే నువ్వు ఇప్పుడు నన్నడిగిన వివరాలు ఎందుకో ఊహించాను. ఆ సాధనాలు, విద్యలు ఉండినా, వాటిని పొందటం అసాధ్యం తల్లీ!'' అన్నాడు.

మహారాణి, "మీరు నా తండ్రిలాంటి వారని మొదటే చెప్పాను. దయచేసి నేనడిగిన దానికి



ఐదులు చెప్పండి" అన్నది.

ఆమెను ఆ పట్టుదలనుంచి తప్పించాలని చూచాయగా ప్రయత్నించిన ఆచారి, ఇక లాభం లేదనుకుని "ఉన్నాయి. కాని, వాటిని సంపాదించాలనుకుంటే ఇలా పల్లెలు పట్టణాలు కాదు నువ్వు తిరగవలసింది. తపోనిష్ఠాగరిష్ఠులైన మునులను సేవించాలి. యోగ విద్యాపరిపూర్ణులైన సిద్ధులను సందర్శించాలి. అణిమాద్యష్ట సిద్ధులు, శ్రుతి, ఉపశ్రుతి, దృష్టి, ఉపదృష్టి, తిరస్కరణి, ఇష్ట కామరూపిణి, మొదలైన దివ్య విద్యలు వారి అనుగ్రహం వల్లనే పొందాలి తప్ప మరో మార్గం లేదు. ఇక - సంజీవని, శల్యకరణి, గైరిక, మొదలైన అద్భుత మూలికలు ఒక్క హిమాలయాల్లోనే లభిస్తాయి. అయితే, అవి ఎవరికంటా పడవని చెబుతారు. వాటిని సంపాదించే విధానం తెలియదు" అన్నాడు.

మహారాణి సంతృప్తి మెరుస్తూన్న ముఖంలో ఆశాజ్యోతుల్లా కళ్లు మిలమిల లాడుతూండగా తను కూర్చున్న బల్ల మీదినుండి లేచింది. రెండు చేతులూ జోడించి ఆచారికి నమస్కరిస్తూ "మీరు చేసిన సహాయాలకు కృతజ్ఞతల్తో సెలవు" అన్నది. ఆచారి కూడా కంగారుగా తనుకూర్చున్న బల్ల మీదినుండి లేస్తూ "అమ్మా! ఇక కొద్దిసేపట్లో అర్ధరాత్రి ప్రారంభమవుతుంది. ఒంటరిదానివి. ఉదయాన్నే ప్రయాణం చెయ్యి తల్లీ!" అన్నాడు.

మహారాణి వినయంతో "లేదు ఆచారిగారూ! క్రితంరోజు అర్ధరాత్రి మా జీవితాలకు కాళరాత్రి అయింది. ఈ అర్ధరాత్రి నా కర్తవ్యదీక్షకు నాందీ వాచకం కావాలి" అన్నది. ఆచారి, "సకల దేవతలూ నీకు తోడుగా ఉండి, నీ ప్రయత్నాన్ని విజయవంతం చెయ్యాలని ప్రార్థిస్తున్నాను. క్షేమంగా వెళ్లిరా తల్లీ! అని దీవించాడు. మహారాణి ఇంటి బైటికి వచ్చి, సిద్ధంగా ఉన్న గుర్రాన్ని అధిరోహించింది. గుర్రం ముందుకు సాగిపోయింది.

(ఇంకావుంది)





## 7

[జరిగిన కథ: ఎంతో ఆశతో సువర్ణపురిని చేరుకోవాలనుకున్న మహారాణి ప్రభావతీ దేవిని పట్టుకోవాలని వెంబడించిన శత్రు సైనికులలోని ఒక భటుడు విసిరిన కత్తి, ప్రభావతి దేవి కుమారుని మెడను సగం వరకు నరికివేయగా, ఆ పిల్లవాడు గుర్రంమీదనుంచి క్రిందపడి మరణిస్తాడు. మహారాణి గుర్రం మీది నుంచి క్రిందికి దూకి, మహిషాసుర మర్దినిలా ఆ శత్రుభటులందర్నీ హతమార్చి, తన కుమారుని మృతదేహాన్ని ఒక పొదలో దాచి, సువర్ణపురి చేరుకుంటుంది. అక్కడ ఒక నగల వ్యాపారి వద్ద తన నగలన్నీ లక్ష వరహాలకు అమ్మి, సగం ధనంతో, అడవిలో తన కుమారుని మృతదేహానికి పాలరాళ్లతో సమాధిని కట్టిస్తుంది. ఆ తరువాత ఆమె అడవి దాటి ఒక అగ్రహారం చేరుకుని, అక్కడ రాఘవాచారి అనే వేద పండితుణ్ణి కలుసుకుని, తనవద్ద మిగిలిన ధనం అతనికిచ్చి, తన కుమారునికి అపకర్మలు జరిపిస్తుంది. ఆ తరువాత రాఘవాచారి వద్ద, మనిషిని తిరిగి బ్రతికించే అద్భుత మూలికలు, దివ్య విద్యలు గురించి అడిగి తెలుసుకుని, వాటిని సాధించే దీక్షతో తన గుర్రాన్ని అధిరోహించి ముందుకు సాగిపోయింది.

ఇక చదవండి]

బ్రాహ్మణాగ్రహారం నుండి అర్ధరాత్రి వేళ అశ్వారూఢురాలై బయలుదేరిన మహారాణి ప్రభావతీ ఎడతెగని ప్రయాణం కొనసాగించింది. సిద్ధపురుషులు ఎక్కడ ఉంటారని అక్కడక్కడ తనకు తటస్థపడే జ్ఞానులను అడుగుతూ, వారు చెప్పిన ప్రకారంగా నెలరోజులు ప్రయాణించి బదరికారణ్యం చేరుకున్నది.

ఆ వనంలో తిరుగుతూండగా ఒక సిద్ధపురుషుడు ఆమెకు దర్శనం ఇచ్చాడు. ఆ మహనీయునికి శుశ్రూషలు చేస్తూ, ఒక్క సంవత్సరం గడిపింది.

ఒకనాడు ఆ సిద్ధుడు కరుణాపూరితములైన దృష్టులను ప్రసరింపజేస్తూ మహారాణితో "పుత్రీ! నిర్మలమైన మనస్సుతో ఇంతకాలం నాకు సేవలు చేశావు. ఇక నేను ఈ ప్రదేశం విడిచి, మరో చోటికి వెళ్లాలనుకుంటున్నాను. నా వల్ల కాదగిన కార్యమేమైనా ఉంటే చెప్పు. మేము యోగసాధనలు చేసినా, సిద్ధులను సంపాదించినా, అవి ప్రపంచానికి ఉపయోగ పడటానికేనని నీకు

కిరణ్ కుమారి



తెలిసే ఉంటుంది. నీబోటి ధీరురాలి వల్ల మా విద్యలు సార్థకం అవుతాయి. సంకోచించకుండా నీ మనసులోని కోరికను చెప్పమ్మా!" అని అడిగాడు.

మహారాణి సిద్ధుడి పాదాలకు ప్రణమిల్లి "మహాత్మా! మరణించిన నా కుమారుణ్ణి ఎలాగైనా బ్రతికించుకోవాలన్న సంకల్పంతో బయలుదేరాను. అందుకు ఉపయోగపడే సిద్ధిని ప్రసాదించండి" అని వేడుకున్నది.

సిద్ధుడు కొంత తడవు ఆలోచించి "తల్లీ! నీ పట్టుదల నాకు మెప్పు కలిగిస్తున్నది. చిరకాలం నుంచి సాధనచేసి నేను "కాయసిద్ధి" అనే సిద్ధిని సంపాదించాను. ఎముకల గూడుకు కోరుకున్న పద్ధతిలో శరీర నిర్మాణాన్ని కలిగించే సిద్ధి ఇది. దీనిని నీకు ప్రీతిపూర్వకంగా ఉపదేశిస్తాను. కాని, ఈ సిద్ధితో బాటు ఇంకాకొన్ని సిద్ధులు నువ్వు పొందాలి. వాటిని కలిగిన వాళ్లను ఆశ్రయిస్తే ప్రయోజనం ఉంటుంది" అని చెప్పి అప్పటికప్పుడే "కాయసిద్ధి"ని మంత్రపూర్వకంగా ఆమెకు ఉపదేశించాడు.

ఆ తర్వాత సిద్ధుడు మహారాణిని వీడ్కొని అక్కణ్ణుంచి వెళ్లిపోయాడు. మహారాణి కూడా ఆ వనంనుంచి బయలుదేరి, కొన్ని మాసాలకు నైమిశారణ్యం చేరుకున్నది. అక్కడి యోగులకు, మునులకు సేవలు చేసి కొన్ని సంవత్సరాలు గడిపింది. వాళ్లవల్ల కొన్ని యోగ విద్యలు, మహిమలు సంపాదించి ఆ తర్వాత కామ్యకవనం వెళ్లింది.

అక్కడ ఉండే సిద్ధయోగీంద్రుణ్ణి కొన్ని సంవత్సరాలు సేవించి, ఆ మహనీయుని వల్ల "ప్రాణ ప్రతిష్ఠ' అనే సిద్ధిని సంపాదించింది.

అదే విధంగా కాశి, గయ, ప్రయాగ, చక్రతీర్థ, సుభద్ర, మొదలైన ఉత్తమోత్తమ పుణ్య ప్రదేశాలను సందర్శించి, పవిత్ర నదుల్లో స్నానాలు చేసి అఖండమైన పుణ్యాన్ని పొందింది.

చివరకు హిమాలయాలకు వెళ్లి, కంద మూలాలు భుజిస్తూ ఎండలను చలిగాలులను లెక్క చెయ్యకుండా ఉగ్రమైన తపస్సు చేసింది ఆ తపోసాధనలో మరికొన్ని సంవత్సరాలు గడిచాయి.

అప్పటికి మహారాణికి ఏయే ఓషధిలో ఎటువంటి మహిమ ఉన్నదో, వాటిని పొందే విధానం ఎటువంటిదో తెలుసుకునే శక్తులు, జ్ఞానము సిద్ధించాయి. వాటిని ఆధారం చేసుకుని మరి కొన్ని సంవత్సరాలు

హిమాలయాలన్నీ కలియతిరిగి సంజీవనీ, శల్య కరణి, గైరిక, మొదలైన మహిమాన్వితమైన దివ్య ఔషధులను సంపాదించింది.

తదేక లక్ష్యంతో ఉపాసనలు కొనసాగించి అణి మాద్యష్ట మహాసిద్ధులను పొందింది. ఆ విధంగా పద్ధెనిమిది సంవత్సరాలు అకష్టకష్టాలు పడి, అనుకున్నది సాధించి, ఒకనాడు మిట్టమధ్యాహ్న సమయానికి సువర్ణపురి సమీపానికి చేరుకున్నది. ఓ వనంలో కూర్చుని, తన కుమారుని అస్థిపంజరాన్ని దగ్గరికి రప్పించుకున్నది. ఆ అస్థిపంజరం పద్ధెనిమిది సంవత్సరాల మధ్యకాలంలో మానవుడుగా ఉంటే, ఏ ఏ దశలను పొందగలదో, ఆయా దశలను ఒకే మారు తన సిద్ధులతో, శక్తులతో, మహిమలతో, పొందేట్టు చేసింది..." అంతవరకూ వివరంగా చెప్పి మదనుడు సూర్యప్రతాపునితో "మిత్రమా! ఆ మదనుణ్ణి నేనే. నా తల్లివల్ల సంక్రమించిన నామరూప విద్యతో భేరుండం పక్షి రూపం ధరించి ఇక్కడికి వస్తూండగా, దారిలో నువ్వు తటస్థపడ్డావు" అని నిశ్చలంగ అతడి ముఖంలోకి చూస్తూండి పోయాడు.

వెంటనే సూర్యప్రతాపుడు మదనుణ్ణి బిగియారా కౌగలించుకుని "మదనా! అత్యద్భుతమైన నీ వృత్తాంతం నన్ను ఉత్తేజితుణ్ణి చేసింది. మా విజయపురి రాజకుటుంబానికీ, సువర్ణపురి రాజ కుటుంబానికి చాలా దగ్గరి బంధుత్వమున్నది. ఆ పట్టణాన్ని పాలించే శత్రుంజయ మహారాజు నాకు చిన్నాన్న అవుతాడు. మీ తల్లిగారికి ఆయన అన్నగారవుతారు. ఈ విధంగా చూస్తే



మీరు నాకు బావగారు అవుతారు. ఆహా! ఇది ఎంతటి మంచి రోజు! కష్టాలు పడితే పడ్డాం గాని, ఇటువంటి రోజు ఇక మళ్లీ మన జీవితాల్లో రాదు" అన్నాడు.

మదనుడు కూడా అతణ్ణి బిగి కౌగిట బంధించి "నిజం బావగారూ! మనం ఇలా కలుసుకోవటం కూడా నా తల్లి సంకల్పబలమే అయి ఉంటుందనుకుంటున్నాను. ఇంత పెద్ద కథ చెప్పి నీకో చిన్న విషయం చెప్పటం మర్చి పోయాను. అది కూడా విను" అని తాను పక్షి రూపానికి మారేముందు సువర్ణపురి రాకుమారి, మంత్రి కుమారి తనను కలుసుకోవటమూ, అక్కడి సంభాషణనూ వివరించాడు.

సూర్యప్రతాపుడు అంత బాధలోనూ చిన్నగా



నవ్వి "అవును. మనోహరి నా చెల్లెలే. మా మందిరంలో చక్కటి కలగాంచి, కలలో అందానికి నవమన్మథుడూ, పరాక్రమానికి దీరార్జునుడూ వంటి భర్తను కనుగొన్నది" అన్నాడు.

ఆ తర్వాత సూర్యప్రతాపుడు తన గురించి ఇంకా చెప్పవలసిన మాటలన్నీ చెప్పాడు. ఇద్దరూ కర్తవ్యం గురించి ఆలోచనలో పడ్డారు.

మదనుడు "ప్రతాపా! మనం వెంటనే, రాక్షసుడు తీసికెళ్ళిన మా సోదరి సునందాదేవిని, తక్కిన యువతులను విడిపించాలి. బయలుదేరుదాం పద" అన్నాడు.

సూర్యప్రతాపుడు "అలా కాదు మదనా! అమ్మ పద్ధెనిమిది సంవత్సరాల పాటు అహో రాత్రులు శ్రమించి, దీక్షతో తలపెట్టిన కర్తవ్యం నీకు ముఖ్యం. నువ్వు ఆ పనిమీద వెళ్లు. వదినెను వెతకటానికి నేను వెళతాను" అన్నాడు.

మదనుడు "కాదు నా శత్రువులను సంహరించి, రాజ్యం స్వాధీనం చేసుకునే పని ఎప్పుడైనా చేసు కోవచ్చు. ప్రస్తుతం తక్షణ కర్తవ్యం సునందను కాపాడుకోవటం" అన్నాడు. ఆ విషయమై వారిరువురూ తర్జన భర్జనలను కొనసాగిస్తూండగా "చిరంజీవులారా!" అన్న ఓ స్త్రీ కంఠస్వరం నుంచి లలితంగా మాటలు వినిపించాయి.

మదనుడు "ప్రతాపా! అది అమ్మ కంఠస్వరమే! అదృశ్యంగా ఆమె సంకల్పశక్తి మనికి కర్తవ్య బోధ చెయ్యటానికి వచ్చినట్లున్నది" అన్నాడు.

వెంటనే సూర్యప్రతాపుడు పాలరాతి వేదిక మీది నుండి లేచి, శూన్యానికేసి రెండు చేతులూ జోడించాడు. మదనుడు కూడా లేచి చేతులు జోడించుకున్నాడు.

స్త్రీ కంఠస్వరం "ఒకరి కార్యం పట్ల మరొకరికి ఉన్న మీ శ్రద్ధ కొనియాడ తగిందే. అయితే, ప్రస్తుతం మన సునందకు వచ్చిన ఆపద ఏమీ లేదు. ఆమె ఎక్కడ ఏ పరిస్థితిలో ఉన్నదో నాకు తెలుసు. ఆమెతో బాటు కాలంధర అనే మంత్రగత్తె రాక్షసుడి ద్వారా తీసికెళ్లిన విజయపురి యువతులు కూడా సురక్షితరంగా ఉన్నారు. అంతేకాదు, నా మేనకోడలైన సువర్ణపురి రాజపుత్రి మనోహరిని, మంత్రి పుత్రియైన గుణసాగరిని కూడా మాంత్రికురాలు ఒకానొక దుష్ట ప్రయోజనాన్ని ఆశించి తన నివాస స్థలానికి చేర్పించుకున్నది. ఇంకా ఒక్క నెల రోజుల దాకా వాళ్లకందరికీ

ఎటువంటి ప్రమాదమూ ఏర్పడదు. ఈ నెలరోజుల్లో వాళ్లజోలికి ఎవ్వరూ వెళ్లరు. మరో మాట, మీరు తొందరపడి కాలంధర నివాసానికి వెళితే, ప్రపంచానికి కొందరు దుష్ట మాంత్రికులు, మాంత్రికురాండ్రు తలపెట్టిన వినాశనాన్ని తప్పించే అవకాశాన్ని పోగొట్టిన వాళ్లవుతారు. తమ తాంత్రిక శక్తులతో వాళ్లింకా కొన్ని గందర గోళాలు చేస్తారు. సునందవంటి సుక్షత్రియ యువతులు, విజయపురి యువతుల వంటి సామాన్య యువతులు లక్షమంది, మనోహరి, గుణసాగరి వంటి కన్యలు వెయ్యి మంది వాళ్లకు కావాలి. వాళ్లందరిని సేకరించుకని, సరిగ్గా ఒక్క మాసం తర్వాత ఆ క్షుద్రకూటమి 'పాతాళ హెూమం' అనే ఓ భయంకర ప్రక్రియను ప్రారంభిస్తారు. సరిగ్గా ఆ సమయంలోనే మనం రంగంలో దిగుదాం. ప్రస్తుతం నా శరీరం కాలంధర నివాసంలో, ఆ మాంత్రికురాలి ఎదుటనే ఉండి దానిని భయపెడుతున్నది. ఆత్మ మీకు కర్తవ్యం బోధించటానికి వచ్చింది. సునంద, మనోహరి, గుణసాగరి, ఇంకా తక్కిన యువతుల విషయమై ఒక్క నెలరోజులదాకా మీరేమీ ఆలోచించవద్దు. వాళ్లకే ఆపదా కలుగకుండా నేనున్నాను. ఈ నెలరోజులు మీకు వీలైన పద్ధతిలో మరే ఇతరమైన పనులో చూసుకుంటూ ఉండండి. వెళుతున్నాను" అని వినిపించింది.

మదనుడు తేలికగా నిట్టూర్చి "హమ్మయ్య! అమ్మ వచ్చి గీతోపదేశం చేసింది. ఇక మనం మన వాళ్లను గురించి దిగులు పడాలిసిన అవసరం లేదు" అన్నాడు.

సూర్యప్రతాపుడు కూడా చిరునవ్వుతో "అవును





బావగారూ! ఇక నా చెల్లెలిని మీతో బాటు విశాలపురి సింహాసనం మీద కూర్చోబెట్టే ప్రయత్నానికి నాంది పలుకుదాం, పదండి'' అన్నాడు. ఆ విధంగా నిర్ణయించుకుని వాళ్లిద్దరూ అక్కణ్ణుంచి బయలుదేర బోతూండగా అక్కడికి సమీపంలో కొందరు స్త్రీలు మాట్లాడుకుంటూన్న మాటలు వినిపించాయి.

వెంటనే మదనుడు "ప్రతాపా! ఇది ఉద్యానవనం. ఆడవాళ్లు విహరించే చోటుకి అప్రయత్నంగా వచ్చి చేరుకున్నాం. ప్రస్తుతం వాళ్ల కంట పడటం బావుండదు'' అన్నాడు.

సూర్యప్రతాపుడు "అవును. మనం కార్యం సాధించుకునేదాకా సాధ్యమైనంతవరకూ ఎవరి కంటా పడకుండా గోప్యంగా ఉండటమే మంచిది. ఇప్పుడేం చేద్దాం'' అన్నాడు. మదనుడు అటూ ఇటూ తల త్రిప్పి చూశాడు.

అక్కడికి సమీపంలో ఓ లతామంటపం కనిపించింది. ఆ మంటపం చుట్టుప్రక్కలా, పైనా, రకరకాల పూలతీగెలు అల్లిబిల్లిగా అల్లుకుని వ్యాపించి ఉన్నాయి. అందులో ఉన్నవాళ్లను బైటవాళ్లు చూడలేరు.

మదనుడు సూర్యప్రతాపుడి చెయ్యి పట్టుకుని గబగబా ఆ మంటపం లోకి తీసికెళ్లాడు. ఇద్దరూ అక్కడ నక్కి కూర్చున్నారు. తీగెల సందుల్లోంచి వాళ్లిద్దరి చూపులు సూదంటురాళ్లలా ముందుకు సాగాయి.

ఆ సమయంలో, పదహారేళ్ల వయస్సు కలిగిన ఓ అందాల బొమ్మవంటి యువతి పట్టు జలతారు పావడా గాలికి అటూ కదులుతూంటే, వయ్యారంగా నడుస్తూ అక్కడికి వచ్చింది. ఇంచుమించు ఆమె వయస్సే కలిగిన మరికొందరు కన్యలు కూడా ఆ యువతి ననుసరించి వచ్చారు.

ముందువచ్చిన యువతిని చూడగానే ఆమె రాజపుత్రి అనీ, తక్కిన వాళ్లు చెలికత్తెలనీ, గ్రహించారు మదనుడు, సూర్యప్రతాపుడు.

చల్లటి సాయంకాలపు గాలి ముంగురులను అలవోకగా కదలిస్తూండగా ఆ యువతి అంతకు ముందు సూర్యప్రతాపుడు, మదనుడు, కూర్చున్న శిలావేదిక మీద కూర్చున్నది. తక్కిన యువతులు ఆమె ఎదురుగా పచ్చిక బయలుమీద కూర్చున్నారు.

ఒక యువతి శిలావేదికమీది యువతిని చూస్తూ "యువరాణీ! రాగానే జలక్రీడలు మొదలు

పెడతారనుకున్నాను. ఇలా నీరసంగా కూర్చుండి పోయారేమిటమ్మా?" అన్నది.

రాజపుత్రి "మనస్సేం బాగాలేదే! అంతఃపురంలో చిరాకనిపించి ఇలా వచ్చాను గాని, తీరా వచ్చాక ఇక్కడ కూడా చిరాగ్గానే ఉంది" అన్నది.

మరొక యువతి "ప్రస్తుతం విజయపురిలో ఏర్పడిన పరిస్థితిని గురించే మీ విచారానికి కారణమా రాకుమారీ!" అన్నది.

రాకుమారి అవునన్నట్లు తల ఊగించింది. వేరొక యువతి "ఏం చేద్దామమ్మా! అక్కడ మహారాణిగారిని, కొన్ని వేలమందిని ఎవరో మంత్రగత్తె మాయంచేసుకు పోవటంవల్ల ఆగి పోయింది గాని, లేకపోతే ఇక కొద్దిరోజుల్లో విజయపురి యువరాజుగారైన సూర్యప్రతాప సింహుల వారికీ, నీకూ వివాహ మహోత్సవం జరిగేది. నిశ్చితార్థం చేసుకు రావాలిసిన పురోహితుల వారు తెల్లముఖం వేసుకుని ఇంతకు ముందే వచ్చారు. అప్పట్నుంచి మీ మనసు ఉల్లాసంగా లేదన్న విషయం మాకూ తెలుస్తూనే ఉన్నది" అన్నది.

ఆ యువతుల ప్రసంగంలో హఠాత్తుగా తన ప్రసక్తి వచ్చేసరికి సూర్యప్రతాపుడు విస్తుపో యాడు. పైగా విశాలపురి రాజకుటుంబంతో తమకు వియ్యమా!

పద్దెనిమిది సంవత్సరాల క్రిందట మంచి చెడ్డలను విస్మరించి, మానవత్వం మంట గలిపి, సాటి రాజలోకంలోనే తలవంపులు తెచ్చుకునేట్టు ప్రవర్తించిన రాజు, తనకు కూతుర్ని ఇవ్వదలచి తన అన్నదగ్గరికి పురోహితుణ్ణి పంపటమా? మదనునితో కలిసి విశాలపురి రాజును చిత్రవధ



చెయ్యాలని తాను ఉన్నాడు.

ఒక్కసారి అన్ని ఆలోచనలు తనలో చెలరేగటంతో సూర్యప్రతాపుడు, వాటిని బలవంతంగా అణచు కుంటూ, సాభిప్రాయంగా మదనుణ్ణి చూశాడు.

ఆ మాటలవల్ల సూర్యప్రతాపుడు కలత చెందుతాడని ముందే గ్రహించిన మదనుడు సూర్యప్రతాపుడి భుజం తట్టి; వాళ్లింకా ఏం మాట్లాడుకుంటారో వినమని సంజ్ఞచేశాడు.

రాజపుత్రి విచారస్వరంతో "నా వివాహం వాయిదా పడినందుకో, రద్దు అయినందుకో నేను విచారించటం లేదే? విజయపురి మహారాణి సునందాదేవి మాకు బంధువురాలు. మా అన్నయ్యకు ఆమె అంటే పంచప్రాణాలు. సొంత చెల్లెలి కంటె ఎక్కువ ప్రేమతో చూసుకునేవాడు. అసలు ఈ విశాలపురి మీదకు మా అన్నయ్య దండెత్తి, చండవర్మను యుద్ధంలో ఓడించింది కూడా మా వదినె కారణంగానే సుమా!" అన్నది.

తమలో ఉత్సుకతను రేకెత్తిస్తూ, ప్రస్తుతం తాము అనుకున్న విధానానికీ, అక్కడ ఏర్పడిన పరిస్థితులకూ, పరస్పరం సంబంధం లేకుండా ఉండటాన్ని విస్మయం చెందుతూనే సూర్యప్రతాపుడు, మదనుడు, తదేకంగా మాటలనే వినసాగారు.

చెలికత్తెల్లో ఓ యువతి "రాకుమారీ! మీ అక్కగారైన సునందాదేవి గారంటే మీ వదినె గారు కూడా ఎంతో భక్తి ప్రపత్తులు చూపించటం మేము చాలా సార్లు విన్నాము. మనం మన రాజధానినుంచి ఇక్కడికి వచ్చి పది రోజులైంది. ప్రభువులవారు నీ వివాహం నిర్ణయించటానికే మనల్ని రప్పించారు. పూజ్యురాలైన సునందా దేవి క్షేమంగా తిరిగి విజయపురి చేరుకోవాలని కోరుకోవటం కంటె మనమేం చెయ్యగలం" అన్నది.

ఆ విధంగా వాళ్లుమాట్లాడుకుంటూండగానే హఠాత్తుగా కొందరు ముసుగుమనుషులు అక్కడికి వచ్చి భయంకరంగా వికవు నవ్వులు నవ్వసాగారు.

(ఇంకావుంది)





## 8

[జరిగిన కథ: బ్రాహ్మణాగ్రహారం నుండి బయలుదేరిన రాణి ప్రభావతీదేవి ఎడతెగని ప్రయాణం చేసి బదరి కారణ్యం చేరుకుని అక్కడ ఒక సిద్ధపురుముని సేవించి, 'కాయసిద్ధి' అనె సిద్ధని సంపాదిస్తుంది. తరువాత కామ్యకవనంలోని సిద్ధయోగీంద్రునివద్ద 'ప్రాణప్రతిష్ఠ' అనే సిద్ధిని సంపాదించి, చివరకు హిమాలయాల్లో ఉగ్రతపస్సుచేసి, అక్కడ కొన్ని దివ్య ఔషధులను సంపాదించి, కొన్నేళ్ళ తరువాత ఒకనాటు సువర్ణపురి సమీపంలోని అడవికి తిరిగివచ్చి, సమాధిలోంచి తన కుమారుని అస్థిపంజరాన్ని తనవద్దకు రప్పించుకుని. దానికి ఇరవైమూడేళ్ళ ప్రాయంలో ఉన్న యువకుడికి తగ్గట్టు ఆయా దశలు పొందేలా చేస్తుంది. ఆ ఇరవైమూడేళ్ళ యువకుడు నేనే." అని మదనుడు సూర్యప్రతాపునికి తన వృత్తాంతం తెలువగా, మదనుడు తనకు బావగారే అని సూర్యప్రతాపుడు తెలుసుకుంటాడు. అప్పుడు ప్రభావతీదేవి అదృశ్యరూపంలో వారికి కొన్ని వివరాలు తెలిపి, అదృశ్యమవుతుంది. ఆ తర్వాత ఆ వనం వదిలి వెళ్ళబోతున్న మదనుడూ సూర్యప్రతాపుడూ ఆ వనంలో ఓ రాకుమారి తన చెలికత్తెలతో కలిసివచ్చి మాట్లాడుకోవటం వింటారు. వారి మాటలవల్ల ఆ రాజకుమారిని సూర్యప్రతాపునికి వివాహం చేయ నిశ్చయించినట్లు తెలుసుకుంటారు. అంతలో హఠాత్తుగా కొందరు ముసుగు మనుషులు అక్కడికి వచ్చి రాజకుమారిని ఆమె చెలికత్తెలనూ చూసి వికవు నవ్వులు నవ్వసాగారు. ఇక చదవండి]

ఉద్యానవనంలోకి హఠాత్తుగా వచ్చిన ముసుగు మనుషులు తమ్ము చుట్టుముట్టి వికవు నవ్వులతో ఆ ప్రదేశాన్ని దద్దరిల్ల జేస్తూండగా, రాకుమారితో బాటు తక్కిన యువతులంతా భయభ్రాంతులయ్యారు.

క్రింద పచ్చికమీద కూర్చున్న వారంతా తత్తర పాటుతో లేచి యువరాణి ప్రక్కన చేరారు. రాజపుత్రి తీవ్రంగా వాళ్ళను చూస్తూ ఎవరు మీరు? ఏమిటీ దౌర్జన్యం? మిమ్మల్ని కండకండలుగా కోసి కాకులకు గద్దలకు వేయిస్తాడు మా అన్నయ్య! ప్రాణాలమీద ఏ మాత్రం ఆశ ఉండినా, మర్యాదగా వెంటనే ఇక్కడినుంచి వెళ్ళిపొండి" అన్నది.

ముసుగు మనుషులకి నాయకత్వం వహించిన లావాటి ఓ వ్యక్తి మరోమారు వికటంగా

కిరణ్ కుమారి



వెడనవ్వు నవ్వి "మీ అన్నయ్య ఇక్కడ ఉంటే నువ్వన్నట్లు జరిగేదేమో? ఎందుకంటె అఖండమైన పరాక్రమంతో మా చండవర్మ రాజును జయించి, విశాల పురినుంచి పారద్రోలిన వీర శిఖామణి కదా ఆయన? ఇప్పటికి మీ అన్నయ్య మా రాజుగారి అనుచరుల చేతుల్లో బందీ అయి ఉంటాడు. ఇక కాసేపట్లో మా నగరానికి చేరి మా చండవర్మ ప్రభువుల చేతుల్లో ఏమౌతాడో ఆ దేవుడికే ఎరుక" అన్నాడు.

రాకుమారి తాను కూర్చున్న చోటు నుంచి దిగ్గున లేచి "ఛీ అసందర్భ ప్రలాపీ! వీరాధివీరుడైన మా అన్నయ్య సామాన్య భటులైన మీ చండవర్మ అనుచరుల చేత చిక్కి బందీ కావడమా? ఎవర్ని గురించి ఎవరి దగ్గర ఏం మాట్లాడుతున్నావో తెలుసా?" అన్నది.

ఆ బృందం నాయకుడు మళ్లీ నవ్వి "ఆవేశ పడకు రాకుమారీ! మా చండవర్మ మహారాజు నియమించిన వేగులు విశాలపురిలో రాత్రింబవళ్లూ తిరుగుతూ, ఎప్పుడేం జరిగినా క్షణాలమీద మాకు వార్తలు అందజేస్తున్నారు. పాపం, వారి తమ్ముడితో నీ వివాహం జరిపించాలని, ఎంతో ఆరాట పడిన నీ అన్నయ్య ఆశ అడియాస కాగా, మనో వ్యాకులంతో ఊరి చివర ఉన్న ఏకాంత మందిరానికి వెళ్ళాడు. అక్కడ ఇద్దరు ముగ్గురు కాపలా భటులు మాత్రమే ఉన్నారు. అక్కడ ఒంటరిగా ఏదో ఆలోచిస్తూనో, మెదడు అలిసిపోయి నిద్రిస్తూనో ఉన్న మీ అన్నను అదును కనిపెట్టి మా వాళ్లు బంధించటం ఏమంత కష్టం కాదు. బంధించిన వ్యక్తిని అడ్డ దారులంబడి మా నగరం [illegible]టం మరీ సులభం. ఇక ఇక్కడ పది పన్నెండు మంది చెలికత్తెలతో ఉన్న నిన్ను తీసుకుని మా రాజుగారి దగ్గరకి వెళ్ళటం మాకు అంతకంటె సులభం. ఉద్యానవనానికి కాపలా కాసేవాళ్లు ఇంత క్రితమే మా చేతుల్లో పరలోకానికి ప్రయాణం [illegible]ట్టారు. ఇప్పటికే చాలా వివరాలు చెప్పాను. ఇక ఈ రాత్రికి తమ విలాస మందిరంలో మా చండవర్మ మహారాజుగారు కావాలిసినన్ని వివరాలు చెబుతారు. మీరంతా మర్యాదగా మా వెంట వస్తే సరేసరి - లేకపోతే ఒక్కొక్కరు ఒక్కొక్కరిని ఎత్తుకు పోవాలిసి ఉంటుంది" అన్నాడు.

ముసుగు మనుషుల్లో ఒకడు "దొరా! పులి

లేడిని అడిగి తింటుందా? వీళ్ళ ఇష్టాయిష్టాలతో మనకేం పని? త్వరగా పని ముగించుకుని వెళదాం పదండి" అని ఓ చెలికత్తెను మేకపిల్ల నెత్తుకున్నట్లు ఎత్తుకుని భుజమ్మీద వేసుకున్నాడు.

తక్కిన ముసుగు మనుషులు కూడా తలా ఒక చెలికత్తెను ఎత్తుకున్నారు. వాళ్ళు ముసుగు మనుషుల చేతుల పట్టులో గిలగిలలాడుతూ బిగ్గరగా ఆర్తనాదాలు చెయ్యసాగారు.

పొట్టిగా లావుగా వున్న ముసుగు మనుషుల నాయకుడు రాజపుత్రిని పట్టుకోవటానికి చేతులు ముందుకు సాచాడు. దిగ్భ్రాంతురాలైన రాజ పుత్రి బెదురుగా వెనుకడుగులు వెయ్యసాగింది.

అంతవరకు జరిగిందంతా చూస్తూ, అప్పటికే కర్తవ్యం నిర్ణయించుకుని వున్న మదనుడు, సూర్యప్రతాపుడు చెరో వేపుకి నక్కినక్కి ప్రాకుతు చెట్లచాటుకి చేరుకునివున్నారు.

సూర్యప్రతాపుడు చెలికత్తెలను పట్టుకున్న ముసుగు మనుషులవేపూ, మదనుడు రాజ పుత్రిని పట్టుకోవటానికి వస్తూన్న ముసుగు మనుషుల నాయకుడివేపూ చాటున పొంచివున్నారు.

ముసుగు మనుషుల నాయకుడు "పులిపంజా బారిన పడిన లేడిపిల్లవు. ఇంకెక్కడికి పోతావు రాకుమారీ?" అంటూనే ఆమె చెయ్యి పట్టుకున్నాడు.

మరుక్షణం ఆ దుష్టుడి చెయ్యి భుజందాక తెగి భూమిని కౌగలించుకున్నది. బాధతో అరుస్తూనే ముసుగు మనుషుల నాయకుడు నివ్వెర పోతూ వెనక్కి తిరిగి చూసేసరికి రక్తసిక్తమైన కరవాలాన్ని అతడి కళ్ళముందు భయంకరంగా ఝుళిపిస్తూ, కోపదృష్టులతో చూస్తున్న మదనుడు కనిపించాడు.





మదనుడు వెటకారంగా "పులిపంజా నీ చెయ్యికాదురా నా చెయ్యి! దీని బారినుంచి నిన్ను కాపాడగలడేమో ఆ చండవర్మను పిలు" అన్నాడు.

ఎడంచెయ్యి తెగిపడినా మొండి ధైర్యంతో ముసుగు మనుషుల నాయకుడు ఒరనుంచి కుడిచేత్తో కత్తినిదూసి మదనునితో తలపడ్డాడు.

అప్పటికే అటుప్రక్కన సూర్యప్రతాపుడి చేతిలో నల్గురు ముసుగు మనుషులు నేలకూలారు. తక్కినవాళ్ళు తాము పట్టుకున్న చెలికత్తెల్ని విడిచి పెట్టి, ఒరలనుంచి కత్తులుదూసి సూర్య ప్రతాపుణ్ణి ఎదుర్కొన్నారు.

కానీ, వీరాధివీరులైన మదనుని ముందు ముసుగు మనుషుల నాయకుడూ, సూర్యప్రతాపుని ముందు ముసుగు మనుషులూ ఎంతోసేపు నిలువ లేకపోయారు. వాళ్ళనందరినీ భూమాతకు బలియిచ్చి కత్తులను ఒరలలో ఇముడ్చుకుంటూ ఇద్దరూ ఒకచోటికి చేరుకున్నారు.

క్షణాలమీద ముంచుకువచ్చిన ప్రమాదం నుండీ తమ్ము కాపాడిన ఆ వీరసుందర యువకులను భక్తిపూర్వకములైన గౌరవ దృష్టులతో చూస్తూ, రాజపుత్రి వాళ్ళకెదురుగా నడిచింది. చెలికత్తెలు కూడా చేతులు జోడించుకుని తమ రాకుమారిని అనుసరించారు.

రాజపుత్రి మదనుణ్ణి, సూర్యప్రతాపుణ్ణి, సమీపించి చేతులు జోడించి నమస్కరిస్తూ "ఆపద్బంధువులై వచ్చి కాపాడిన దైవస్వరూపులకు జీవితాంతం కృతజ్ఞురాలిని" అన్నది.

మదనుడు నవ్వుతూ "ఆపద అనే పదం తీసేస్తే మేము మీకు నిజంగానే బంధువులం చెల్లెమ్మా!" అన్నాడు.

అతడి మాటలకు రాకుమారి ఆశ్చర్యపోతూ "అన్నయ్యా! మీరేమంటున్నారో నాకు అర్థం కావటం లేదు. మీరు మా బంధువులా?" అన్నది.

మదనుడు నవ్వుతూ "బంధువులంటే అలాంటి ఇలాంటి బంధువులం కాదమ్మా! నేను సాక్షాత్తు అన్నయ్యను, ఈయన నాకు సాక్షాత్తు బావగారు. అంటే నీకు కాబోయే భర్త అన్నమాట." అన్నాడు.

రాకుమారి ముఖంలో ఒక్కసారిగా ఆనంద జ్యోతులు వెల్లివిరిశాయి. చెలికత్తెల ఆనందానికి మేరలేకుండా పోయింది.

చెలికత్తెల్లో ఒకతె చొరవగా మదనునితో "వీరకుమారా! మీ మాటల్ని బట్టీ చూస్తే వీరు విజయపురి యువరాజుగారైన సూర్యప్రతాప సింహులవారు అని అనుకోవాలి. అంతేనా?" అన్నది.

మదనుడు "అనుకోవడ మెందుకు? అన వచ్చును కూడా. వివాహ నిశ్చితార్థం తప్పి పోయిందని ఇంతకుముందు విచారించారుగా? ఇప్పుడు సంతోషించండి" అని సూర్యప్రతాపుని వైపుతిరిగి "ఏం ప్రతాపా? అన్నీ నేనే మాట్లాడు తున్నాను. నువ్వు నోరువిప్పవేం?" అన్నాడు.

సూర్యప్రతాపుడు "మదనా! వేడుక కలిగించే మాటలు రాజమందిరం వెళ్ళాక మాట్లాడుకో వచ్చు. అమ్మగారి ఆశీర్వాదంవల్ల మన ఆప్తులంతా ఒకచోటకి చేరుకుంటున్నారు. నా వూహ నిజమైతే, ఒకప్పటి మీ విశాలపురిని దుష్టబుద్ధితో ఆక్రమించి చండవర్మను పారద్రోలి, కోటను అధీనం వుంచుకున్నది వీరసింహుడనే రాజపుత్రుడు కావచ్చు. అతడు వరుసకు మా వదినెకు అన అవుతాడు నీలాగే. నేను అన్నది నిజమో కా మీ చెల్లెలిని నువ్వే అడుగు" అన్నాడు.

రాకుమారి చిరునవ్వుతో "నిజమేనని వీ బావగారికి చెప్పన్నయ్యా! దానికి బోలెడంత క వున్నది మనం నగరానికి వెళదాం పదండి అన్నీ వివరంగా మాట్లాడుకోవచ్చు" అన్నది.

సూర్యప్రతాపుడు "మదనా! ముందు చెలికత్తెల కలిసి మీ సోదరిని వెళ్ళమని చెప్పు. వీరసింహుడ కూడా ఆపదలో వున్నాడేమోనని అనుమానం వున్నది" అన్నాడు.

మదనుడు తలవూగిస్తూ "అవును చెల్లీ



సూర్యప్రతాపుడు, నేను వెళ్ళి అన్నయ్య క్షేమం తెలుసుకుంటాము. ఏదైనా జరగరానిది జరిగి వుంటే, మేం విలాస మందిరం దగ్గరనుండే బయలుదేరి అన్నయ్యతో సహా వస్తాము. లేక, వారు ఆ చండవర్మ అనుచరులను కడతేర్చి, విలాసమందిరంలో వుండటం క్షేమం కాదనుకుంటే, అక్కణ్ణుంచి రాజమందిరానికి వస్తాము. సూర్య ప్రతాపుడు చెప్పినట్లు ఇక ఇక్కడ ఆలస్యం చెయ్యకుండా వెళదాం పదండమ్మా! దారిలో మాకు విలాస మందిరం ఎక్కడున్నదో చెప్పండి" అన్నాడు.

ఆ తర్వాత వారంతా ఉద్యానవనం నుంచి కోటకు వచ్చారు. అక్కడ పల్లకి ప్రక్కన బోయీలు, వనపాలకులు మృతులై పడవున్నారు.

ముసుగు మనుషుల గుర్రాలు ఆ ప్రాంతంలోనే పచ్చిక మేస్తూండటం చూసిన మదనుడు "చెల్లెమ్మా! విలాసమందిరం ఎటోచెప్పి మీరంతా గుర్రాల మీద వూళ్ళోకి వెళ్ళిపొండి. మేం తర్వాత వస్తాం" అన్నారు.

రాజపుత్రి " అలాగే అన్నయ్యా! నగరానికి దక్షిణంగా వున్న అంకాళమ్మ గుడిదగ్గర భవనంలో వున్నదే విలాసమందిరం. కుడిచేతి వైపుగా వెళితే, కొంతసేపట్లో అక్కడికి చేరుకో వచ్చు" అన్నది.

అనంతరం రాకుమారి, చెలికత్తెలు గుర్రాల దగ్గరికి వెళ్ళి ఒక్కొక్కరూ ఒక్కో గుర్రాన్ని అధిరోహించి, మదనునికి, సూర్యప్రతాపునికి, చేతులు ఊగించి చెప్పారు. సూర్యప్రతాపుడు వారంతా వెళ్ళాక స్యముఖంతో మదనుణ్ణి చూస్తూ "బావగారూ అక్కడి గుర్రాలు సరిగ్గా లెక్కపెట్టినట్లు వాళ్ళక



నరిపోయాయి. మనం ఏ వాహనం మీద వెళదా మంటారు!" అన్నాడు.

మదనుడు తను ఏం చేయ్యాలో వ్యంగ్యంగా సూచించిన సూర్యప్రతాపునితో "కాబోయే చెల్లెలి భర్తను ఇప్పట్నుంచే మోయక తప్పుతుందా బావగారూ! అలాగే కానివ్వండి" అంటూ కామరూప విద్యాప్రభావంవల్ల అందమైన తెల్లని ఓ పంచ కల్యాణి గుర్రంగా మారిపోయాడు.

సూర్యప్రతాపుడు ఆ గుర్రంవీపుమీద చెయి వేసి దువ్వుతూనే "మీరుకూడా నా చెల్లెలికి కాబోయే భర్తే కదా? అనసరం వచ్చినప్పుడల్లా నేనుకూడా మిమ్మల్ని మోస్తానులెండి బావ గారూ!" అంటూనె చిరునవ్వుతో అధిరోహించాడు.

విజయ సూచికంగా సకిలిస్తూ పంచకల్యాణి గుర్రం సూర్యప్రతాపుణ్ణి వీపున భరించి, అంతకు ముందు రాకుమారి చెప్పిన దిశవైపు పరుగులుతీయడం ప్రారంభించింది. గాలితో పందెం వేస్తున్నట్లుగా పరుగులుతీస్తూ, పంచ కల్యాణి మరికొంచెం సేపట్లోనే విశాలపురి విలాస మందిరం చేరుకున్నది.

అంతకుముందు సూర్యప్రతాపుడు వూహించినట్లే అక్కడ వీరసింహుడు అపాయంలో చిక్కుకున్నట్లు వాళ్ళు తెలుసుకోవడానికి ఎంతోసేపు పట్టలేదు. విలాసమందిర ముఖద్వారం దగ్గర కాపలా భటు లిద్దరూ రక్తపు మడుగుల్లో మునిగి వున్నారు! లోపలికి వెళ్ళి చూస్తే వీరసింహుడు లేడు. పరిచారకులిద్దరు కూడా మృతులై పడివున్నారు.

ఉద్యానవనం దగ్గర జరిగినట్లే అక్కడకూడా జరిగి వుండటంతో, ముసుగు మనుషుల నాయకుడు అన్నట్లు వీరసింహుణ్ణి ఈపాటికి



చండవర్మ అనుచరులు వాళ్ల నగరానికి తీసికెళు తూంటారని వూహించారు మదనుడు, సూర్య ప్రతాపుడు. మదనుడు అప్పటికే అశ్వరూపం నుంచి మామూలు రూపానికి వచ్చివున్నాడు.

సూర్యప్రతాపుడు "మదనా! చండవర్మనగరం ఎక్కడున్నదో అక్కడికి వెళ్ళడానికి మార్గమేమిటో నాకు తెలియదు. నీకు తెలిసే అవకాశంలేదు. వాళ్ళు ఒక దిశగా వెడుతూంటే, మనం మరో దిశగా తురుగుతూంటె ప్రయోజనం ఉండదు. వీరసింహుణ్ణి ఎలాగయినా మనం కాపాడి తీరాలి, ఏ చేద్దాం?" అన్నాడు.

మదనుడు సూర్యప్రతాపుడి మాటల్లోని ౧వ సరాన్ని కనిపెట్టి, "ప్రతాపా, ఇక మనం వారిని ఆకాశ మార్గంగా వెళ్ళి వెతకవలసిందే" అని చెప్పి "నేను మొట్టమొదట సంకల్పించు కున్న గండభేరుండం రూపాన్ని మళ్ళీ సంక ల్పించుకుంటాను. నీవు నా వీపుమీద కూర్చో. ఆ చండవర్మ అనుచరులు ఎక్కడికి ఏ దిశలో వెడుతున్నారో మనం త్వరగా తెలుసుకోగల మన్న నమ్మకం నాకున్నది" అని చెప్పి మదనుడు వెంటనే భేరుండం రూపాన్ని సంక ల్పించుకున్నాడు.

సూర్యప్రతాపుడు వెంటనే భేరుండం వీపున ఎక్కి కూర్చున్నాడు. మరుక్షణం రెక్కలు విదిలించి భేరుండం భూమికి కొద్దిగా పైకిలేచి, గివ్వున ముందుకు పోవటం ప్రారంభించింది. సూర్యప్రతాపుడు క్రిందికి చూస్తూ కన్నార్పకుండా చండవర్మ అనుచరులు ఎక్కడైనా కనిపిస్తారా అని తన నిశిత దృష్టులతో ప్రతి అంగుళ మంగుళాన్నీ పరిశీలిస్తూ, క్రిందికే చూస్తుండి పోయాడు.

ఇలా చాలాదూరం ఆకాశ మార్గాన క్రిందికి చూస్తూ వెళ్ళాక, ఆ దిశగా చండవర్మ అను చరులు వెళ్ళలేదని గ్రహించిన భేరుండం ఆ దిశనుంచి మరో దిశకు మళ్ళింది. అప్పటికి సూర్యుడు అస్తమించాడు. (ఇంకావుంది)





9

[జరిగిన కథ: విశాలపురి రాకుమారి, ఆమె చెలికత్తెలనూ ఉద్యానవనంలో హఠాత్తుగా వచ్చి, చుట్టుముట్టిన ముసుగు మనుమలు రాకుమారితో చెప్పిన మాటల వల్ల ఆమె అన్న వీరసింహుడు ఈ ముసుగు మనుమల అనుచరుల చేతుల్లో చిక్కినట్లు తెలుసుకున్న మదనుడూ, సూర్యప్రతాపుడూ, ఆ ముసుగు మనుష్యులందర్నీ హతమార్చి, రాకుమారినీ, ఆమె చెలికత్తెల్నీ రక్షిస్తారు. రాకుమారి ఆ ఇద్దరికీ కృతజ్ఞతలు తెలుపుతుంది. తరువాత ఉభయుల పరిచయం వల్ల మదనుడు తనకు అన్న అవుతాడనీ, సూర్యప్రతాపుడు తనకు కాబోయే భర్త అనీ రాకుమారికి తెలుస్తుంది. అంతటితో ఆమె తన చెలికత్తెలతో కలిసి విశాలపురికి తిరిగి వెళుతుంది. మదనుడు ఒక పంచకల్యాణిగా మారి, సూర్యప్రతాపుణ్ణి తన వీపు మీద ఎక్కించుకుని వీరసింహుని విలాస మందిరం చేరుకుని అక్కడ అతను లేకపోగా, మళ్ళీ గండభేరుండం రూపుదాల్చి, తన వీపున సూర్యప్రతాపుణ్ణి ఎక్కించుకుని భూమికి కొద్దిపైగా ఎగురుతుంది. సూర్య ప్రతాపుడు క్రింద చూస్తూ భూమిని ప్రతి అంగుళాన్నీ పరీక్షించి చూస్తుంటాడు. ఆ దిశలో చండవర్మ అనుచరుల జాడ కనిపించక పోగా, భేరుండం మరో దిశకు మళ్ళింది. అప్పటికి సూర్యుడు అస్తమించాడు. ఇక చదవండి]

వీరసింహుణ్ణి గొలుసులతో బంధించి తమతో తీసికెళుతూన్న అశ్వారూఢులైన ముసుగు మనుషులకు ఒక చోట కొందరు రైతు యువకులు ఎదురు పడ్డారు.

అది విశాలపురికి సరిహద్దు గ్రామం. జనార్దన పురమని పిలువబడే ఆ గ్రామానికి కొద్ది దూరంలోనే వడ్డెపాడు అనే గ్రామం ఉన్నది. ఆ గ్రామం వక్రకేతుడి రాజ్యానికి చెందినది. చండవర్మ మిత్రుడు ఒకప్పుడు విశాలపురి చక్రవర్తియైన ధర్మపాలునికి ద్రోహం చేసిన సామంతుడు అయిన వాడే వక్రకేతుడు. వడ్డెపాడు వక్రకేతుడి రాజ్యంలో చేరినది.

జనార్దన పురం దగ్గర ముసుగు మనుషులకు ఎదురైన రైతు యువకులకు ఆ అశ్వికులను చూడగానే అనుమానం కలిగింది. అశ్వికులంతా ముసుగులు ధరించి వుండటమూ, ఓ గుర్రం

కిరణ్ కుమారి



మీద పూర్తిగా ముసుగు కప్పబడి ఓ వ్యక్తి బంధితుడై వుండటమూ, వాళ్ల అనుమానానికి కారణమైంది.

ఆ రైతు యువకులు ప్రతిదినమూ సాయంత్రం ఊరికి కొంత దూరంలో వున్న ఏటిఒడ్డున కర్ర సాము చేసి, చీకటి పడే సమయానికి ఇళ్లకి చేరుకుంటూంటారు.

పొరుగు గ్రామమైన వడ్డెపాడు శత్రురాజ్యంలోనిది కావటం వల్ల అప్పుడప్పుడు ఆ గ్రామానికీ ఈ గ్రామానికీ గొడవ జరుగుతూండేది. ఆ సంవత్సరం జనార్దన పురం గ్రామస్థుల పంటనంతా వడ్డెపాడు గ్రామస్థులు దోచుకు పోవటంవల్ల నెల రోజుల క్రిందటే రెండు వర్గాల మధ్య పెద్ద కొట్లాట జరిగింది. అటువంటి పరిస్థితి మళ్లీ ఎదురైతే, సమర్థవంతంగా శత్రువులను త్రిప్పి కొట్టడానికి జనార్దన పురం గ్రామంలోని యువకులు కొందరు ప్రతిదినం ఏటిఒడ్డున కర్రసాము నేర్చు కుంటున్నారు.

ఆ రైతు యువకులంతా మసక చీకట్లో, చేతుల్లో కర్రలు పట్టుకుని తమకు అడ్డంగా నిల్చోగానే, ముసుగు మనుషులకు నాయకత్వం వహించిన వ్యక్తి "ఎవరు మీరు? ఎందుకలా దారికడ్డం నిల్చున్నారు? తొలగండి" అని గద్దించాడు.

రైతు యువకుల బృందానికి నాయకత్వం వహించిన బలరామ్ అనే యువకుడు "మేమెవర మైందీ తర్వాత చెబుతాం గానీ; ఆ గద్దింపేమిటి, మీ వాలకమేమిటి? మీరంతా ముసుగుల్లో ఎందు కున్నారు. గుర్రాల మధ్యలో ఓ వ్యక్తి ముసుగు కప్పబడి బంధితుడై గుర్రం మీద వున్నాడు. అతడెవరు? ఎందుకు ఎక్కడికి తీసికెళుతున్నారో చెప్పండి" అన్నాడు.

ముసుగు మనుషుల నాయకుడు కోపంతో ఒరనుంచి కత్తిదూస్తూ ఇవన్నీ చెప్పకపోతే దారికడ్డం తొలగరా ఏం? మర్యాదగా చెబుతున్నాను - మీ దారిన మీరు వెళ్లకపోతే తలకాయలు పుచ్చకాయల్లా ఎగిరి పోతాయి జాగ్రత్త" అన్నాడు.

బలరామ్ నవ్వి "పద్దెనిమిది సంవత్సరాల నుంచి మా రాజ్యాన్ని దోచుకు తిన్న దుష్టుడైన చండవర్మ పీడ విరగడై, కొత్తగా రాజ్యానికి వచ్చిన వీరసింహ మహారాజుగారి పరిపాలనలో చల్లగా బ్రతుకుతున్నాం. మా రాజ్యంలో దుండగాలు,

దుర్మార్గాలు ఇకమీదట వుండవనుకున్నాం. ఇప్పుడు మళ్లీ వాటిని తిరగదోడటానికి మీరు పూనుకున్నా రన్నమాట. మీ బెదరింపులకు మేం భయపడేవాళ్లం కాము. మీ ముసుగులు తీసేసి, బంధితుడి ముసుగు తొలగించి, మీరంతా ఎవరో వివరాలు చెప్పాలి. మాకు నమ్మకం కలిగితే విడిచి పెడతాం. లేదా, మా కొత్వాలు దగ్గరికి తీసికెళతాం'' అన్నాడు.

ఆ మాటలకు ముసుగు మనుషుల నాయకుడు త్రోకతొక్కిన త్రాచులా బుసకొడుతూ తన అనుచరులను వుద్దేశించి ''ఒరేయ్; వీళ్లకి మన వివరాలు కావాలట. ఎవరెవరికి ఏ వివరాలు కావాలో కత్తుల్తోనే చెప్పండి'' అని తన గుర్రాన్ని బలరామ్ మీదికి దూకించి, చేతిలోని కత్తితో అతడి తలకు గురిచూసి కొట్టబోయాడు.

కాని, బలరామ్ ప్రక్కనున్న రైతు యువకుడు రెప్పపాటు కాలంలో తన చేతిలోని సాము కర్రతో ముసుగు మనుషుల నాయకుడి మణికట్టు మీద బలంగా కొట్టాడు. గురి తప్పింది. బలరామ్ ప్రక్కకు తప్పుకున్నాడు.

వెంటనే రైతు యువకులంతా తమ తమ చేతుల్లోని కర్రలనుత్రిప్పుతూ, ముసుగు మనుషులను మార్కొనటానికి సిద్ధపడ్డారు.

ముసుగు మనుషుల నాయకుడు ఇచ్చిన ఆజ్ఞ ప్రకారం ముసుగు మనుషులంతా కత్తులు దూసి రైతు యువకులతో పోరాటానికి ఉపక్రమించారు. బంధితుడైన వ్యక్తిని మూపున భరించి వున్న గుర్రం అక్కడి నుంచి ప్రక్కకు తొలగి పోయింది.

గొలుసులతో నవనాడులూ బిగించి, గుర్రం





జీనుకు కట్టి పడవేయబడివున్న వ్యక్తి అటూ ఇటూ కదల గలుగుతున్నాడే గాని, తప్పించుకోలేక పోతున్నాడు.

గుర్రాల మీద ఉన్న ముసుగు మనుషులతో క్రింద వుండి తాము పోరాటం కొనసాగించటం కష్టమని భావించిన బలరామ్ తన చేతిలోని కర్రతో ముసుగు మనుషుల నాయకుడి గుర్రపు ముందరి కాళ్లకేసి బలంగా మోదాడు.

ఆ గుర్రం బాధతో సకిలిస్తూ, విసురుగా క్రింద పడి పోయింది. వెంటనే ముసుగు మనుషుల నాయకుడు కూడా గుర్రానికి కొంచెం దూరంలో పడిపోయాడు.

తమ నాయకుడు చేసిన పనినే తక్కిన రైతు యువకులు కూడా చేయటంతో, కొద్ది సేపటిలోనే గుర్రాలు నేలకూలి మళ్లీ లేచి ప్రక్కకు తొలగి పోయాయి. వాటి మీదవున్న ముసుగు మనుషులు క్రింద పడి లేచి, రైతు యువకులతో పోరు కొనసాగించారు.

ఆ విధంగా ఇరువర్గాలు బాటమీద తీవ్ర పోరాటం కొనసాగిస్తూండగానే ఆకాశంలో చంద్రుడు ఉదయించాడు.

కత్తి సాములో నేర్పరులైన యువకులు ముసుగు మనుషుల కత్తులు తమ శరీరాలకు తగలకుండా చేతుల్లోని కర్రలతో అడ్డుకుంటూ, సమయం చూసి వాళ్లనే దెబ్బ తీయటం ప్రారంభించారు. రాట్నాల్లా గిరగిర తిరుగుతూ, తమ చేతుల్లోని కర్రలను చిత్ర విచిత్రంగా ప్రయోగిస్తూ, రైతు యువకులు అంతకంతకు ఉత్సాహం పెరిగి తీవ్రంగా విజృంభించటంతో, ముసుగు మనుషులు గగ్గోలు పడిపోయారు. కొంత సేపటికి వెన్నెల బాగా ?లపడింది. పోరాటం ఉధృతం కాసాగింది. బలరామ్‌తో తలపడి ?రాడుతూనే ముసుగు మనుషుల నాయకుడు, ఓ ముసుగు మనిషికి కొన్ని ఆదేశాలు ఇచ్చాడు. అతడు చెప్పినట్లు చెయ్యటానికి ఆ ముసుగు మనిషి ప్రక్కకు పరుగెత్తి ఓ గుర్రాన్ని ఎక్కి ముందుకు దౌడు తీయించాడు.

ఆ ముసుగు మనిషి శర వేగంతో గుర్రాన్ని పరుగెత్తించుకుంటూ, మరికొంత సేపటికే వడ్డెపాడు చేరుకున్నాడు. సరాసరి కొత్వాలు దగ్గరికి వెళ్లి అతడు తన ముసుగు తొలగించాడు. కొత్వాలు అతణ్ణి గురుతుపట్టి "ఏమైంది దొరా?

వీరసింహుణ్ణి పట్టుకున్నారా? మీ నాయకుడు, తక్కిన మన రాజుగారి అనుచరులేరీ?'' అని అడిగాడు.

చంద్రవర్మ అనుచరుడు అతనితో "కొత్వాలూ! విశాలపురికి చెందిన జనార్దనపురం దగ్గర మమ్మల్ని కొందరు యువకులు ఎదుర్కొన్నారు. వీరసింహుణ్ణి పట్టుకున్నాం. కాని, మనం మీ వూరి జనంతో వెంటనే వెళ్లకపోతే, అంతా పాడై పోతుంది. చేజిక్కిన శత్రువు జారిపోతాడు. మేం విశాలపురికి వెళ్లేటప్పుడు చక్కని సూచనలు ఇచ్చి, అవసరమైన సహాయం చేసి తోడ్పడ్డావు. ఇప్పుడు కూడా నీ సాయం కావాలసి వచ్చాను. త్వరగా మీ వాళ్లందరితో కలిసి నావెంట వచ్చి, జనార్దనపురం యువకులకు బుద్ధి చెప్పాలి'' అన్నాడు ఆయాసంతో వగర్చుకుంటూ.

కొత్వాలు "వాళ్లకు బుద్ధి చెప్పటం కాదు. ఈసారి ఆ ఊరు ఊరినే నాశనం చేసి మా పగ తీర్చు కుంటాం, పదండి'' అన్నాడు.

"మరి కొంత సేపటికే కొత్వాలు ఆజ్ఞ ప్రకారం వడ్డెపాటి ప్రజలందరూ చేతుల్లో రకరకాల ఆయుధాలూ, కర్రలూ పట్టుకుని, కొత్వాలు ఇంటి దగ్గరికొచ్చారు. చండవర్మ అనుచరుడి వెంట కొత్వాలు తన మనుషులతో బయలుదేరాడు.

వారందరూ కలిసి జనార్దనపురం దగ్గరికి వచ్చేసరికి ముసుగు మనుషులు రైతు యువకుల చేతుల్లో చావుదెబ్బలు తినివున్నారు. వందల కొలది విరోధులు ఆయుధాలతో తమమీదికి వస్తూండటం చూడగానే జనార్దనపురం యువకులు కంగారుపడ్డారు.

ఒక యువకుడు బలరామ్‌తో "అన్నా! మనం





కూడా ఎవర్నో ఒకరిని ఊళ్ళోకి పంపి మనవాళ్లను పిలిపించుకుని ఉంటే బావుండేది. ఆ వచ్చే వాళ్లను మనం కొద్దిమందిమి ఏమీ చెయ్యలేం. ఏం చేద్దాం?'' అన్నాడు.

బలరామ్ కూడా "అవును. పిరికివాళ్లలా పారిపోవటమూ బాగాలేదు. అలాగని మొండి ధైర్యంతో ఎదుర్కొంటే, అందరం ప్రాణాలు పోగొట్టు కోవటం తప్ప మరో ప్రయోజనం ఉండదు. అట్టే ఆలోచిస్తే, వడ్డెపాడు వాళ్లకూ, ఈ ముసుగు మనుషులకూ ఏదో సంబంధం ఉన్నట్లున్నది. ఇంతకూ ఆ గుర్రం మీద బంధింపబడి ఉన్న వ్యక్తిని కట్టు విప్పి, ఆయనెవరో కనుక్కుందాం పదండి. అసలు ఇదంతా జరిగింది అతని కోసమే కదా? తర్వాత సంగతి చూద్దాం'' అన్నాడు.

ముసుగు మనుషుల నాయకుడు బలరామ్ చేతి కర్రతో తిన్న దెబ్బల వల్ల స్పృహతప్పి క్రింద పడివున్నాడు.

తక్కిన ముసుగు మనుషులు కూడా పల్లె యువకుల చేత తిన్న దెబ్బలతో కీళ్లు విరిగి కొందరు, తలలు బ్రద్దలై కొందరు, క్రిందపడి మరణవేదనతో మూల్గుతున్నారు.

బలరామ్ తన మిత్రులతో కలిసి, బంధితుడైన వ్యక్తి ఉన్న గుర్రం దగ్గరికి నడిచాడు. ఇద్దరు యువకులు గుర్రానికి కట్టబడి ఉన్న కట్లను విప్పి, ఆ వ్యక్తికు కప్పిన ముసుగును తీసి వేశారు. వెన్నెల వెలుతుర్లో అతణ్ణి గుర్తుపట్టిన బలరామ్ "ప్రభూ! తమరినా ఈ తుచ్ఛులిలా బంధించి తెచ్చారు?''. అన్నాడు ఆశ్చర్యం, ఆనందం ముప్పిరిగొంటూండగా.

బలరామ్, వీరసింహుడు విశాలపురిని శతృవుల నుంచి విముక్తి చేసే సమయంలో తాను కూడా ఆ ఉద్యమంలో పాల్గొని ఉండడం వల్ల బాగా పరిచయమైవున్నాడు.

పల్లె యువకులు గొలుసు బంధనాలను కూడా తొలగించడంతో, ఆ వ్యక్తి వీరసింహుడు, బల రామ్‌నూ, తక్కిన యువకులనూ స్నేహపూర్వ కంగా చూస్తూ, "మిత్రులారా! విలాస మందిరంలో విశ్రాంతి తీసుకుంటున్న నన్ను ఈ దుష్టులు ఏమరుపాటు పద్ధతిలో బంధించారు. చండవర్మ దగ్గరికి వీళ్లు నన్ను తీసికెళుతూన్న సమయంలో మీరు తటస్థపడటం నా అదృష్టం. ప్రారంభం నుంచి మీ మాటలన్నీ వింటూనే ఉన్నాను.

నాపట్ల మీకు గల మంచి అభిప్రాయానికీ, చేసిన సహాయానికీ కృతజ్ఞుణ్ణి" అన్నాడు.

బలరామ్ చేతులు జోడించి "అంత మాట అనకండి ప్రభూ! మీ ఏలుబడిలో వున్న రాజ్యం లోని పౌరులం. మహా ధర్మాత్ముడని మా తాత తండ్రులు నిత్యం స్మరించుకుంటూన్న ధర్మపాల చక్రవర్తి గారిని వంచనతో, అధర్మ పద్ధతిలో దారుణంగా వధించి రాజ్యం హస్తగతం చేసుకున్న మహా క్రూరుడు చండవర్మ. అటువంటి వాడి పాలనలో మేం అష్టకష్టాలు పడ్డాం. రకరకాల పన్నులతో, దోపిడీలతో ఆ దుర్మార్గుడు మా రాజ్యంలోని ప్రజలందరి సంపదను పద్దెనిమిది సంవత్సరాల నుంచి దోచుకుంటూ వచ్చాడు. మీరు ఆ పాపాత్ముణ్ణి విశాలపురినుంచి పార ద్రోలినప్పటినుంచి మా కష్టాలు కడతేరాయనీ, మీ పాలనలో మారు రామరాజ్యం సిద్ధిస్తుందనీ మురిసిపోతున్నాం. అటువంటి మిమ్మలను సేవించుకోవటంలో ప్రాణాలు పోయినా అది మా అదృష్టంగా భావిస్తాం" అన్నాడు.

వీరసింహుడు అతడి భుజం తట్టి, అతడి మీది తన అభిమానాన్ని వ్యక్తం చేస్తూ, "మిత్రమా! మీరు అహర్నిశలూ కొల్చుకునే ధర్మపాల చక్రవర్తి నాకు బంధువు. గురుకులం నుంచి, తిరిగి రాగానే మా తండ్రిగారు నాకు ఆనాటి వివరాలన్నీ చెప్పి, చండవర్మ పీచమణచి, విశాలపురి రాజ్యాన్ని విముక్తం చెయ్యమని ఆజ్ఞాపించారు. నేను ఆ ప్రకారమే చేశాను. అయితే, నా కర్తవ్యం ఇంకా పూర్తి కాలేదు. ధర్మపాల ప్రభువుల కుమారుడైన మదనుని అన్వేషణకు నేను దేశాటన చెయ్య వలసివున్నది. ఇంకా కొంతకాలం రాజ కార్యాలు



చక్కబెట్టి, ఆ తర్వాత ప్రయాణమవుదా మను కుంటున్నాను. వరుసకు నాకు సోదరు డయ్యే మదనుడు ఎక్కడున్నా వెతికి తీసుకు వచ్చి, విశాలపురి సింహాసనంమీద కూర్చోబెట్టడమే నా ధ్యేయం'' అన్నాడు.

బలరామ్ ఆశ్చర్యంతో ''ప్రభూ! మీ ఆశయం గొప్పదే. కాని, మా చక్రవర్తి గారి ఐదేళ్ల కుమారుడూ, మా మహారాణి గారు కూడా శత్రువుల చేతుల్లో మృతి చెందినట్లు మేము విన్నామే?'' అన్నాడు.

వీరసింహుడు విషాద స్వరంతో ''లేదు. ఆనాడు జరిగిన దారుణ సమయంలో మా పిన తల్లియైన ప్రభావతీ దేవీ నా తమ్ముడైన మద నుణ్ణి తీసికొని ఎక్కడికో వెళ్లిపోయిందట. చారుల ద్వారా మా నాన్నగారు ఆ వివరాలను అప్పుడే తెలుసుకున్నారు. విజయపురి రాజ కుటుంబంలో కూడా మాకు పూర్వ బంధుత్వ మున్నదట. అప్పట్లో ధర్మపాల చక్రవర్తి బంధు వులైన రాజులు చిన్న చిన్న రాజ్యాలు కలిగి ఉండేవాళ్లు. అందువల్ల దుష్టులైన చండవర్మాది సామంతులను ఎదిరించలేక ఎవరికి వాళ్లే మౌనంగా దుఃఖాన్ని దిగమింగుకొని, కాలం గడి పారు. మదనుడు ఎక్కడున్నా కనుగొన గలనన్న నమ్మకం నాకు ఇప్పటికీ ఉన్నది'' అన్నాడు.

అదే సమయంలో ''అవసరం లేదు బావగారూ! మీ తమ్ముడు నన్ను మోస్తూ, మీ తలపై భాగంలో క్షేమంగా ఉండి, మీ మాటలవల్ల పొందిన ఆనందం పొంగి భాష్పాలై, కళ్ల వెంబడి స్రవి స్తూండగా - ఎప్పుడెప్పుడు మీకు పాద నమస్కారం చెయ్యాలా అని ఆత్రపడుతున్నాడు'' అన్న మాటలు వినిపించగానే వీరసింహుడితో బాటు, బలరామ్ ప్రభృతులైన యువకులు కూడా తలలు పైకెత్తి చూశారు. అప్పుడే ఆ ప్రాంతం అదరిపోయేట్లు కేకలు వేస్తూ, ముసుగు మనిషి వెంటబెట్టుకు వచ్చిన యమకింకరుల్లాంటి పడ్డె పాటి వాళ్లు చేతుల్లోని ఆయుధాలను త్రిప్పుతూ అక్కడికొచ్చి పడ్డారు

(ఇంకావుంది)





## 10

[జరిగిన కథ: వీరసింహుణ్ణి బంధించి తీసుకు వెళుతున్న ముసుగు మనుషులను, జనార్ధనపురం వద్ద, కర్రసాము నేర్చుకొంటున్న రైతు యువకులు అడ్డగిస్తారు. అక్కడ ముసుగు మనుషులకూ, రైతు యువకులకూ పోరాటం జరుగుతుంది. రైతు యువకుల నాయకుడు బలరామ్ వేగానికి తట్టుకోలేని ముసుగు మనుషుల నాయకుడు ఒక భటునితో సందేశం పంపగా వడ్డెపాడు గ్రామ ప్రజలందరూ రకరకాల ఆయుధాలతో జనార్ధనపురం వైపుకు వస్తూంటారు. ఇక్కడ రైతు యువకుల చేతుల్లో చావుదెబ్బలు తిన్న ముసుగు మనుషులు, నేల కూలి మూల్గుతుంటారు. అంతలో ముసుగు మనుషులు బంధించి తెచ్చిన వ్యక్తి సంకెళ్ళు తొలగించిన రైతు యువకులు, అతను తమ ప్రభువే అని తెలుసుకుంటారు. అదే సమయం వీరసింహుణ్ణి వెతుక్కుంటూ ఆకాశమార్గాన గండభేరుండం రూపులో వస్తున్న మదనుడూ, అతని మీద కూర్చున్న సూర్యప్రతాపుడూ అక్కడికి చేరుకుంటారు. వీరిని చూసి అందరూ సంతోషిస్తూండగా, ముసుగు మనుషుల మనిషితో వస్తూన్న వడ్డెపాడు మనుషులు భయంకరంగా కేకలు వేస్తూ, రకరకాల ఆయుధాలను త్రిప్పుతూ అక్కడికి చేరారు.
ఇక చదవండి]

వెంటనే బలరామ్ వీరసింహునితో "మహారాజా! వీళ్లంతా మామీద పగబట్టి వచ్చారు. చండవర్మ రాజ్యంలో సరిహద్దు గ్రామమైన వడ్డెపాడు వీళ్లది. ఎన్నో ఏళ్లుగా వీళ్లకూ, మా గ్రామానికీ విరోధమున్నది. అలసివున్న తమరు కాస్త ప్రక్కకు తప్పుకొండి. వీళ్ల సంగతి మేం చూసుకుంటాం" అని చేతిలోని కర్రను చిరచిర త్రిప్పుతూ శత్రువులను ఎదుర్కొన్నాడు.

మరుక్షణం బలరామ్ అనుచరులైన యువకులు కూడా ఒకర్నొకరు హెచ్చరించుకుని, విరోధుల గుంపులో చొచ్చుకుపోయి వీరవిహారం మొదలు పెట్టారు.

వీరసింహుడు క్రిందపడిన ఓ కత్తినందుకుని శత్రువులను చీల్చి చెండాడుతూ జనార్దన పురం యువకులకు బాసటగా నిలిచాడు. ఆ సంభర మంతా చూస్తూ, పక్షిరూపంలోని మదనుడు



"ప్రతాపా శత్రువులు వేల నంఖ్యలో ఉండినా, లక్షల సంఖ్యలో ఉండినా మనకు లెక్కలేదు. ఇప్పటిదాకా బంధింపబడి ఉన్నందున బడలిక చెందిన అన్నయ్య, పదిపన్నెండు మంది దాకా ఉన్న మన అప్తులు, వాళ్ళతో పోరాటం కొన సాగిస్తూండగా మనం వూరికే ఉండటం ఎందుకు? మనం కూడా రంగంలోకి దిగుదాం. నా వీపు నుండి క్రిందికి దిగు" అని భూమి మీదకు వ్రాలాడు.

వెంటనే సూర్యప్రతాపుడు క్రిందికి దిగి ఒరనుంచి కత్తిదూస్తూనే ముందుకు వురికాడు.

మదనుడు పక్షిరూపంలో అలాగే పైకి ఎగిరాడు. జనార్దనపుర యువకులను వెన్నెల్లో గుర్తిస్తూ, వాళ్లకు రక్షణగా శత్రువుల తలలపై పరిభ్రమిస్తూ, ముక్కుతో గోళ్లతో ముఖాలనూ, వీపులనూ, భుజాలనూ చీల్చసాగాడు.

వీరసింహుడు, సూర్యప్రతాపుడు, కొదమ సింగాల్లా విజృంభించి విరోధులను నురుమాడనారంభించారు.

ఆ విధంగా ముగ్గురు రాజపుత్రులు తమకు తోడుగా నిలిచి, శత్రువులను మట్టి కరిపిస్తూండటం చూస్తూ రెట్టించిన ఉత్సాహంతో బలరామ్ మొదలైన యువకులు అందిన వాణ్ణి అందినట్టు కర్రలతో బాదుతూ, శత్రువుల గుంపుల్లో వీరావేశంతో తిరగ సాగారు.

కేవలం పది పన్నెండు యువకులు మాత్రమే అక్కడ ఉన్నారనీ, వాళ్లను హతమార్చి ఆ తర్వాత జనార్దన పురం మీద కూడా విరుచుకు పడి గ్రామస్థులనందరినీ చంపి, వాళ్ల వెండి బంగారాలను కొల్లగొడదామని భావించిన కొత్వాలుకు అక్కడి పరిస్థితి మింగుడు పడలేదు. చిచ్చర పిడుగుల్లా వచ్చి పడిన ఇద్దరు రాచ యువకులకు తోడుగా ఓ పక్షి కూడా తమ వాళ్లను చిత్రవధ చేస్తూండటంతో చావగా మిగిలిన వారితో కలిసి అక్కడినుండి పారిపోవడం మంచిదని కొత్వాలు భావించాడు.

అప్పటికి వడ్డెపాడు గ్రామస్థులు దాదాపు సగం మంది చనిపోయారు. వాళ్లను తీసుకొచ్చిన ముసుగు మనిషి అంతకు ముందే వీరసింహుని కరవాలానికి బలియై నేలకొరిగాడు.

సమయం చూసి పారిపొండని తన వాళ్లను హెచ్చరిస్తూనే, కొత్వాలు చేతిలోని బల్లెంతో అప్పుడే

తన మీదికి వచ్చిన పక్షిరూపుడైన మదనుణ్ణి పొడవబోయాడు. కాని, తాను దీపం ముందు శలభాన్ని తెలుసుకోకముందే అతడు ప్రాణాలు విడిచిపెట్టాడు.

కుడిరెక్కతో బల్లాన్ని దూరంగా విసిరికొట్టి, ఎడం రెక్కతో కొత్త్యాలును పొదివి పట్టుకుని, ముక్కుతో అతడి కుత్తుకను చీల్చి వేసిన భేరుండ పక్షిరూపుడైన మదనుడు ద్విగుణీకృత పరాక్రమంతో తక్కిన శత్రువుల మీద విక్రమించాడు.

మరికొద్ది సేపటికే క్రూరులైన వడ్డెపాడు విరోధు లంతా అడ్డదిడ్డంగా నరకబడి భూమిమీద పడి పోయారు.

బలరామ్ వీరసింహుని దగ్గరికొచ్చి "తమ పాపానికి ప్రాయశ్చిత్తంగా ప్రాణాలు కోల్పోయిన వీళ్లను జాలి పడకూడదు మహారాజా! సమయానికి మిమ్మల్ని మేము వెంటనే విడిపించనట్టయితే ఈ రాజకుమారుడూ, ఆ పక్షీ దేవదూతల్లా ఇక్కడికి రానట్లయితే వీళ్లంతా మమ్మల్ని చంపి, మా ఊరిమీద పడి మా ఆడవాళ్లను పాడుచేసి ఊరినంతటినీ దోచేవాళ్లు. అంతేగాక - తమ్ము తీసుకొచ్చిన ముసుగు మనిషి చెప్పినట్లు మిమ్మల్ని ఎలా ఉన్న వారి నలాగే తీసికెళ్లి చండవర్మకు అప్పగించేవాళ్లు" అన్నాడు.

అప్పుడే అక్కడికి వస్తూ ఆ మాటలు విన్న సూర్యప్రతాపుడు "రాక్షసులవంటి వీళ్లను నిశ్శేషంగా చంపటంలో దోషమేం లేదు మిత్రమా! దుష్ట సంహారం రాజధర్మమే" అన్నాడు.

పక్షిరూపుడైన మదనుడు కూడా అప్పుడే అక్కడికి వచ్చాడు. సూర్యప్రతాపుణ్ణి గురించి, పక్షి రూపుడైన మదనుణ్ణి గురించి కొంతకు





కొంత అర్థమైనప్పటికీ, సూర్యప్రతాపుడు తన కెలాంటి బావగారో, మదనుడు అతడి కెలా తటస్థ పడ్డాడో, ఎందుకు పక్షి రూపంలో ఉన్నాడో, అయోమయ మనిపించగా, వీరసింహుడు వాళ్లనే చూస్తూండిపోయాడు.

అది గమనించిన సూర్యప్రతాపుడు పక్షిరూపుడైన మదనుణ్ణి ఉద్దేశించి "మదనా! మీ అన్నగారికంతా అయోమయంగా ఉన్నది. ఈ పక్షిరూపం ఆయన్ని వెతకటానికేనని వివరిస్తూ జరిగిందంతా చెబుదాం. నిజరూపానికి రావయ్యా!'' అన్నాడు.

మరుక్షణం మదనుడు మదనుడిలా సౌందర్య కాంతులతో ప్రకాశిస్తూ అక్కడ వెలిశాడు.

తమకు అపరిచితుడైనా, బలరామ్ ప్రభృత యువకులు అతడికి శిరస్సు వంచి నమస్కరించారు.

సూర్యప్రతాపుడు బలరామ్‌ని ఉద్దేశించి "మిత్రమా! ఏ ప్రభువునైతే భక్తి శ్రద్ధలతో సేవించుకోవటానికి మీరంతా ఆరాట పడుతున్నారో, ఏ కూరిమి తమ్ముడి కోసం చండవర్మాదులను పారద్రోలి రాజ్యం అధీనం చేసుకుని అతణ్ణి వెలికి తెచ్చి విశాలపురి సింహాసనం మీద కూర్చో బెట్టాలని వీరసింహ యువరాజు తహతహలాడుతున్నాడో, ఆ విశాలపురి యువరాజు, మదనులవారు వీరే! నేను విజయపురి మహారాజైన ప్రభాకర సింహుడి తమ్ముణ్ణి - సూర్యప్రతాపుణ్ణి... ఒకానొక దుష్ట రాక్షసుడు తనను ప్రేరేపించిన వారికోసం మా వదినెను, మావూరి యువతులను అపహరించుకు పోతూండగా అడ్డుపడి ఆపదలో చిక్కుకున్న నన్ను కాపాడి, ఇప్పుడిక్కడ మిమ్మల్ని కలుసుకోవటానికి కారకుడైన వీరసుందర సౌజన్యమూర్తి ఇతడే! ఈ మదనుని చరిత్ర పురాణ పురుషుల చరిత్రలా ఉంటుంది. అవన్నీ తర్వాత క్రమంగా మీరే తెలుసుకుంటారు'' అన్నాడు.

ఆ మాటలకు బలరామ్, జనార్ధనపుర యువకులు ఆనందాశ్చర్యాలలో ఓలలాడుతూ ఒక్కసారిగా మదనునికి పాదాభివందనం చేసి నిల్చున్నారు.

వీరసింహుడు పెన్నిధిని గన్న పేదలా మదనుణ్ణి కౌగలించుకుని "తమ్ముడూ! ఆడబోయిన తీర్థంలా నువ్వే నా దగ్గరికి వచ్చి నా జీవిత లక్ష్యాన్ని నెరవేర్చావు. అమ్మ ఎక్కడున్నది? మా సోదరి సునందాదేవిని ఏ రాక్షసుడు ఎత్తుకెళ్లాడు? చెల్లెలినిచ్చి వివాహం చెయ్యాలనుకుంటూండగా, దుర్వార్త విని దుఃఖితుడనైన ఈ సమయంలో

విజయపురి యువరాజైన ఈ సూర్యప్రతాపుణ్ణి ఎక్కడ కలుసుకుని కాపాడావు?'' అని ఉప్పొంగిన ఆనందంతో ఏమిటేమిటో అడగడం ప్రారంభించాడు.

మదనుడు "అన్నయ్యా! నాకోసం శ్రమపడిన నీ ఉదార ప్రేమ హృదయాన్ని ఎప్పుడూ పూజించుకుంటూంటాను. అమ్మ ప్రస్తుతం మనకు అందుబాటులో లేదు. మన సూర్యప్రతాపుణ్ణి నేను కలుసుకోవటం అమ్మ సంకల్పబలమే..." అని ఇంకా ఏదో చెప్పబోతూండగా ఆ పరిసర ప్రదేశం దద్దరిల్లి పోయేట్టు అతి భీషణమైన ఓ కర్కశ కంఠస్వరం నుంచి వికృతమైన అట్టహాసాలు వినిపించాయి.

ఉన్నట్లుండి అక్కడ తమకు మరో ఉపద్రవం ఏర్పడిందని భావించిన మదనుడు "ప్రతాపా! మనకు శత్రువులు మామూలు మనుషుల్ను రాజులే కాదు. మాంత్రికులు, మాంత్రికురాండ్రు, రాక్షసులు కూడా ఉన్నారు. ఇప్పుడెవరో రాక్షసుడే ఆర్భాటంగా మనమీదికి వస్తున్నాడు. వీడి సంగతి ఎలా తేల్చాలో నాకు తెలిసినంతగా మీకు తెలియదు. నువ్వు అన్నయ్య మన మిత్రులు, దూరంగా వెళ్లండి. అవసరమైన ఆపదను కొని తెచ్చుకోవటం అంతమంచిది కాదు" అన్నాడు.

మదనుడు అలా అనటంలో ఉన్న ఔచిత్యాన్ని సూర్యప్రతాపుడు వెంటనే గుర్తించాడు.

రాక్షసులకు కొండంత శరీరమూ, మితిమీరిన బలమే కాదు, మాయలూ, మంత్రాలు కూడా ఉంటాయి. ఇప్పుడు తమ మీదికి వచ్చే రాక్షసుడు వాటిని తమ మీద ప్రయోగిస్తే తప్పకుండా ఆపద కలుగుతుంది. మదనుడు సమర్థ



వంతంగా ఆ మంత్రాలను, మాయలను ఎదుర్కో-
గలడు...

ఆ విధంగా ఊహించిన సూర్యప్రతాపుడు వీర సింహుణ్ణి, బలరామ్ మొదలైన వాళ్లను బలవంతంగా అక్కణ్ణుంచి కొంతదూరం తీసి కెళ్లాడు. వీరసింహుడు కంగారు పడుతూ "ప్రతాపా! మదనుడు... ఒంటరిగా..." అని ఆవేదన పడు తూండగా "బావగారూ! రాక్షసులతో పోరాటం మీ తమ్ముడు చేసినంత అందంగా మనం చేయలేం. ఆరాటం చెందకుండా వినోదం చూస్తూండండి" అన్నాడు నవ్వుతూ సూర్యప్రతాపుడు.

అతడలా అన్న కొద్ది క్షణాలకే భీకర పర్వతా కారుడైన ఓ రాక్షసుడు భయంకరంగా అరుస్తూ మదనుని కట్టెదుట ఆవిర్భవించాడు. ఆ రాక్షసుడు తమ విజయపురిముందు తాను చూసిన వాడేనని గుర్తించాడు సూర్యప్రతాపుడు... వాడి కాలి వ్రేలి పట్టుకుని వెళుతూండగా జరిగిన ప్రమాదం నుంచే మదనుడు తనను కాపాడాడని జ్ఞాపకం చేసుకున్నాడు.

జంబోదరుడనే పేరు గల ఆ రాక్షసుడు వికృతపు నవ్వులు చాలించి "మీ అమ్మ సంకల్ప బలం మా కాలంధర మాంత్రికురాలి చేతిలో బూడిద అయిపోయిందిరా అర్భకా! విశాలపురి ఉద్యానవనంలో నువ్వూ, నీ బంధువూ, మాట్లాడు కుంటూండగా మీకు కర్తవ్యం చెప్పటానికి శరీరాన్ని మా మాంత్రిక యజమానురాలి దగ్గర ఉంచి, ఆత్మను మీ దగ్గరికి చేర్పించింది మీ అమ్మ. ఆ సమయంలో మేం వాస్తవం తెలుసు కున్నాం. మా కాలంధరను, మా మాయామయిని భయ పెడుతూ ఎదురుగా నిల్చున్నది మీ అమ్మ



శరీరం మాత్రమేనని కొంత సేపటికి నేను అక్కడికి వచ్చి గ్రహించాను. మీ అమ్మ శరీరాన్ని మేం కాల్చివేశాం. ఇప్పుడు అమె ఆత్మ గాలిలో తిరుగుతున్నది. ఏ పని చెయ్యటానికైనా ముఖ్యమైన సాధనం శరీరమే కదా? అటువంటి శరీరాన్ని కోల్పోయిన మీ అమ్మ ఆత్మ ఇక మీదట మమ్మల్నేమీ చెయ్యలేదు. అదే విధంగా మీకు ఉపయోగపడనూ లేదు. అర్థమైందా?'' అన్నాడు.

పరిస్థితిని అంత వివరంగా ఆ రాక్షసుడు చెప్పగానే, కొద్ది దూరంలో వీరసింహాదుల దగ్గర నిల్చుని ఉన్న సూర్యప్రతాపుడు కలవరపాటు చెందాడు. వీరసింహుడు విభ్రాంతుడయ్యాడు.

మదనుని స్థితి భరించరానిదిగా అయింది. ఈ రాక్షసుడు నిజమే చెప్పాడు. శరీరాన్ని మాంత్రికురాలి నివాసంలో ఉంచి తమ దగ్గరికి ఆత్మను పంపించానని తన తల్లి కూడా చెప్పింది. అటువంటి తల్లిని ఇక తాను చూడలేడు. తనకోసం అమె మనోనిబ్బరాన్ని కూడగట్టుకుని పడిన బాధలన్నీ జ్ఞాపకం రాగా మదనుడు వివశుడై ఇంద్రియాలు అధీనం తప్పుతూండగా "అమ్మా..." అని గట్టిగా అరిచి మూర్ఛలో మునిగి పోతూ క్రిందపడ్డాడు.

జంబోదరుడు మళ్లీ వికృతంగా నవ్వుతూ మదనుణ్ణి చేతుల్లోకి తీసుకున్నాడు.

రాక్షసుడు మదనుణ్ణి చేతుల్లోకి తీసుకోగానే సూర్యప్రతాపుడి మెదడులో ఒక్కసారిగా ఆలోచనలు చెలరేగాయి.

ఈ రాక్షసుడు కాలంధర అనే మాంత్రికురాలి అనుచరుడు కావటంలో సందేహం లేదు. అది తనకు స్పష్టంగా తెలిసిన విషయమే! తమకు



విరోధి స్థానంలో ఉన్న మదనుడి మీద పగ తీర్చుకోవాలని వాళ్ళు ప్రయత్నించటం సరిగ్గానే ఉంది.

అయితే, ఈ వార్త చెప్పటానికే ఇక్కడికి వచ్చినట్లు, అది చెబుతూ మదనుణ్ణి విపరీతంగా వేదనకు గురి చేసి నిరుత్సాహ పరుస్తూ ఈ రాక్షసుడు ఎందుకంత ఉపోద్ఘాతం చెప్పాడు. తల్లికి ఏర్పడిన దుస్థితికి తట్టుకోలేక మదనుడు, మూర్ఛలో మునిగిపోయాడు. ఇప్పుడు రాక్షసుడు మదనుణ్ణి సమీపించి, ఎక్కడికో తీసుకొని పోవటానికి సిద్ధమయ్యాడు.

అంటే, మామూలు స్థితిలో ఉండే మదనుణ్ణి ఎదుర్కొని అతణ్ణి పట్టి తీసుకుపోవటానికి శక్తిచాలని ఈ రాక్షసుడు కట్టుకథ చెప్పి, మదనుణ్ణి, నిస్తేజ పరిచి తన కార్యం సాధించటానికి ప్రయత్నించాడని ఎందుకనుకోకూడదు?

మహా ప్రతిభావంతురాలైన ప్రభావతీదేవి శత్రుస్థావరంలో అంత అజాగ్రత్తగా ఎప్పుడూ ఉండదు. పరిస్థితులనూ, పరిసరాలనూ, వెయ్యి కళ్లతో గమనించి, ఎప్పటికప్పుడు ఎలా నడుచుకోవాలో తెలిసిన ఇంగిత జ్ఞానంగల మహా సంపన్నురాలామె.

అటువంటి దివ్యమూర్తిణికి క్షుద్రశక్తుల వల్ల ఆపద కలుగటమా? శరీరం నశించి ఆత్మ గాలిలో కలిసిపోవటమా? ఇదంతా ఒట్టి అబద్ధం, రాక్షస మాయ!

ఆ విధంగా ఊహించగానే సూర్యప్రతాపుడు ఒక్క క్షణం వ్యర్థం చెయ్యలేదు. జరాలున ఒరనుంచి కత్తిదూసి ఎవ్వరితో ఏమీ మాట్లాడకుండా రాక్షసుడి దగ్గరికి పరుగెత్తాడు.

వెంటనే వీరసింహుడూ, బలరామ్, జనార్ధనపురం యువకులూ, ఉద్వేగంతో ప్రతాపుడి వెంబడి పరుగెత్తారు.

అప్పటికే ఆ రాక్షసుడు కళ్ళుమూసుకుని మాయమయ్యేందుకు మంత్రాన్ని తనలో ఆవహింపజేసుకుంటున్నాడు.

(ఇంకావుంది)





## 11

[జరిగిన కథ : ముసుగు మనుషుల నాయకుడు పంపిన మనిషితో బయల్దేరి, భయంకరమైన ఆయుధాలతో
జనార్ధనపురంవైపు వస్తున్న వడ్డెపాడు గ్రామస్థులను ఎదుర్కొన్న బలరామ్, అతని అనుచరులకు అండగా
వీరసింహుడు కత్తిదూసి నిలబడతాడు. అదే సమయం సూర్యప్రతాపుడూ, మదనుడూ కూడా అక్కడికి
చేరుకుంటారు. అందరూ కలిసి, వడ్డెపాడు గ్రామస్తు లందర్నీ కొద్దిసేపట్లోనే హతమారుస్తారు. తరువాత
వీరసింహునితో సూర్యప్రతాపుడు, మదనుడి పరిచయం కాగా, ఆడబోయిన తీర్థం ఎదురైనట్లు, వీరసింహు
నితోబాటు జనార్ధనపురం యువకులూ సంతోషిస్తారు. ఆ సమయంలో ఓ కర్కశ కంఠస్వరం వికృతాట్ట
హాసాలతో వారికి వినిపిస్తుంది. అదేదో రాక్షస చేష్టలని భావించిన సూర్యప్రతాపుడు, మదనుడొక్కడే ఆ
రాక్షసునితో పోరాడగల సమర్థుడని, మిగతావారిని అక్కడి నుండి తప్పుకోమంటాడు. రాక్షసుడితో తలపడ్డానికి
సిద్ధమైన మదనుడు, తన తల్లి గురించి రాక్షసుడన్న మాటలు విని, వివశుడై మూర్ఛతో క్రిందపడిపోతాడు.
ఆ రాక్షసుడు మదనుణ్ణి తన చేతులమీదికి ఎత్తుకోబోతుండగా, హఠాత్తుగా కత్తిదూసి, రాక్షసుడి మీదకు
వెళ్ళిన సూర్యప్రతాపుణ్ణి, జనార్ధనపురం యువకులూ అనుసరిస్తారు. అంతలో రాక్షసుడు అక్కడి నుంచి
— ఇక చదవండి]
మాయమవడానికి మంత్రాన్ని ఆవహింపజేసుకుంటున్నాడు.

కత్తి దూసి రాక్షసుడి దగ్గరికి పరుగెత్తుకుంటూ వచ్చిన సూర్యప్రతాపుడు వెనకా ముందూ చూడకుండా అతడి భుజమ్మీదికి లంఘించాడు. వెంటనే వీరసింహుడు కూడా మరో భుజమ్మీదికి దూకాడు.

ప్రతాపుడు బలరామ్‌ని వుద్దేశించి "మిత్రమా! నువ్వు స్పృహ తప్పిన మదనుణ్ణి తీసుకుని కాస్త ప్రక్కకు తప్పుకో" అని చెబుతూనే చేతిలోని కత్తితో రాక్షసుడి భుజమ్మీది క్రింది భాగం కేసి కొట్టాడు.

వీరసింహుడు కూడా తన కరవాలంతో రాక్షసుడి రెండో భుజం క్రింద బలంగా కొట్టాడు.

బలరామ్ క్షణం కూడా వ్యర్థం చెయ్యకుండా మదనుణ్ణి విసురుగా తన చేతుల్లోకి తీసుకుని ప్రక్కకు పరుగెత్తాడు. తక్కిన జనార్దనపురం యువకులు తమ చేతులలోని సాము కర్రలతో

కిరణ్ కుమారి

82



రాక్షసుడి పిక్కల మీద ఇష్టం వచ్చినట్లు బాదటం ప్రారంభించారు.

శత్రువులు ఒక్కసారిగా తన శరీరాన్ని కత్తులతో, కర్రలతో కొడుతూ బాధ పెట్టగా రాక్షసుడి ఏకాగ్రత చెదిరిపోయింది. మంత్రం పూర్తిగా జపించటానికి విఘ్నం ఏర్పడి, కళ్లనుండి నిప్పులు రాలుస్తూ పెడబొబ్బలు పెట్టాడు.

వెంటనే కుడికాలిని అటూ ఇటూ విసిరి జనార్దనపుర యువకులను ఎడా పెడా తన్నుతూ, వాళ్లను చెల్లాచెదురు చేశాడు. ఆ తర్వాత రెండు చేతులనూ పైకి సాచి వీరసింహుణ్ణి, సూర్య ప్రతాపుణ్ణి పట్టుకుని క్రిందికి విసిరాడు. వాళ్లు కలిగించిన గాయాలనుండి కొద్దిగా రక్తం స్రవించసాగింది.

రాక్షసుడు మిడిగ్రుడ్లు మిలమిలలాడుతూండగా "ఒరే మానవులూ! నా అరుపులు వినగానే గుండెలు పగిలి చచ్చే మీరటరా నన్ను ఎదిరించేది. మిమ్మల్ని నంజుకు తిని, ఆ మదనుణ్ణి మా ఏలికసాని దగ్గరికి ఎత్తుకు పోతాను. చూడండి" అన్నాడు.

అలా హెచ్చరించి జంబోదరుడు తన దేహాన్ని పెంచటం ప్రారంభించాడు. ఆ రాక్షసుడు శరీరాన్ని విపరీతంగా పెంచితే, తాము వాడి దృష్టిలో ఏ దోమలుగానో, చీమలుగానో అనుతామని భావించిన సూర్యప్రతాపుడు "వీరసింహా! మదనుడు మొదట చెప్పినట్లు వీణ్ణి ఎదుర్కోవటం వల్ల మన అపాయానికి గురి అవుతామే తప్ప మరో ప్రయోజనం ఉండబోదు. తన దివ్య శక్తులతో రాక్షసుడి మాయలను క్షుద్రశక్తులను ఎదుర్కోవటం మదనునికి ఓ లెక్క కాదు. కాబట్టి ఎలాగైనా మదనునికి స్పృహ రప్పించుదాం పద. తల్లికి ఏర్పడినట్లు ఈ రాక్షసుడు కల్పించి చెప్పిన విపత్తు వినటం వల్ల అతడు విహ్వాలుడయ్యాడు. అది తొలగిస్తే మదనుడు పూర్వం లాగా అవుతాడు. పదండి మదనుని దగ్గరికి" అని రాక్షసుడి దగ్గర ఉండవద్దని జనార్దనపురం యువకుల్ని కూడా హెచ్చరించి మదనుడి దగ్గరికి పరుగెత్తాడు. వీరసింహుడు కూడా సూర్యప్రతాపుడి వెంబడి మదనుడి దగ్గరికి చేరుకున్నాడు. యువకులు కూడా మదనుని దగ్గరికి వచ్చారు. రాక్షసుడు తన పాటికి తాను పెరిగిపోతూ అప్పటికే ఓ పెద్ద తాటి చెట్టంత అయ్యాడు.



బలరామ్ మదనుణ్ణి బాటకు కాస్త ఎడంగా ఓ పచ్చిక మీద పడుకోబెట్టి, ఏం చెయ్యటానికీ తోచని స్థితిలో ఉన్నాడు. సూర్యప్రతాపుడు, వీరసింహుడు, యువకులు రాక్షసుణ్ణి ఏమీ చెయ్యలేక అక్కడికి పరుగెత్తుకు రావటంతో "సూర్యప్రతాప యువరాజా! మనం ఇక్కణ్ణుంచి మదనుల వారిని ఎత్తుకుని మా గ్రామానికి వెళదాం పదండి. పెరిగినంత దూరం పెరిగి, ఆ తర్వాత మన కోసం వెతికి, కనిపించక పోవటంతో వాడే వెళ్లిపోతాడు" అన్నాడు.

సూర్యప్రతాపుడు "ఆపదలో దిక్కు తోచక వెళ్లినంత మాత్రాన రాక్షసుడు మనలను తెలుసు కోలేడా? ఎక్కడో యోజనాల దూరంలో ఉన్నవాడు ఇక్కడ మదనుని వునికి పనికట్టి ఎలా వచ్చాడంటావ్? ముందు మదనుణ్ణి స్పృహలోకి రప్పిస్తే, వీడి భరతం అతడే పడతాడు. లేకపోతే రాక్షసుడు అందర్నీ నల్లుల్ని నలిపినట్లు నలిపి చంపుతాడు" అన్నాడు.

ఆ తర్వాత అందరూ కలిసి మదనుడికి స్పృహ తెప్పించే ప్రయత్నాలు చెయటంలో మునిగిపోయారు. మదనుడు అలాగే పచ్చిక మీద పడుకుని ఉండిపోయాడు.

సూర్యప్రతాపుడు మదనుడి గుండెమీద చెయ్యివేసి రాస్తూ, అతడి కుడిచెవి దగ్గర నోరు పెట్టి "మదనా! అమ్మకే ప్రమాదమూ లేదు. అమ్మ క్షేమంగా ఉన్నది... అమ్మకే ప్రమాదమూ లేదు. అమ్మ క్షేమంగా ఉన్నది..." అని ఏకరువు పెట్టసాగాడు.

వీరసింహుడు కూడా ఎడంచెవిలో "తమ్ముడూ! అమ్మను గురించి భయపడవద్దు. రాక్షసుడు చెప్పిందంతా అబద్ధం" అంటూ అవే మాటలను మాటిమాటికీ ఉచ్చరించసాగాడు.

సూర్యప్రతాపుడు, వీరసింహుడు, అదే పనిగా అంటూన్న ఆ మాటలు తారక మంత్రాల్లా పని చేశాయి.

కొద్ది సేపటికి మదనుడు అటూ ఇటూ కదిలాడు. వీరసింహుడు, సూర్యప్రతాపుడూ, తాము అంటూన్న మాటలను మరింత గట్టిగా అనటం ప్రారంభించారు.

చెవులకు అమృతపు ఊటల్లా వినిపించే ఆ మాటలకు మదనుడు ఉత్తేజితుడౌతూ లేచి కూర్చున్నాడు.

అతడు పూర్తిగా ఈ లోకంలోకి వచ్చాడని, బాహ్యేంద్రియాలు చక్కగా పని చేస్తున్నాయనీ, తెలుసుకున్నారు అందరూ.

మదనుడు సూర్యప్రతాపుణ్ణి చూస్తూ "ప్రతాపా! మీరంటూన్నది నిజమేనా? అమ్మకేం కీడు జరగ లేదా?" అన్నాడు.

సూర్య ప్రతాపుడు ఉత్సాహంతో "లేదు. నిన్ను మభ్య పెట్టి తనతో తీసికెళ్లటానికి రాక్షసుడు పన్నిన పన్నాగం అది. యోగవిద్యా పూర్ణురాలైన అమ్మకు ఆ ముక్కిడి మాంత్రిక బృందం వల్ల ఏ ఆపదా కలుగదని విశ్వసించు. అదిగో - రాక్షసుడి తిరోగమన మంత్రం మావల్ల తాత్కాలికంగా భగ్నం కావటంతో బలప్రదర్శన చెయ్యటానికి శరీరాన్ని ఎలా పెంచుతున్నాడో చూడు. ఇప్పట్లో నన్నూ, మీ అన్నయ్యనూ, మన మిత్రులను ఆ రాక్షసుడికి ఆహారం కాకుండా కాపాడ గలిగిన సమర్థుడివి నువ్వే!" అన్నాడు.

వీరసింహుడు కూడా మదనుణ్ణి మరింత ఉత్తేజితుణ్ణి చెయ్యాలన్న తలంపుతో "అవును తమ్ముడూ! వెంటనే నీ దివ్య విద్యా ప్రభావంతో ఆ రాక్షసుడిని ఎదుర్కో" అన్నాడు.

మరుక్షణం మదనుడు పరమోత్సాహంతో దిగ్గున లేచి నిల్చుని ముందుకు పొరజూశాడు.

అప్పటికి రాక్షసుడు ఓ చిన్న కొండతిప్పలా తన ఆకారాన్ని పెంచి ఉన్నాడు.

మదనుడు కూడా అడుగులు ముందుకు వేస్తూ, ఒక్కసారిగా తన శరీరాన్ని రాక్షసుడి శరీరంతో సమానంగా పెంచాడు.

బలరామ్ సంతోషంతో తల పైకెత్తి "అబ్బా! ఎంత పెద్ద మదనులవారో? ఇప్పటికి ప్రాణాలు





కుదిటపడ్డాయి. ఆ దుష్ట రాక్షసుడు కొద్ది సేప టిలో పీనుగు కావటం ఖాయం'' అన్నాడు.

వీరసింహుడు, సూర్యప్రతాపుడు, యువకులు కూడా తలలు పైకెత్తి మదనుని వేపే ఆనందంతో-చూడసాగారు.

తనతో సమానంగా పెరిగి మీదికి వస్తున్న మదనుణ్ణి హుంకరిస్తూ రాక్షసుడు మార్కొన్నాడు. తన కుడి చేతిని పిడికిలి బిగించి విసురుగా మదనుడి తలకేసి కొట్టబోయాడు.

మదనుడు నేర్పుగా తలను ప్రక్కకు త్రిప్పి, రాక్షసుడి చేతిని తన కుడి చేత్తో ఒడిసి పట్టు కున్నాడు. ఎడం చేతిని సాపు చేసి రాక్షసుడి వీపు మీద గట్టిగా చరిచాడు.

ఆ దెబ్బకు రాక్షసుడు బాధతో మూలిగాడు. మదనుడు రాక్షసుడి కుడి చేతిని వదలకుండా మరింత గట్టిగా బిగిస్తూ మెలి త్రిప్పాడు.

ఆ చేతిని మెలిక పెడుతూనే - ఎడం చేత్తో రాక్షసుడి వీపునా, ముఖం మీదా, ఎడా పెడా మదనుడు అదే పనిగా వాయించటం మొదలు పెట్టాడు.

రాక్షసుడు దెబ్బల బాధకు తాళలేక గట్టిగా ఆక్రందన చేస్తూనే, శరీరంలోని బలాన్నంతా కూడదీసుకుని, మదనుని చేతి పట్టునుంచి తప్పించుకున్నాడు. మరుక్షణం చివాలున వెను తిరిగి మదనుడు ఊహించని విధంగా ముందుకు దూకి పొట్టేలులా ఢీకొన్నాడు. ఆ ఢీ కొట్టుకు మదనుడు నిలద్రొక్కుకోలేక దబ్బున ఎల్లకిలా పడ్డాడు.

అలా పడిన మదనుడి మీదికి జంబోదర రాక్షసుడు విసురుగా లంఘించాడు. ఆ పరిస్థితిని ముందే ఊహించిన మదనుడు చటుక్కున ప్రక్కకు తప్పుకుంటూ నాలుగైదు దొర్లులు దొర్లాడు. వెంటనే లేచి నిల్చుని, అప్పుడే పైకి లేవ బోతూన్న రాక్షసుడి మీద విరుచుకు పడ్డాడు.

రాక్షసుడు పైకి లేవకుండా పాదివి పట్టుకుని, ముఖం మీద పిడికిటితో పొడుస్తూ, కొద్ది సేపటికి వాడి ముఖాన్ని మదనుడు నజ్జు నజ్జు చేశాడు.

ఇక మదనుడి చేతిలో తనకు మృత్యువు తప్పదని భావించిన రాక్షసుడు అలా దెబ్బలు తింటూనే, తిరోగమన మంత్రాన్ని పఠించి అక్క ణ్ణుంచి మాయమయ్యాడు.

మదనుడు లేచి తన ఆకారాన్ని తగ్గించు

...ంటూ వీరసింహాదుల వేపు నడిచాడు.

వీరసింహుడు సంతోషంతో మదనుణ్ణి కౌగ లించుకుని "తమ్ముడూ! ఇక మనకీ రాక్షసుడి బెడద తప్పిపోయినట్లేనా?" అన్నాడు.

మదనుడు నవ్వి "వీడి బెడద తాత్కాలికంగా తప్పినా, మళ్లీ ఎక్కడో ఒక చోట తప్పదన్నయ్యా! ఇంకో రాక్షసుడు, మరో రాక్షసుడు, ఇలా మనకు అవద కలిగించటానికి తాంత్రికురాలి పంపున వస్తూనే ఉంటారు. మునులకు, యోగులకు, దివ్యదృష్టి ఉన్నట్లు వాళ్లకు మాయా దర్పణాలూ, దుర్భిణీలూ ఉంటాయి. వాటి సహాయంతో జాగ్రత్త వహించి, ఆ అడ్డంకిలను తొలగించుకోవాలని ప్రయత్నిస్తూంటారు. ఇప్పుడు మనం వాళ్లకు ఆటంకంగా ఉన్నాం కదా?" అన్నాడు.

సూర్యప్రతాపుడు "వాళ్లు లోకంలోని మంచికి ఆటంకం. మనం వాళ్లకి ఆటంకం. ఇప్పుడిప్పుడె మొదలైన ఈ పోరాటం ఎప్పుడు ముగుస్తుందో, ఏ పరిణామానికి దారి తీస్తుందో చెప్పలేం గానీ, ఇక్కణ్ణుంచి పదండి" అన్నాడు.

వీరసింహుడు మదనుడి కౌగిలి విడిచిపెట్టి "అవును తమ్ముడూ! సూర్యప్రతాపుడు చెప్పింది సత్యం. మనం పరిస్థితిని ఎంతో జాగ్రత్తగా మదింపు వేసుకుంటూ, అనుక్షణం ఏమరుపాటు లేకుండా మనలుకోవాలి విశాలపురికి వెళ్లి, స్థిమితంగా కర్తవ్యాన్ని గురించి ఆలోచించుకుందాం పదండి" అన్నాడు.

బలరామ్ బాటమీద అడ్డ దిడ్డంగా పడిన శవాలకేసి చూస్తూ "వీరసింహ యువరాజా! మనం కేవలం నిమిత్తమాత్రులమే! వీళ్లంతా ఏమనుకుని ఇక్కడికొచ్చారు; ఇప్పుడేమయ్యారు?



మీకు నేను చెప్పవలసినవాణ్ణి కాదు. ధైర్యంగా గడ్డు పరిస్థితిని ఎదుర్కోవటమే మనం చెయ్యగలిగింది'' అన్నాడు.

ఆ తర్వాత వాళ్లంతా అక్కణ్ణుంచి బయలుదేరి జనార్ధనపురం వేపుగా సాగిపోయారు.

మదనుని చేత చావుదెబ్బలు తిన్న జంబోధరుడు కాలంధర దగ్గరికి వెళ్లి జరిగిందంతా చెప్పాడు. ఆ సమయంలో మాయామయి కూడా అక్కడే ఉన్నది.

జంబోదరుడు చెప్పిందంతా విని కాలంధర ఆలోచనలో పడిపోయింది. మాయామయి జంబోదరుణ్ణి చూస్తూ ''హుఁ, ఎందుకూ, చెట్టంతవున్నావు; కొండంత పెరుగుతావు. బుద్ధి బలం శూన్యం. యుక్తి ప్రదర్శించి పని చక్కబెట్టుకు రావాలి గాని పోట్లాట పెట్టుకుంటే ఇలాగే తగలబడుతుంది'' అన్నది.

జంబోదరుడు ''ఏం? మదనుడు మతిస్థిమితం తప్పిపోయేట్లు చెయ్యటానికి అతడి తల్లిని గురించి అబద్ధం చెప్పలేదా? ఆ మానవులిద్దరు అది అబద్ధమని అతడి చెవుల దగ్గర ఊదడం వల్ల నా పథకం బెడిసి మదనుడు మామూలు స్థితికి వచ్చాడు. లేకపోతే, ఈ పాటికి ఆ అపస్మారక పరిస్థితిలోనే అతణ్ణి ఎత్తుకుని వచ్చి ఉండక వాడిని'' అన్నాడు.

మాయామయి ''ఛీ! బెడిసిపోయే పథకం కూడా ఒక పథకమేనా? నేను చూడు, సువర్ణపురి అడవిలో మనోహరి అనే రాకూమారిని, గుణసాగర అనే మంత్రి కుమారిని ఎలా నమ్మించి మన యజమానురాలి దగ్గరికి తీసుకువచ్చానో?'' అన్నది.

ఆ విధంగా ఒకరిమీద ఒకరు నెపం పెట్టుకుంటూ పోట్లాడుకుంటున్న మాయామయిని, జంబోదరుణ్ణి, తీవ్రంగా చూస్తూ ''ఉష్! మీరిద్దరు ఇక్కణ్ణుంచి వెళ్లిపోండి. పిలిచినప్పుడు రండి'' అన్న కాలాంధర, ఆ ఇద్దరూ వెళ్లిపోగానే తన అరలో అటూ ఇటూ పచార్లు చేస్తూ తీవ్రమైన ఆలోచనలో మునిగిపోయింది. (ఇంకావుంది)





12

[జరిగిన కథ: జంబోదరుడనే రాక్షసుడు మదనుని తల్లి గురించి చెప్పిన మాయమాటల వల్ల, స్పృహ తప్పి క్రింద పడిపోయిన మదనుణ్ణి తన చేతుల్లోకి ఎత్తుకుని వెళ్ళిపోవాలనుకున్న రాక్షసుని ప్రయత్నాన్ని, వీరసింహుడూ, సూర్యప్రతాపుడూ, జనార్దనపురం యువకులూ కలిసి భగ్నంచేసి, మదనుణ్ణి రాక్షసుడికి దూరంగా తీసుకెళ్ళి అతనికి స్పృహ వచ్చేలా చేస్తారు. మదనునికి స్పృహ రాగానే వీరసింహుడూ, సూర్యప్రతాపుడూ మదనునితో రాక్షసుడి మాయమాటలు నమ్మవద్దనీ, అతని తల్లికి ఏ ప్రమాదమూ లేదని చెప్పి, రాక్షసుణ్ణి ఎదుర్కోమని చెబుతారు. అంతలో రాక్షసుడు పర్వతాకారంలో పెరిగియుంటాడు. మదనుడూ తన శరీరాన్ని రాక్షసుడికి సమానంగా పెంచి, అతనితో పోరాడి, చావుదెబ్బలు కొట్టి, చిత్తుచేస్తాడు. రాక్షసుడు ఆ దెబ్బలకు తట్టుకోలేక అక్కణ్ణించి పారిపోతాడు. తర్వాత మదనుడు తన శరీరాన్ని యధారూపానికి తగ్గించి అందరితో కలిసాక, వారందరూ జనార్దనపురం వైపు వెళ్ళతారు. మదనునితో చావుదెబ్బలు తిన్న రాక్షసుడు కాలంధర దగ్గరికి వెళ్ళి జరిగిందంతా చెబుతాడు. అప్పుడు అక్కడున్న మాయామయీ, జంబోదరుడూ ఒకరొకరు నిందించుకుంటారు. కాలంధర కోపంతో ఆ ఇద్దరినీ బయటికి వెళ్ళమని గద్దించి, తను తీవ్రమైన ఆలోచనలో మునిగిపోయింది. —ఇక చదవండి]

పద్దెనిమిది సంవత్సరాల క్రిందట విశాలపురి చక్రవర్తియైన ధర్మపాల ప్రభువును నయవంచనతో అన్యాయంగా కత్తులతో పొడిచి కోట కందకంలో పడేసిన తర్వాత సామంతులైన చండవర్మ, వక్రకేతుడు, దుర్జయుడు, ఉగ్రసేనుడు, ఆ రాజ్యాన్ని పంచుకుని ఇంతకాలం హాయిగా గడిపారు.

అయితే, ధర్మపాలుని బంధువైన వీరసింహుడు కొలది రోజుల క్రిందట హఠాత్తుగా సైన్యాన్ని తరలించుకుని విశాలపురికి వచ్చి, యుద్ధంలో చండవర్మను ఓడించి తరిమివేసిన తర్వాత వాళ్ల గుండెల్లో ఫిరంగులు మ్రోగసాగాయి.

చండవర్మ తన నగరం చేరుకోగానే మిత్రులను ముగ్గురినీ తన దగ్గరికి పిలిపించుకుని సమాలోచనలు జరిపాడు. ఆ సమాలోచనల ఫలితంగానే తన అనుచరుల్లో ఎరికల్లాంటి వాళ్లను ఎన్నిక చేసి, కర్తవ్యం బోధించి విశాలపురికి పంపించాడు.

కిరణ్ కుమారి



వాళ్లు ముసుగు మనుషుల్లా వచ్చి, కొంత తతంగం నడిపి, భంగపడ్డారు.

బాటమీద వీరసింహునివల్ల, మదనుడివల్ల, సూర్యప్రతాపుడివల్ల, జనార్దనపురం యువకుల వల్ల, దెబ్బలు తిన్నవాళ్లు అందరూ మరణించ లేదు. ఒకడు కొనవూపిరితో వుండి, వీరసింహుడు వెళ్లిపోయిన కొద్ది సేపటికి లేచి నిలువగలిగే పరిస్థితికి వచ్చాడు. నెమ్మదిగా ఓ గుర్రం దగ్గరికి చేరుకుని, గాయాలతో నిండి పూచిన మోదుగు చెట్టులా వున్న శరీరాన్ని మెల్లిగా గుర్రం మీద చేరవేసి ఎలాగో చండవర్మ దగ్గరికి చేరుకున్నాడు.

చండవర్మాది దుష్టరాజులతో జరిగిందంతా చెప్పి ఆ అనుచరుడు ప్రాణాలు విడిచాడు.

అంతా విన్నాక ఉగ్రసేనుడు "అట్టే చూస్తే మనకి మంచి రోజులు దూరమై, చెడ్డ రోజులు దగ్గర పడుతున్నట్లున్నాయి. ఒకరి కొకరు కావలిసిన వాళ్లంతా ఎక్కడెక్కడినుంచో వచ్చి కలుసుకోవట మేమిటి, వందల కొలది వున్న మన వాళ్లను చంపడమేమిటి? మాంత్రికురాలు పంపిన రాక్షసుణ్ణి చితగ్గొట్టి పారద్రోలడమేమిటి? తల్చుకుంటేనే ఒడలు జలదరిస్తున్నాయి" అన్నాడు.

వక్రకేతుడు విచార ముఖం పెట్టి, "అంతే కాదు. ధర్మపాలుని కొడుకే ఆ మదనుడట. అతడి తల్లి అంతఃపురంలో మన బారినుంచి కొడుకుతో బాటు తప్పించుకుని పోవటమే గాక, ఇంతకాలం ఎక్కడో ఉండి, అతణ్ణి ప్రయోజకుణ్ణి చేసి మనమీదికి పంపిందన్నమాట. మనం అప్పుడే మరింత శ్రద్ధగా ఆ తల్లీ కొడుకులను వెదికించి తుదముట్టించివుంటే ఇప్పుడిన్ని అవస్థలు ఉండేవి కావు" అన్నాడు.

చండవర్మ వాళ్ల మాటలు వింటూనె అటు ఇటూ పచార్లు చేయసాగాడు.

దుర్జయుడు తన ఎదురుగా ఉన్న మిత్ర రాజులిద్దరినీ చూస్తూ, "మనం విశాలపురి సామ్రాజ్యాన్ని ఆక్రమించుకున్న తర్వాత - ధర్మ పాలుని బంధువులైన కొందరు రాజులు తిరగ బడతారేమో అనుకున్నాం. అయితే, బలవంతుల మైన మనం వాళ్లను కూడా చంపి, ఆ రాజ్యాలను కూడా లాక్కుంటామేమోనని భావించి, ఆ విషయం తమకు పట్టనట్లు నటించారు. మన సార్వభౌమత్వాన్ని అంగీకరిస్తూ, సామంత రాజులుగా ఉండిపోయారు. ఇప్పుడు తమ కుమారులు

ఎదిగి చేతి కందిరావటంతో మనమీదికి వాళ్లను పంపుతున్నారు'' అన్నాడు.

కొంత సేపటికి చండవర్మ ఆలోచనల నుంచి తేరుకుని 'మిత్రులారా! గతం విడిచిపెట్టి కర్తవ్యం ఆలోచించండి'' అన్నాడు.

ఉగ్రసేనుడు విసుక్కుంటూ, ''ఆలోచించటానికేమున్నది వల్లకాడు రేపోమాపో బలవంతులైన తన బంధువులందరిని సమకూర్చుకొని మహా బలవంతుడైన మదనుడు మన రాజ్యాలమీద పడతాడు. ఈ చచ్చినవాడు చెప్పినట్లు వాడు కొన్ని దివ్యశక్తులను కూడా పొందివున్నాడు. అప్పుడు ఆక్రమించుకున్న విశాలపురి సామ్రాజ్యంతో బాటు మన రాజ్యాలను కూడా ధర్మపాలుని కుమారునికి అప్పజెప్పి పెళ్లాం పిల్లలతో మనం అడవుల్లోకి పారిపోవలసిందే! అప్పుడు వాళ్లకి పట్టిన గతి ఇప్పుడు మనకు పట్టనున్నది'' అన్నాడు.

దుర్జయుడు అతడి మాటలకు విసుక్కుంటూ, ''ఛీ-ఛీ- నీ నోటంబట ఎప్పుడూ అపశకునాలు తప్ప మంచి మాటలు రావుకదా?. ఇలాంటి సమయాల్లోనే ధైర్యంతో వ్యవహరించాలి!'' అన్నాడు.

చండవర్మ కూడా అతడి మాటలను బలపరుస్తూ, ''అవును. ఇప్పుడు మనం ఒకరి కొకరం పిరికి మందు పోసుకోకూడదు. ప్రస్తుతం మన రాజ్యాలను కాపాడుకునే ప్రయత్నాలు చెయ్యటమా, లేక కాలంధర మాంత్రికురాలి దగ్గరికి వెళ్లి మన బాధలు చెప్పుకోవటమా? ఈ రెండు మార్గాలూ తప్ప ఎంత ఆలోచించినా నాకేమీ తోచటం లేదు'' అన్నాడు.





వక్రకేతుడు "చండవర్మా ఇప్పట్లో మనం మనరాజ్యాలను కాపాడుకోవటం శక్తికి మించిన పని అని నాక్కూడా అర్థమవుతున్నది. కాలంధర చాలా కాలంనుంచి చేసే క్షుద్ర పూజలకూ, ఉపాసనలకూ, మనం ఎంతగానో తోడ్పడ్డాం. ఆ మాంత్రికురాలి దగ్గర ఎంతో మంది రాక్షసులూ, మంత్రగత్తెలూ ఉన్నారు. మన శత్రువులను నిర్మూలించే ప్రక్రియలు చెయ్యగల శక్తి ఆమెకే ఉన్నది. వెంటనే ఆ మాంత్రికురాలి కోటకు వెళ్లి మనగోడు వెళ్లగ్రక్కుదాం పదండి. ఇంతకు మించిన ఆలోచన లేదు" అన్నాడు.

తక్కిన ఇద్దరూ చండర్మతో అలాగే చెప్పారు. చండవర్మ తల ఊగించాడు.

ఆ తర్వాత ఆ దుష్టులు నల్గురూ హుటా

92

హుటిగా ప్రయాణమై, మాంత్రిక కోటకు వె[ళ్లి] కాలంధరను సందర్శించారు.

కాలంధర వాళ్ల మాటలు ఓపిగ్గా విన్న[ది] నల్గురిని చూస్తూ "మీరు చెప్పింది నిజమే, శత్రువులను ఎదిరించే పరిస్థితిలో మీరు లేరు ఒక్క నెల రోజులు ఓపిక పట్టండి. ఈలో[గా] నేను మా గురువుగారైన కాలభైరవ మాంత్రికు[ల] వారిని కలుసుకుని మీ విషయం చెబుతా[ను] వారు ప్రస్తుతం పాతాళ లోకంలో ఒక దీక్ష[ను] పూనివున్నారు. అది పూర్తి కావటానికి నా బో[ధ] శిష్యురాండ్రను, శిష్యులను సాయం అడిగా[రు] మేము కూడా ఇప్పుడే మాకు వారు అప్పజెప్పి[న] పనుల్లో నిమగ్నమై ఉన్నాము. ఈలోగా శత్రువు[ల] బెడద వచ్చి పడింది. మీ విరోధులు మా[కు] కూడా అడ్డు తగులుతూ చికాకు కలిగిస్తున్నారు అన్నది.

చండర్మ కాలంధరతో, "నెల రోజులు ఓపి[క] పట్టమని మీరు తేలికగా చెప్పారు. అక్క[డ] మాకు దినగండం నూరేళ్లాయుష్షుగా ఉన్న[ది] తల్లీ!" అన్నాడు.

కాలంధర అతడితో, "అయితే, ఈ నెలరోజుల[ూ] మీరు నా కోటలోనే సురక్షితంగా ఉండండి అన్నది.

ఉగ్రసేనుడు వినయంతో, "అమ్మా! అక్క[డ] మా భార్యాబిడ్డల గతేమవుతుందోనని మా[కు] భయంగా ఉన్నది" అన్నాడు.

కాలంధర చిరునవ్వుతో, "ఒక్కసారి[గా] మీరెంతటి భీరువులై పోయారయ్యా! పోనీ - మీ

నల్గురి భార్యాపిల్లలను, అవ్వలను నా అనుచరుల ద్వారా ఇక్కడికే రప్పిస్తాను. పాతాళ మాంత్రిక గురువుల దీక్ష ముగిసిన తర్వాత - శత్రువులందరినీ మట్టు బెట్టటం వారికి చిటికె వేసినంత సులభం. ఆ పని ముగిశాక మీరు మళ్లీ మీ వాళ్లతో కలిసి వెళ్లి చీకూచింతా లేకుండా మీ రాజ్యాలను పాలించుకోవచ్చు'' అన్నది.

ఆ మాటలకు సంతృప్తి చెంది నల్గురూ కాలంధర కాళ్లమీద పడి, ''అయితే మా వాళ్లను వెంటనే మా దగ్గరికి చేర్పించండి తల్లీ! ఇప్పటికే ఏ ఉపద్రవం ముంచుకొచ్చిందోనని ఆందోళనగా ఉంది'' అన్నారు.

కాలంధర, ''ఇదిగో - ఈ పనిని ఇప్పుడే మాయామయికి అప్పజెబుతాను'' అన్నది.

అదృశ్యంగా ఉండి వాళ్ల మాటలన్నీ వింటూన్న ప్రభావతీ మహారాణి, తన కుమారుడు తన బంధువర్గానికి చెందిన యువకులందరినీ కలుసుకుంటూ, వాళ్ల ప్రేమాభిమానాలను పొందుతూన్నందుకూ, చండవర్మాదులు భీతి చెందుతూన్నందుకూ, సంతృప్తి పడి, అక్కణ్ణుంచి మాంత్రికురాలు నిర్బంధంలో ఉంచిన యువతుల దగ్గరికి వెళ్లింది.

వాళ్లకు కాపలాగా ఉన్న కాలంధర అనుచరులను, అనుచరురాండ్రను, తన దివ్యశక్తితో స్పృహ తప్పించి, తాను యోగినీ రూపంతో బయల్పడింది.

ఆమెను గుర్తించగానే మనోహరి, గుణసాగరి, పరుగెత్తుకుంటూ వెళ్లి నమస్కరించారు. తాము ఆమెను చూసిన విధమూ, ఆ తర్వాత జరిగిన విశేషమూ వివరించారు.

ప్రభావతీదేవి ఆ ఇద్దరినీ కౌగలించుకుని,



ఆనందాశ్చర్యాలతో తనను చూస్తున్న విజయపురి యువతులందరినీ చిరునవ్వుతో వీక్షిస్తూ, సునందాదేవి దగ్గరికి నడిచింది సునందాదేవి నమస్కరించగానే ఆ యువతిని కూడా పొదివి పట్టుకుని ఆనంద బాష్పాలు రాల్చింది. తన చిన్నతనంలో బంధుత్వరీత్యా తల్లిదండ్రులతో కలిసి అప్పుడప్పుడు విశాలపురికి వెళ్లి ఆమెను చూసినందున - అంతకాలం గడిచినా, యోగినీ రూపంలో ఉండినా, ప్రభావతీ దేవిని గుర్తు పట్టిన సునందాదేవి "చిన్నమ్మా! ఎంతకాలానికి మిమ్మలను చూడగలిగాను. ఇక్కడ మనోహరీ, తక్కిన యువతులూ, నేను దిక్కు మాలిన వాళ్లలా పడివున్నాం. మేమిక్కడికి ఎలా వచ్చామో మాకే తెలియదు. ఈ అరలో నిర్బంగించ బడిన తర్వాతే మాకు మేమెవరమో తెలుస్తున్నది. అయినా - ఇక్కడికెందుకు తీసుకు రాబడ్డామో బోధపడక, తప్పించుకు పోయే మార్గం కానక అల్లాడిపోతున్నాం" అన్నది కన్నీటితో.

ప్రభావతి, "సునందా! మిమ్మల్ని ఇక్కడికి తీసుకు వచ్చిన మాంత్రికురాలి పేరు కాలంధర. అది సన్యాసి వేషంలో మీ నగరానికి వచ్చి వశీకరణ లేపనంతో మీ అందరి మనస్సులను తన వేపు త్రిప్పుకున్నది. అందువల్ల గాఢనిద్రలో వున్న మీరంతా దాని పిలుపు వినగానే, ఇళ్ల లోంచి బైటికి వచ్చారు. అది తన అనుచరుడైన జంబోదర రాక్షసుడి ద్వారా మిమ్మలందరినీ ఇక్కడికి రప్పించింది. మనోహరిని, గుణసాగరిని మాత్రం తన అనుచరురాలైన మాయామయి అనే మంత్రగత్తె ద్వారా పిలిపించుకున్నది. అయితే, మీరిక్కడికి చేరిన కొద్ది సేపటికే నేను పరిస్థితిని



పసికట్టి అదృశ్యరూపంలో వచ్చాను. నా రాకవల్ల మీ అందరికీ మాంత్రికురాలి వశీకరణ ప్రభావం తొలగి మిమ్మల్ని మీరు తెలుసుకోవటం జరిగింది. ప్రస్తుతం - చిరంజీవి సూర్యప్రతాప సింహుడు, నీ సోదరులైన వీరసింహుడు, మదనుడు, ఒక చోటనే ఉన్నారు'' అని అంతకు ముందు జరిగిన విశేషాలన్నిటినీ పూసగ్రుచ్చినట్లు వివరించింది.

అంతా వినగానే అక్కడి యువతులంతా ఆశ్చర్యంతో ఆమెకేసి చూడసాగారు. ఐదేళ్ల వయస్సులో మరణించిన కుమారుణ్ణి బ్రతికించుకోవటం కోసం ఆమె పడిన పాట్లు, చివరకు విజయం సాధించటం, మొదలైనవన్నీ తెలుసుకున్న తర్వాత వారంతా ప్రభావతీ మహారాణిని వేనోళ్ల పొగిడారు.

అనంతరం - ప్రభావతి "సునందా! ఈ తాంత్రిక కోటకు అధికారిణియైన కాలంధర గురువు కాలభైరవుడనే మాంత్రికుడు పాతాళలోకంలో ఒక భయంకరమైన హోమాన్ని తలపెట్టి ఉన్నాడు. ఎప్పటికప్పుడు కొత్తకొత్త మంత్ర తంత్రాలను, మాయలను, వశం చేసుకునే కాలంధర కూడా ఇప్పుడు తనకున్న క్షుద్రశక్తులతో తృప్తి చెందక, తాను కూడా ఓ ఉపాసనను ప్రారంభించ నున్నది. కాలభైరవుడికి - పాతాళ హోమం ప్రారంభించే నాటికి ఉత్తమ సౌశీల్యవతులు, భర్తలతో కలిసి కాపురం చేస్తూన్నవాళ్లూ, సంతానం ఇంకా కలుగని వాళ్లు అయిన - నీ బోటి సుక్షత్రియ కుటుంబానికి చెందిన యువతులు వందమంది కావాలి. అలాగే సంతానం లేని మగనాండ్రైన ఇతర జాతుల యువతులు లక్షమంది కావాలి. మాంత్రికుడు



హోమం ప్రారంభించటానికి ఇంకో మాసం గడువున్నది. ఈలోగా నీబోటి వాళ్లను, ఈ యువతుల వంటి వారిని, గుంపులు గుంపులుగా తన అనుచరులతో, అనుచరురాండ్రతో కాలంధర తెప్పించి ఇక్కడ ఉంచుతుంది. మీకేం భయం లేదు. ధైర్యంగా ఉండండి.

మరో మాట - మన మనోహరి, గుణసాగరి వంటి కన్యలు కూడా కాలంధరకు వెయ్యి మంది కావాలి. కాలంధర పనిలో పనిగా తన ఉపాసన కూడా పూర్తి చెయ్యటానికి ఉన్నత వంశాలకు చెందిన కన్యలను ఇక్కడికే రప్పిస్తుంది. నేను ఈ ప్రాంతంలోనే ఉంటూ ఓ మహాసిద్ధిని పొందటానికి దీక్ష వహిస్తాను. మిమ్మల్ని అప్పుడప్పుడు కలుసుకునే అవకాశం ఉండదు. నెలరోజుల దాకా మీకే ప్రమాదమూ రాదు. అప్పటి సంగతి చూసుకుందాం'' అని చెప్పి అంతర్హితురాలైంది.

మనోహరి సునందాదేవిని కౌగలించుకుని, ''వదినా! నీ తమ్ముడు, నా అన్నలు జాడలు తీసి ఇక్కడికి రాగలరు. నా మేనత్తయైన ప్రభావతి మహారాణి అద్భుత శక్తులు కలిగిన యోగ స్వరూపిణి! ఆమె మనల్ని చూస్తూ చూస్తూ ఏ మంత్ర కూటమిపాలు చేయదు. అత్త చెప్పినట్లు మనమంతా ధైర్యంగా ఉందాం. ఈ లోగా వేల కొలది మంది మనలాంటి వాళ్లే ఇక్కడ చేరుతారు. వాళ్లకు కూడా ఉత్సాహం కలిగిస్తూ మంచిరోజు కోసం ఎదురు చూద్దాం'' అన్నది.

అప్పటికి ప్రభావతి దివ్యశక్తి కాలంధర అనుచరుల మీదినుంచి తొలగిపోగానే, అందరూ లేచి నిల్చున్నారు.

అప్పుడు ఒక అనుచరురాలు తన చేతిలోని కొరడాలను సరిచేసుకుంటూ చిరచిరా మనోహరి దగ్గరికి వచ్చి, ''ఏయ్; నీకిక్కడేం పని? నువ్వూ నీ స్నేహితురాలూ ఉండవలసింది వీళ్ల దగ్గర కాదు - అటు పక్కకి పదండి'' అని మనోహరిని, గుణసాగరిని చేతులు పట్టుకొని అక్కణ్ణుంచి లాక్కెళ్ళింది.

(ఇంకావుంది)





[జరిగిన కథ: పద్దెనిమిది సంవత్సరాల క్రిందట విశాలపురి చక్రవర్తియైన ధర్మపాలుణ్ణి, మోసంతో చంపి, కోట కందకంలో పడేసిన శత్రు సామంతులైన చండవర్మ, వక్రకేతుడు, దుర్జయుడు, ఉగ్రసేనుడు ఈ నలుగురూ విశాలపురి సామ్రాజ్యాన్ని పంచుకుని సుఖంగా ఉండేవారు. అప్పట్లో ధర్మపాలుని బంధువులైన కొందరు రాజులు ఈ విషయం తమకేమీ సంబంధం లేనట్లు నటించారు. కొంతకాలం గడిచాక వారి కుమారులు పెద్దవారై అందరూ ఒక చోట చేరుకుని, శత్రు సామంతులను ఎదుర్కోటానికి సిద్ధమౌతున్నారన్న విషయం తెలిసి, ఆ దుష్ట చతుష్టయం భయపడి, మాంత్రికురాలు కాలంధరను కలుసుకుని, తమ అవస్థలు చెప్పుకుంటారు. కాలంధర వారిని తన కోటలోనే ఒక నెల ఉండమని, మాయామయితో ఈ సామంతుల భార్యాబిడ్డలను, ఆప్తులను తన కోటకు చేర్చమంటుంది. అక్కడే అదృశ్యంగా ఉండి, వీరి మాటలు విన్న రాణీ ప్రభావతిదేవి, తన కుమారుడు తన బంధువర్గంతో కలిసి ఉన్నాడని తెలిసి తృప్తి చెందుతుంది. ఆ తర్వాత మాంత్రికురాలి నిర్బంధంలో ఉన్న యువతుల్ని కలుసుకుని, తన వృత్తాంతం, తమ బంధువులందరూ ఒక చోట చేరిన విషయం తెలిసి, నెల రోజుల దాకా మీకేమీ భయం లేదని చెప్పి, అదృశ్యమౌతుంది. ఇంతలో కాలంధర అనుచరురాలు, మనోహరినీ, గుణసాగరినీ చేతులు పట్టుకుని అక్కణ్ణించి లాక్కుని వెడుతుంది. —ఇక చదవండి]

విశాలపురి రాజమందిరంలో - వీరసింహుడు, మదనుడు, సూర్యప్రతాపుడు, ఒక ఏకాంత ప్రదేశంలో కూర్చుని ఉన్నారు. అప్పటి వరకు జరిగిన సంఘటనలన్నిటినీ ఆ రాజపుత్రులు ఓమారు సింహావలోకనం చేసుకుని, తర్వాత చెయ్యవలసిన పనుల గురించి ఆలోచించుకుంటున్నారు.

ఆ సమయంలో ఓ పరిచారిక పరుగెత్తుకుంటూ అక్కడికి వచ్చి వీరసింహునికి నమస్కరించి "యువరాజా! విజయపురి నుంచి ప్రభాకరసింహులవారు సువర్ణపురి రాజైన శత్రుంజయ భూపతితో కలిసి వచ్చారు. యువరాణిగారు వారిని ఉచితాసీనులను చేసి, సంగ్రహంగా జరిగిందంతో చెప్పారు. వారు మిమ్మలను చూడటానికి వేగిరపడుతున్నారు" అని చెప్పింది.

ఆ మాటలు వినగానే ముగ్గురూ గబగబా పై అంతస్థు నుంచి క్రిందికి వచ్చారు. త్రి మూర్తుల్లా

కిరణ్‌కుమారి



దగ్గరి కొచ్చి తమకు నమస్కరించిన వీరసింహుణ్ణి, మదనుణ్ణి, సూర్యప్రతాపుణ్ణి, ఆ రాజులిద్దరూ బిగియార కౌగలించుకుని మురిసిపోయారు.

రాకుమారి-సుగంధమాల అన్నల మధ్యనవున్న ప్రతాపుణ్ణి కన్నుల పండువుగా చూస్తూ మురిసిపోయింది.

శత్రుంజయుడు మదనుణ్ణి పొదివిపట్టుకుని "నాయనా! నా చెల్లెలు అఖండమైన దీక్షతో, ఎన్నో కష్టాలు పడి మానవమాత్రురాలికి సాధ్యంకాని దివ్యశక్తులు సంపాదించి, నిన్ను కన్నుల పండువుగా చూసుకునే అదృష్టాన్ని మా కందరికీ కలిగించింది. భగవంతుడు ఈనాటికి మన మీద కొద్ది కొద్దిగా తన దయామృత వీక్షణాలను ప్రసరింపజేస్తున్నాడు" అన్నాడు.

ప్రభాకరసింహుడు కూడా మదనుణ్ణి ప్రత్యేకంగా కౌగలించుకుని ఆప్యాయంగా శిరసు ముద్దాడాడు.

ఆ తర్వాత వారంతో కష్టసుఖాలు చెప్పుకుంటూ కర్తవ్యం మీదికి దృష్టి సారించారు.

శత్రుంజయుడు ప్రభాకరసింహునితో "బాబూ! నా కోడలు సునంద, నా పుత్రిక మనోహరి, మంత్రి పుత్రి గుణసాగరి ప్రస్తుతం కాలంధర అనే మంత్రగత్తె నివాసంలో నిర్బంధింపబడి వున్నట్లు మనకు విదితమైంది. అయితే, అక్కడ మా చెల్లెలు ప్రభావతీదేవి వుండగా వాళ్లకే ఆపదారాదు. అదీగాక - నెల రోజుల దాకా వాళ్లను గురించి ఎటువంటి ప్రయత్నాలు చెయ్యవద్దనీ, అలా చేస్తే లోకకళ్యాణ దాయకమైన ఒక మహత్కార్యం చెడిపోతుందని కూడా ఆమె మనవాళ్లతో చెప్పింది కదా? ఆమె చెప్పినట్లుగానే ప్రస్తుతం ఆ విషయాన్ని అలావుంచుదాం. ఇప్పుడు - వీరసింహుడు బాంధవ్య ధర్మాన్ని పాటించి, విశాలపురిని విముక్తం చేశాడు. ఎన్నెన్నో రాజ్యాలకు ఆధిపత్యాన్ని వహిస్తూ, ధర్మాత్ముడైన మా బావగారి చల్లని పరిపాలనలో విలసిల్లిన సామ్రాజ్యం పూర్తిగా శత్రువులనుంచి మన ఆధీనంలోకి రావాలి. తండ్రి స్థానంలో మదనునికి చక్రవర్తిత్వాన్ని చేకూర్చినప్పుడే ప్రస్తుత మన కర్తవ్యం పూర్తయి నట్లవుతుంది. ఆ తర్వాత మాంత్రిక శత్రువుల విషయం ఆలోచిద్దాం" అన్నాడు.

ప్రభాకరసింహుడు "అలాగే చిన్నాన్నగారూ!

మీరు చెప్పినట్లే చేద్దాం. ఈ రోజే విజయపురి లోని మా సేనానికి, సువర్ణపురిలోని మీ సేనానికి లేఖలు పంపుదాం. రెండు రాజ్యాల సైన్యాలను వాళ్లు తరలించుకుని వచ్చాక విశాలపురి సైన్యంతో కలిపి దండయాత్ర ప్రారంభించుదాం. ఈలోగా వీరసింహుడు కూడా తన రాజ్యం నుంచి సేనలను రప్పిస్తాడు. మనం ఈ పనులన్నీ పూర్తి చేసుకునే దాకా రాజకార్యాలను మంత్రులు చూసు కుంటూంటారు'' అన్నాడు.

ఆ విధంగా నిశ్చయించుకున్న తర్వాత వాళ్లు తమ తమ పనుల్లో మునిగిపోయారు...ఇలా వుండగా...

...పాతాళహోమం కోసం, తన ఉపాసన కోసం, కావాలిసిన స్త్రీలను పట్టి తీసుకు రావ టానికి కాలంధర తన అనుచరురాండ్రను, అను చరులను, భూమి మీద వుండే రాజ్యాలన్నిటి మీదకు పంపింది. వాళ్ళకు తోడుగా తనకు వశ్యులైన ఎంతో మంది రాక్షసులను కూడా పంపింది.

రకరకాల మాయలూ, మంత్రాలూ, ప్రయో గాలూ, యుక్తులూ, కుయుక్తులూ ప్రదర్శిస్తూ మాంత్రిక బృందాలు రాజ్యాల మీద విరుచుకు పడ్డాయి.

ఫలితంగా ఎంతో మంది అన్నలు చెల్లెండ్రను పోగొట్టుకున్నారు. భర్తలు భార్యలను కోల్పోయారు.

దేశదేశాలలో అరాచకం తాండవించింది. ఆక్రందనలు మిన్నుముట్టాయి. తమ ఆడవాళ్ళు ఏ విధంగా తమ్ము విడిచివెళ్లారో, వాళ్లెక్కడున్నారో తెలియక, మగవాళ్లంతా విలవిలలాడిపోయారు.

సాహసవంతులైన కొందరు రాచయువకులు





తమ వాళ్ల ఆచూకీ తెలుసుకోవటానికి నగరాలు విడిచి బయలుదేరారు.

అటువంటి వాళ్లలో - ప్రసేనపాలుడొకడు! అతడు విదిశాపుర రాకుమారుడు. విజయపురి యువరాజైన సూర్యప్రతాపుడు చదివిన గురుకులంలోనే అతడూ చదివాడు. ఇద్దరూ ఆప్త మిత్రులు. ఒకేదినాన ఇద్దరి చదువులూ పూర్తి కావటంతో గురుదక్షిణలు చెల్లించి, ఒకర్నొకరు స్నేహపూర్వకంగా వీడ్కొని ఎవరి పట్టణాలకు వాళ్లు బయలుదేరారు.

ప్రసేనపాలుడు విదిశా నగరం చేరిన మరునటి రోజు - అతడి చెల్లెలు మందారవల్లి చెలులతో కలిసి ఉద్యానవనంలో విహరిస్తుండగా ఓ రాక్షసుడు వచ్చి ఆమెనెత్తుకుపోయాడు.

చెలికత్తెలు దుఃఖిస్తూ వచ్చి రాజ దంపతులతో ఆ దుర్వార్త చెప్పారు. అంతఃపురమంతా శోకంతో నిండిపోయింది. రాజపుత్రికి కలిగిన దుర్దశకు పౌరులంతా విచారించారు.

అయితే - అదే రాత్రి; పెళ్లయ్, ఇంకా పిల్లలు పుట్టని యువతులు, పెళ్లికాని కన్యలు, వెయ్యి మందికి పైగా తమకు తెలియకుండా అంతర్ధానం కావటంతో వాళ్లను పోగొట్టుకున్న వారంతా రాజ మందిరానికి వచ్చి మహారాజుతో, యువరాజుతో, దుఃఖిస్తూ ఆ సంగతి చెప్పారు.

ప్రసేన యువరాజు తీవ్రంగా ఆలోచించి, తండ్రి అనుమతి పొంది చెల్లెలిని, తన నగర యువతులను, కన్యలను, వెతుకుతూ బయలు దేరాడు. అతడు తనకు తటస్థపడిన పల్లెల్లో, పట్టణాల్లో, విచారిస్తూ, ఎడతెగని ప్రయాణాలు కొనసాగిస్తూ, కొన్ని రోజులకు అడవి ప్రాంతంలోని ఓ శబరగూడెం చేరుకున్నాడు.

అక్కడ అంజనం వేయటంలో ప్రసిద్ధుడైన ఓ కోయవాడిని గురించి విని, అతడి దగ్గరికి వెళ్లి తన చెల్లెలు, తన పట్టణానికి చెందిన యువతులు ఎక్కడున్నారో అంజనంలో చూసి చెప్పమని కోరుతూ, తన మెడలోని ఓ రత్నహారం తీసి ఇచ్చాడు.

కోయవాడు అంజనం వేశాడు. కాలంధర అనే మంత్రగత్తె కోటలో కొన్ని వేలమంది యువతుల మధ్య మందారవల్లి, ప్రసేనుడి నగరానికి చెందిన యువతులు ఉన్నట్లు అంజనంలో తేలింది.

ప్రసేనుడు కోయవాడికి కృతజ్ఞతలు చెప్పి, ఆ మాంత్రికురాలి కోటను గురించి వివరాలు వాకబు చేస్తూ, మరి కొద్ది రోజులకు ఓ పల్లెటూరు చేరాడు. అక్కడ రచ్చసావిడి దగ్గర గుర్రాన్ని నిలువరించి, అరుగు మీద కూర్చున్న వ్యక్తిని పలకరించాడు. అప్పటికి సాయంకాలమైంది ఆ వ్యక్తి తాపీగా చుట్టకాల్చుకుంటూ ఏమిటన్నట్లు ప్రసేనుడి వేపు చూశాడు.

ప్రసేనుడు "అయ్యా! కాలంధర అనే మాంత్రికురాలి కోట ఎక్కడున్నదో మీకు తెలుసా? క్రితం మజిలీలో అడగ్గా ముందు తటస్థపడే వూరిలో అడగమన్నారు'' అన్నాడు.

ఆ వ్యక్తి రెండు దమ్ములు లాగి చుట్ట పీకెను ప్రక్కకు విసిరాడు. అరుగు మీది నుంచి క్రిందికి దిగి తన వెంటరమ్మని సూచిస్తూ, ముందుకుసాగాడు.

ప్రసేనుడు తన గుర్రాన్ని అతడి వెంట నడిపించాడు. ఆ వ్యక్తి ఆ వీధిలోని ఓ పెద్ద ఇంటి దగ్గరికి తీసికెళ్లి, ప్రసేనుణ్ణి గుర్రం దిగమని సంజ్ఞ చేశాడు. ప్రసేనుడు అతడి ప్రవర్తనకు ఆశ్చర్యపోతూ అతడు పిచ్చివాడో, మూగవాడో అయివుంటా డనుకుంటూనే గుర్రంనుండి క్రిందికి దిగాడు.

ఆ గ్రామంలోని మగవాళ్లలో కొందరు అప్పుడే పొలంపనులను పూర్తి చేసి ఇంటికి వస్తున్నట్లు - ఎద్దులతో, నాగళ్లతో వస్తూండటం చూశాడు ప్రసేనుడు. ఆడవాళ్లు ఇళ్ల ముందు నీళ్లు చల్లుకుంటూండడం కనిపించింది.

తనను రచ్చబండ వ్యక్తి తీసికెళ్ళిన ఇంటి యజమాని కూడా ఓ పెద్ద రైతు అని ప్రసేనుడు గ్రహించాడు. ఆ ఇంటి ముందు ఉన్న ఎద్దు,





ప్రక్కన ఉన్న బళ్ళు వ్యవసాయ పరికరాలను బట్టి అతడలా ఊహించాడు.

ప్రసేనుణ్ణి లోపలికి రమ్మని సూచిస్తూ, ఆ వ్యక్తి ఇంట్లోకి వెళ్లాడు. పదహారు సంవత్సరాల వయస్సులో వుండి, బంగారు రంగుతో ప్రకాశిస్తూ, దేవలోకం నుండి విహారార్థం భూలోకానికి వచ్చిన దివ్యకన్యలాంటి అద్భుత అపురూప సౌందర్యవతియైన ఓ యువతి ఆ వ్యక్తిని చూస్తూ "ఏమిటి తాతా? చీకటిపడే దాకా వచ్చే వాడివి కాదు. పెందరాళే వచ్చావేం? పిచ్చాపాటి మాట్లాడ్డానికి ఎవ్వరూ రచ్చబండ దగ్గరికి రాలేదా? అన్నది.

ప్రక్కగా నిలబడి కన్నార్పకుండా ఆ జగదేక సుందరినే చూస్తున్న ప్రసేనుణ్ణి చూపిస్తూ "ఈయనెవరో పరదేశి. కాలంధర కోట గురించి అడిగాడు. అతిథి మర్యాదలు చేసి, వివరాలు చెప్పు" అని మనమరాలిని ఆజ్ఞాపించి అక్కణ్ణుంచి వెళ్లిపోయాడు.

అతడి ప్రవర్తనకు విస్తుపోతూ, అనాగరిక కుటుంబాలుండే ఆ పల్లెలో అంతటి సౌందర్యవతి వుండటానికి విస్మయిస్తూ, ప్రసేనుడు అక్కడే స్థాణువులా నిల్చుండిపోయాడు.

పైగా - తాను అడిగినదానికి జవాబు తెలిసి వుంటే, చెప్పటమో, తెలీకపోతే తెలీదని చెప్పటమో చెయ్యకుండా - ఆ వ్యక్తి ఇంటికి తీసుకొచ్చి, ఈ అందాల బొమ్మకు తనను అప్పజెప్పి, అతిథి మర్యాదలు చేసి కాలంధర కోట వివరాలు చెప్పమని వెళ్ళిపోవడమేమిటా అన్నది ఆలోచించే విషయమైంది.

ఆ యువతి చనువుగా ప్రసేనుడి దగ్గరికి వచ్చి "అలా నిలబడ్డారేమిటి? లోపలకి రండి. వేడినీళ్లు సిద్ధంగా వున్నాయి. స్నానం చేసి దుస్తులు మార్చుకుని కాసేపు విశ్రాంతి తీసుకుందురుగాని" అన్నది.

ప్రసేనుడు "సుందరీ! నేను విశ్రాంతి తీసుకునే స్థితిలో లేను. ఎప్పుడెప్పుడు కాలంధర నివాసానికి వెళ్లాలా అని మనస్సు తొందరపెడుతున్నది. దయచేసి అక్కడికి వెళ్లటానికి మార్గం చెప్పు" అన్నాడు.

ఆ యువతి అందంగా నవ్వింది. ఓరగా అతణ్ణి చూసింది. వయ్యారం ఒలికిస్తూ "ఏం? మీ భార్యగాని, చెల్లెలుగాని, ఆ కాలంధర కోటలో

విశ్కృవడివున్నారా?" అన్నది.

హఠాత్తుగా ఆ పల్లెపడుచు ఆ ప్రశ్నవేసేసరికి ప్రసేనుడు నివ్వెరపోయాడు. అంతలోనే కోలుకుంటూ "నా కింకా వివాహం కాలేదు. నా చెల్లెలిని ఓ రాక్షసుడు ఎత్తుకెళ్లాడు. ఆమెతో బాటు మా వూళ్లోని కొంతమంది యువతులను కూడా ఎవరో మాయచేసి తీసికెళ్లారు. వారంతా కాలంధర అనే మంత్రగత్తె కోటలో బంధింపబడివున్నారని ఆంజనం ద్వారా తెలుసుకొన్నాను. నువ్వు ఇదంతా కొద్ది వ్యత్యాసంతో వూహించగలగటం చాలా ఆశ్చర్యంగా వున్నది" అన్నాడు.

యువతి గలగలనవ్వి "నువ్వు ఆశ్చర్యపడనక్కరలేదు. నాకు చాలా విషయాలు తెలుసు. మీరు ఒక రాజపుత్రులు. మీ స్థాయికి తగినట్లు ఉపచర్యలు చెయ్యటం మా ధర్మం. ముందు మీరు నేను చెప్పినట్లు చెయ్యండి. తర్వాత అన్నీ మీకు అనుకూలంగా జరుగుతాయి" అని చెప్పి లోపలికి వెళ్లిపోయింది.

అతడు ఏం చెయ్యటానికి తోచక, లోపలికి వెళ్లటమా, మానటమా అని తటపటాయిస్తూండగ వయసులో వున్న ఓ పనికత్తె బిరబిరా అతడి దగ్గరకి వచ్చి, ఎంతో చనువున్నదానిలో చెయ్యి పట్టుకుని అతణ్ణి తీసుకుని పెరట్లోకి వెళ్లింది.

దిగ్భ్రాంతుడై నిల్చున్న అతడి అంగరఖా విప్పింది ఆ యువతి. మరో దుకూలం ఊడదీయటానికి ఆమె ప్రయత్నిస్తూండగా ఆమె చేతిని తొలగిస్తూ "నీకు పుణ్యం వుంటుంది గాని, దయచేసి ఇక్కణ్ణుంచి వెళ్లిపో. స్నానం చేసివస్తాను" అన్నాడు.

ఆ పనికత్తె నవ్వుతూ "వీపు తోమవద్దా?"



అన్నది ప్రసేనుడు చిరాకు పడుతూ "వీపూ, ముఖమూ తోమటానికి నేనేం చిన్న పిల్లాడిని కాను. ముందిక్కణ్ణుంచి నడు" అని గద్దించాడు.

ఆ వయ్యారి వగలుపోతూ "అబ్బో - అయ్యగారికి రుసరుసలు ఎక్కువే - ఆడగాలి ఎప్పుడూ తగిలినట్లు లేదే?" అంటూనే అక్కణ్ణించి వెళ్ళిపోయింది.

ఆ ఇంట్లో అడుగుపెట్టినప్పటి నుంచి తనకు ఒక్క మగవాడు కూడా కనిపించనందుకూ, పనిపిల్ల అలా అసభ్యంగా ప్రవర్తించినందుకూ, కాస్త జంకుతూనే ప్రసేనుడు వేడి నీటితో స్నానం చేశాడు. అత్తరు కలిపిన ఆ నీటితో స్నానం చెయ్యటం వల్ల అతడి శరీరం సువాసనలను వెదజల్లసాగింది.

తన దుస్తుల కోసం చెయ్యిసాచగా, అతడికి కొత్తదుస్తులు కనిపించాయి. రంగులు మారాయే గాని, అవి అచ్చం తన దుస్తుల్లాగే వున్నాయి.

అంతలోనే "అయ్యగారూ! అక్కడ ఉంచిన కొత్త బట్టలు వేసుకుని ఇంట్లోకి రండి" అన్న పనిమనిషి పిలుపు వినిపించగానే ప్రసేనుడు పెరట్లోంచి లోపలికి వచ్చాడు.

పనిమనిషి ఎదురు వచ్చి "అదిగో - ఆ గదిలోకి వెళ్ళండి. అమ్మాయిగారు కొద్ది సేపట్లో వచ్చి, మీరు కోరిన వివరాలు చెబుతారు" అని చెప్పి వెళ్ళిపోయింది.

ప్రసేనుడు పనిమనిషి చూపించిన గదిలోకి అడుగు పెట్టగానే - చిత్త విభ్రాంతికి లోనయ్యాడు. గోడలకు రకరకాల అందాల బొమ్మల నగ్నచిత్రాలు వున్నాయి. గది మధ్యలో మల్లెలు పరచిన పందిరి మంచం వున్నది. గది నలు మూలల నుంచి సుగంధ పరిమళాలు వెదజల్లుతూ, సన్నని పొగలు గదంతా వ్యాపిస్తున్నాయి...అక్కడి నుండి బైటికి రావాలని అనుకుంటూ అతడు వెనుతిరగగానే తలుపులు మూసుకున్నాయి! ప్రసేనుడెంత ప్రయత్నించినా ఆ మూసుకున్న తలుపులు తెరుచుకోలేదు. (ఇంకావుంది)



105 G.R.G

# 14

[జరిగిన కథ: విశాలపురి రాజమందిరంలో వీరసింహుడు, మదనుడు, సూర్యప్రతాపుడు ముగ్గురూ కలిసి కూర్చుని ఇంతవరకూ జరిగిన సంఘటనలను సింహావలోకనం చేసుకుంటూండగా, విజయపురి రాజు ప్రభాకరసింహులవారు, సువర్ణపురి రాజు శత్రుంజయ భూపతితో కలిసి, విశాలపురికి రాగా, ముగ్గురు రాజ పుత్రులూ వారికి నమస్కరించి ఆశిస్సులు పొందుతారు. తరువాత వారందరూ సమావేశమై తమ కర్తవ్యం మీదికి దృష్టి మళ్ళించి, ధర్మాత్ముడైన ధర్మపాల ప్రభువు పాలనలో విలసిల్లిన సామ్రాజ్యం పూర్తిగా శత్రువుల భారినుంచి, తమ అధీనంలోనికి రావాలనీ, అందుకు విజయపురి, సువర్ణపురి సైన్యాలను ఇక్కడికి రప్పించి, విశాలపురి సైన్యంతో కలిపి, ఆ దుష్ట రాజులపై దండయాత్ర సాగించాలని నిర్ణయిస్తారు... అక్కడ మాంత్రికురాలు కాలంధర పాతాళహోమం కోసం కావలసిన స్త్రీలను, యువతులనూ పట్టి తీసుకురావలసిందిగా తన అనుచరురాండ్రను, రాక్షసులను అన్ని దేశాలకూ పంపింది. ఫలితంగా, ఎంతోమంది తమ భార్యలను, అన్నలు చెల్లెండ్రనూ కోల్పోయారు. అలాంటి వారిలో విదిశాపుర రాకుమారుడు ప్రసేనపాలుడనే యువకుడు, తన రాజ్యంలో మాయమైన యువతులనూ, తన చెల్లెలినీ వెతుక్కుంటూ, ఎడతెగని ప్రయాణం చేసి, ఒక అడవిలోని కోయవాడు వేసిన అంజనం వల్ల, మంత్రగత్తె కాలంధర కోటలో ఆ యువతులందరూ బంధితులైవున్నట్టు తెలుసుకుని, కాలంధర కోటను వెదుక్కుంటూ వెడుతుండగా, దారిలో ఒక పల్లెటూరు తటస్థపడుతుంది. అక్కడ ఒక వ్యక్తి ప్రసేనపాలుణ్ణి ఒక అందమైన అమ్మాయికి ఒప్పజెప్పి, ఇతనికి కాలంధర వివరాలు చెప్పమంటాడు. ప్రసేనుడికి ఆ వయ్యారి ఇంట్లో జరిగిన విచిత్ర సదుపాయాలనంతరం, అతడు ప్రవేశించిన గది తలుపులు హఠాత్తుగా మూసుకుంటాయి.
—ఇక చదవండి]

శృంగార వాతావరణంతో నిండిన ఆ గదిలో విచిత్ర పరిస్థితిలో నిర్బంధితుడైన ప్రసేనుడు, తలుపులు తెరవటానికి చాలా సేపు ప్రయత్నించి, విఫలుడయ్యాడు. తాను ఏదో మోసానికి గురి అవుతున్నాడేమో నన్న అనుమానం లీలగా అతడి మెదడులో మెదలింది.

రోటిలో తలదూర్చి రోకటి పోటుకు వెరవటం వెర్రితన మన్నట్లుగా - తాను మొదటే ఆలోచించక అనుమానాస్పదమైన ఇంటిలో అడుగుపెట్టాడు. ఇక్కడి కొచ్చినప్పటినుంచీ అన్నీ ఆలోచనలను రేకెత్తించే సంఘటనలే జరిగాయి.

శరీరం ఎడతెగని ప్రయాణం వల్ల బాగా అలసినందున ఏది జరగవలసి వుంటే అది

కిరణ్ కుమారి



జరుగుతుందని మంచం మీద పడుకున్నాడు. ఆహ్లాదకరమైన ఆ వాతావరణంలో, మల్లెలు పరచిన మెత్తటి పరుపు మీద అతడికి కొద్ది సేపటికే గాఢమైన నిద్రపట్టింది.

అలా ప్రసేనుడు ఎంతసేపు నిద్రించాడోగానీ, శరీరం మీద సున్నితంగా ఏదో ప్రాకుతున్నట్లు కాగా, కళ్ళు తెరిచాడు.

మంచం ప్రక్కన జగన్మోహినిలా అలంక రించుకుని వున్న - తాను మొదట చూసిన పదహారేళ్ల యువతి నిల్చుని, తన చేత్తో మెల్లగా తడుముతున్నది.

ప్రసేనుడు లేచి కూర్చున్నాడు. ఆ యువతి అంతకు ముందే సిద్ధం చేసి తెచ్చిన ఫలహారాలతో నిండిన పళ్లెరాన్ని అతడి ముందు వుంచుతూ "బాగా ఆకలి వేస్తూంటుంది. తినండి" అన్నది. ప్రసేనుడు వాటివేపు అనుమానంగా చూస్తూ, మౌనం వహించాడు.

యువతి నవ్వుతూ "అలా అనుమానంగా చూస్తారేం? ఏదైనా కలిపివుంటానని భయమా?" అన్నది.

అన్నిటికీ తెగించివున్నందున ప్రసేనుడు ఏమైతేనేం లెమ్మని, ఫలహారాలను భుజించడం ప్రారంభించాడు. ఆ యువతి వింజామరతో విసరసాగింది. పదార్థాలు ఎంతో రుచిగా వున్నందున విపరీతమైన ఆకలితో వున్న ప్రసేనుడు వాటిని పూర్తిగా తిన్నాడు. ప్రక్కనే వున్న చెంబు తీసుకుని, అందులోని నీటితో అతడి చేతిని పళ్లెంలో ఆమే కడిగింది.

తర్వాత వాటిని ప్రక్కన పెట్టి, తాంబూలం ఇవ్వబోయింది. ప్రసేనుడు చిరునవ్వుతో "సుందరీ! నేను పెళ్లికాని వాడినని ఇంతకుముందే చెప్పాను కదా? అవివాహితుడు తాంబూలం వేసుకోకూడదని శాస్త్రం చెబుతున్నది" అన్నాడు.

ఆ యువతి చిద్విలాసంగా నవ్వి "శాస్త్రాలకేం! ఎన్నైనా చెబుతాయి. వాటి ప్రకారం చెయ్యటం సాధ్యమవుతుందా?" అన్నది.

ప్రసేనుడు "సాధ్యమయ్యేట్లు చేసుకోవాలి" అన్నాడు. ఆ యువతి సమ్మోహనం కలిగించే చూపులను అతడి ముఖం మీదకు ప్రసరింపజేస్తూ "రాకుమారా! మనసిచ్చి, సన్నిహితురాలైన కన్యను బ్రహ్మచారి, యువకుడు, అయిన మగసిరి రాయుడు వివాహమాడాలని ఒక శాస్త్రం

చెప్పింది. ఆ శాస్త్రం ప్రకారం మీరిప్పుడు నన్ను వివాహం చేసుకొనగలరా?'' అన్నది.

ఆ యువతి చతురత కలిగిన సంభాషణను సాగించటంలో ఆరితేరినదని తెలుసుకోవటానికి ప్రసేనుడికి ఎంతోసేపు పట్టలేదు.

ఇప్పటికే చాలా కాలం వ్యర్థం చేశాడతను. ఆమెతో తనకు అవసరమైన సమాచారం రాబట్టుకునేందుకు తను కూడా చాతుర్యంగా మాట్లాడితే తప్ప లాభం లేదనుకుంటూ ''తప్పకుండా చేసుకుంటాను, నేను ప్రేమించగలిగినప్పుడు'' అన్నాడు.

ఆమె ''ఇప్పుడు నన్ను ప్రేమించటానికి మీకు ఆటంకమేమున్నది? నేను అందగత్తెను కానా? అన్నది.

ప్రసేనుడు చిరునవ్వుతో ''ఒక రాజపుత్రుడు వివాహం చేసుకునేటప్పుడు కన్యలో అందమొక్కటే చూడడు. ఈ ప్రసక్తి అలా వుంచుదాం, నన్ను ఈ ఇంటికి తీసుకువచ్చిన వ్యక్తి నీతో చెప్పిన ప్రకారం అవసరమైన మేరకు అతిథి మర్యాదలు చేశావు. కాలంధర నివాసం ఎక్కడున్నదో చెప్పటమే ఇక నీకు మిగిలిన ధర్మం. నువ్వు నాకా వివరాలు చెబితే, నేను వెళ్లిన పనిని సాధించగలిగినప్పుడు తిరుగు ప్రయాణంలో తప్పకుండా ఇక్కడికి వచ్చి, నిన్ను నాతో నా రాజ్యానికి తీసుకెళ్లి నా తల్లిదండ్రుల ఆశీస్సులతో వివాహం చేసుకుంటాను. ఇక నువ్వు నన్ను రకరకాల ప్రశ్నలు వెయ్యకుండా కాలంధరను గురించిన వివరాలు చెప్పు'' అన్నాడు.

ఆ యువతి గొప్ప సంతోషంతో అతణ్ణి కౌగిలించుకుంటూ ''మనోహరా! నీ మాటలు నా చెవుల్లో



మంగళ ఘంటికల్లా మ్రోగాయి. భువన మనోహరుడవైన నిన్ను భర్తగా పొందగలుగుతూన్న నేను అదృష్టవంతురాలిని. అయితే, ఒక్క మాట. కాలంధర వివరాలు చెబుతాను గాని, అక్కడికి వెళ్లి ఏం చెయ్యదల్చుకున్నావు?'' అని ప్రశ్నించింది.

ప్రసేనుడు ''అది మాయావిని... మంత్రగత్తె, క్షుద్రమైన ఉపాసనను దేనినో నిర్వర్తింపదలచి నా చెల్లెలిని తన అనుచర రాక్షసుడి ద్వారా తన కోటకు రప్పించుకున్నది. అంతేకాదు, మా నగరానికి చెందిన ఎంతోమంది యువతులను కూడా అపహరించుకుపోయింది. ఆ క్షుద్రురాలి ఉపాసనను భగ్నం చేసి, దానిని ముక్కలు ముక్కలుగా నరికి వెయ్యటానికే వెళుతున్నాను.



నా చెల్లలిలాగే భవిష్యత్తులో ఇక మీదట ఏ కన్య కూడా దాని బారిన పడకుండా ఆ పాపాత్ము రాలి జీవితాన్ని అంతం చెయ్యటానికి వెళు తున్నాను, అర్థమైందా?'' అన్నాడు.

అతడలా అంటున్నప్పుడు ముఖం కోపంతో ఎర్రబడిపోవటం ఆ యువతి గమనించింది.

ఆమె గోముగా అతడి భుజం మీదికి వొరిగి "ప్రాణ ప్రియా! తొలి చూపులోనే నిన్ను వరించాను. నీకేదైనా జరిగితే నేను ప్రాణాలతో వుండలేను. దయచేసి కొంతకాలం నా దగ్గరుండండి. కనీసం ఒక్క నెలరోజులైనా వుండండి. ఆ తర్వాత కాలంధర కోటకు మనమిద్దరం కలిసి వెళదాం. ఈ ఒక్క కోరిక తీర్చండి. ఆ తర్వాత మీరెలా చెబితే అలా చేస్తాను" అని గంధపు చెట్టును పెనవేసుకునే నాగినిలా ప్రసేనుణ్ణి కౌగిలించుకున్నది.

ప్రసేనుడు బలవంతంగా ఆమె కౌగిలి విడిపించు కుంటూ, ప్రక్కకు జరిగాడు.

ఆ యువతి చిరుకోపంతో అతణ్ణి చూస్తూ "నన్ను వివాహం చేసుకుంటానన్నావుగా? అటువంటప్పుడు ప్రేమతో దరిజేరిన నన్ను నిరాకరిస్తావా?'' అన్నది.

ప్రసేనుడు ''నేను చెప్పింది వేరు; నువ్వు అడుగుతున్నది వేరు. నా చెల్లెలు అక్కడ దిక్కూ మొక్కూ లేక కన్నీరు మున్నీరుగా దుఃఖిస్తూంటే, నేనిక్కడ నిన్ను వివాహం చేసుకుని నీతో కులక మంటావా?'' అన్నాడు.

ఆ యువతి మళ్లీ దగ్గరగా జరుగుతూ ''ఒక్క నెల రోజులేగా?'' అన్నది.

ప్రసేనుడు ''ఏం? ఆ నెలరోజులు ఎందుకని అడుగుతున్నావు'' అన్నాడు.

యువతి ''కొత్తగా వివాహం చేసుకుని నెల రోజులు దాంపత్య జీవితం గడిపిన యువకుణ్ణి ఏమీ చెయ్యలేదు. ఆ మాంత్రికురాలికి అటువంటి బలహీనమైన నియమం వున్నది'' అన్నది.

ప్రసేనుడు నవ్వి ''నీ మాటలెంత ముద్దుగా వున్నాయో, అంత బుద్ధి తక్కువ అర్థాన్ని స్ఫురింప జేస్తున్నాయి. ఏ మంత్రగాడు గాని, మంత్రగత్తె గాని, బలీయమైన నియమాన్ని ఏర్పరచుకోవటం విన్నానుగాని బలహీనమైన నియమాన్ని ఎన్నుకోవటం ఇప్పుడే నీ నోటంట వింటున్నాను.'' అన్నాడు.

ఆ యువతి ''అయితే, నీ మాట నీదేనన్న మాట. నా మాట మీద నమ్మకం లేదా?'' అన్నది.

ప్రసేనుడు "సుందరీ! నా మాట మీద నమ్మక



ముంచుకోవటం నాకు అలవాటు. దయచేసి కాలంధర కోటకు దారి తెలిస్తే చెప్పు, లేకపోతే నన్ను వెళ్లనివ్వు. ఒకదానికి మరొకటి లంకె పెట్టి నన్ను విసిగించవద్దు'' అన్నాడు.

వెంటనే మంచం నుండి క్రిందికి దిగి ఆ నవయౌవని ప్రసేనుడి తలను గట్టిగా పట్టుకుని, చటుక్కున అతడి పెదవుల మీద మునిపళ్లతో కొద్దిగా కొరికింది.

అంతే ... శరీరంలోని అణువణువు పరవశించి పోతూ వుండగా, కళ్లు మూతలు పడుతూంటే, ప్రసేనుడు పాన్పు మీదికి ఒరిగిపోయాడు .... అది నిద్రో, అపస్మారకమో, తెలీని స్థితిలో ఆ పాన్పు మీద అతడెంతసేపు వున్నాడో గాని; కళ్లు తెరిచేసరికి ఓ అడవిలోని చెట్టు క్రింద వున్నట్లు తెలుసుకున్నాడు. వెంటనే తత్తరపాటుతో అక్కణ్ణుంచి కదలబోయాడు. కాళ్లు సహకరించక పోవటానికి విస్తుపోతూ క్రిందికి చూసుకుని తలమీద ఒక్కసారిగా వెయ్యి పిడుగులు పడ్డట్లు అదరిపడ్డాడు ప్రసేనపాలుడు!

పాదాలు దగ్గర్నుంచి గొంతుక దాకా శిలా స్వరూపుడై వున్నాడు తను. కంఠంపై నుంచి మాత్రం మామూలుగా వున్నాడు.

అంతలో అతడి రెండు చెవులకు ఇరువేపుల నుంచి కొన్ని పురుష కంఠాలు బిగ్గరగా నవ్వటం వినిపించాయి.

ప్రసేనుడు తలను అటూ ఇటూ త్రిప్పి చూశాడు. అతడికి ఇరువేపులా తనలాగే శిరస్సు తప్ప మిగిలిన శరీరమంతా శిలాకృతిగా వున్న కొంత మంది యువకులు కనిపించారు.

అతడు వాళ్లను జాలిగా చూస్తూ ''అన్నలారా! మనమందరం ఒకే దుస్థితిలో వున్నాం. నన్ను చూసి పరిహసించటం మీకు భావ్యమా?'' అన్నాడు.

వాళ్లలో ప్రసేనుడికి ప్రక్కనే వున్న ఒక యువకుడు "లేదు తమ్ముడూ! మేము నిన్ను పరిహసించటం లేదు. దుష్టురాలైన కాలంధర మాంత్రికురాలను కడతేర్చి, మా చెల్లెంద్రను విడిపించుకుపోవాలని రాజ మందిరాలను విడచిపెట్టి, అష్టకష్టాలు పడి, చివరకు ఇక్కడ ఇలా అయిపోయిన మాతోబాటు నిన్ను కూడా ఇక్కడికి చేర్పించిన దుర్విధి వికారపు చేష్ట మాకు నవ్వు తెప్పించింది. మనలాగే చెల్లెంద్రను పోగొట్టుకున్న అన్నలు ఇంకా ఎంతమంది ఇక్కడికి రావాలో?" అన్నాడు.

ప్రసేను డతనితో "అన్నయ్యా! మీరంతా రాజ పుత్రులై వుంటారని ముఖ వర్చస్సులను బట్టి నేను మొదట్లోనే గ్రహించాను. కానీ, ఇలా శిరో మాత్ర మానవ లక్షణాలతో అందరం ఇక్కడకు చేరటానికి కారణమేమిటో మీకు తెలుసా?" అన్నాడు.

ఆ యువకుడు "ఊహించాము. మా ఊహ వాస్తవమో కాదో తర్వాత నువ్వే చెబుదువు గాని, ముందు నేనడిగే వాటికి సమాధానం చెప్పు తమ్ముడూ!" అన్నాడు.

ప్రసేనుడు "అడగండన్నయ్యా!" అన్నాడు.

"నువ్వు కూడా చెల్లిలిని దూరం చేసుకున్న దురదృష్టవంతుడివేనా?"

"అవును"

"ఆమెను వెతుకుతూ బయలుదేరి ఎక్కడెక్కడో తిరిగి, చివరకు ఓ పల్లెటూరు చేరుకున్నావా?"

"నిజమే"

"అక్కడ రచ్చ చావడి మీద చుట్ట కాలుస్తున్న ఓ వ్యక్తి కనిపించాడా?"

"కనిపించాడు"

"నువ్వు కాలంధర విషయం అడిగావా?"

"అడిగాను"

"వాడు నిన్ను ఓ ఇంటికి తీసుకెళ్లి అందమైన ఓ పిల్లకి నిన్ను అప్పగించాడా?"

"అవును"

"ఆ జాణ నిన్ను స్నానం చేయించి, పడక గదిలో రకరకాల చేష్టలు చేసి నీతో వివరాలు రాబట్టుకోవాలని ప్రయత్నించిందా?"

"కాలంధర కోటకు వెళ్లి అక్కడేం చేస్తావని అడిగింది"



"దానిని చంపుతానని చెప్పి వుంటావు. తర్వాత, పెళ్లి చేసుకొమ్మనీ, నెల రోజులు తనతో గడపమనీ, నిన్ను వొత్తిడి చేసి వుంటుంది. కొత్తగా పెళ్లి చేసుకొని నెల రోజుల పాటు, ఇంకా ఏదేదో చెప్పి, నువ్వు నిరాకరించటంతో, తల గట్టిగ పట్టుకుని తన మునివళ్లతో నీ పెదవుల మీద కొరికింది కదూ?"

"అవునన్నయ్యా! ఇవన్నీ కళ్లారా చూసినట్లు చెబుతున్నారే? మీకెలా తెలుసు?"

అంతసేపు అన్ని ప్రశ్నలు వేసిన రాకుమారుడు జాలిగా ప్రసేనుణ్ణి చూస్తూ "తమ్ముడూ! నీకు ఆ పల్లెటూరిలో జరిగిన అనుభవాలు ఇక్కడున్న మాకందరికీ జరిగాయి. ఆ పల్లెటూరు, రచ్చ చావిడి, చుట్ట కాల్చేవాడు, పెద్ద ఇల్లు, ఆ ఇంట్లో అందగత్తె, అన్నీ ఓ పెద్ద మాయ. తను దేశ దేశాల నుంచి తెప్పించిన రాజపుత్రికల అన్నలు గాని, వారి తండ్రులుగాని, ఊరికే ఉండరనీ, తన జాడలు తీసి దగ్గరకు వచ్చి అపకారం తలపెడతారని ఊహించిన కాలంధర తన అనుచరురాలితో పన్నించిన మాయాజాలం అది" అన్నాడు.

ప్రసేనుడు "అన్నయ్యా! అన్ని చేష్టలు చెయ్యకుండా మొదటే ఆ మాయవిని మనల్ని ఈ పరిస్థితుల్లో ఇక్కడ చేర్పించవచ్చుగా?" అన్నాడు.

ఆ రాజపుత్రుడు తల ఊగిస్తూ "నిజమే. కాని గోటితో పోయేదానికి గొడ్డళ్ల దాకా తేవటం ఎందుకని ఆ కల్పితసుందరి చేత అంత నాటకం ఆడించింది. మనం ఇంద్రియాలను జయించలేని చపల చిత్తులమై వుండి వుంటే, నెల రోజుల దాకా దాని మాయలో పడి అల్లాడుతుండేవాళ్లం. అలా లొంగేవాళ్లం కాదని గ్రహించటం వల్లనే చివరి ప్రయోగంగా ఇలా చేసింది. ఇక మనల్ని ఈ స్థితిలో ఇక్కడి నుంచి, ఏ శక్తులూ, చివరకు ఏ భగవంతుడూ కూడా కాపాడలేడు" అన్నాడు విచారంతో.

— (ఇంకావుంది)





[జరిగిన కథ: శృంగార వాతావరణంతో నిండిన గదిలో బంధితుడైన ప్రసేనపాలుడు, ఏదైనా జరగని
అని మంచంమీద పడుకుని గాఢనిద్రలో మునిగిపోతాడు. మెలుకవ వచ్చేసరికి, తాను మొదట చూసిన
యువతి, తట్టలో ఫలహారాలు తెచ్చి అతనిని తినమంటుంది. అతడు తిన్న తరువాత, ఆ నవయౌవని
నమ్మోహనం కలిగించే చూపులను ప్రసేనుడిపై ప్రసరింపజేసి, తనను పెళ్ళి చేసుకోమంటుంది. ప్రసేనుడు
నన్ను ఇక్కడికి తీసుకుని వచ్చిన వ్యక్తి, కాలంధర నివాసం ఎక్కడున్నదో నాకు తెలుపమని నీకు నన్ను
ఒప్పజెప్పాడు. ఆ ప్రకారం కాలంధర ఉనికి ఎక్కడుందో నీవు చెబితే; నేను వెళ్ళి ఆ కాలంధరను
ముక్కలు ముక్కలుగా నరికేసి తిరిగి వెళ్ళేప్పుడు నిన్ను నా రాజ్యానికి తీసుకెళ్ళి పెళ్ళి చేసుకుంటాను
అంటాడు. వెంటనే ఆ యువతి ప్రసేనుణ్ణి దగ్గరకు లాక్కుని అతని పెదవులపై గట్టిగా కొరికింది.
అంతే .పాన్పు మీద ఒరిగిపోయిన ప్రసేనుడు కళ్ళు తెరిచేసరికి, ఓ అడవిలోని చెట్టు క్రింద, పాదాల
నుంచి గొంతుక దాకా శిలా స్వరూపుడై వున్నాడు. తన ప్రక్కన నవ్వులు వినపడి, ప్రసేనుడు వారిని
పలకరించగా, నీలాగే ఆ నవయౌవని దగ్గర మోసపోయి మేము ఈ స్థితికి వచ్చామని ప్రసేనునితో
చెప్పి, ఈ స్థితిలో ఏ భగవంతుడూ మనల్ని కాపాడలేడు అని అంటారు. — ఇక చదవండి.]

"అధో భువన పాతాళో బలసద్మర సాతలం..." అన్నట్లు భూలోకానికి క్రిందవున్నదే పాతాళ లోకం. అతలం, కుతలం, వితలం, తలాతలం, రసాతలం, మహాతలం, అనే ఆరు లోకాలు పాతాళ లోకానికి అనుబంధాలైన లోకాలు. వామనావతారుడైన శ్రీ మహావిష్ణువునే దాన పాత్రుణ్ణి చేసుకున్న మహా ధర్మాత్ముడు, దాన పరుడు అయిన బల చక్రవర్తి చేత ధర్మం నాలుగు పాదాల మీదా నడిచేట్టు పాలించబడిన పాతాళలోకం ఇప్పుడు దుష్టులు, వంచకులు, దురాశాపరులు అయిన రాక్షసుల చేత పాలించ బడుతున్నది.

కాలనేమి అనే రాక్షస రాజు పాలనలో వున్న పాతాళ లోకంలోని - ఒక ప్రదేశంలో కాలభైరవుడనే ఒక్కన మాంత్రికుడు నివాసముంటున్నాడు.

తాను అప్పటికే ఎన్నెన్నో క్షుద్ర మాంత్రిక

కిరణ్ కుమారి



విద్యలు పొందినప్పటికీ, వాటితో తృప్తి పడక కాలనేమి - సర్వార్థ సాధనియైన ప్రపంచ వశీకరణ మహాశక్తిని పొందగోరి, ''పాతాళ హోమం'' అనే ఓ భయంకర యాగాన్ని తలపెట్టాడు.

మామూలుగా మునులు చేసే హోమాలకు వేదమంత్రాలైతే, కాలనేమి ప్రభృతులైన మాంత్రికులు చేసే హోమాలకు క్షుద్ర మంత్రాలు అవసరం. వాళ్లు హోమ గుండంలో అగ్నులు వెలగటానికి సమిధలు వాడితే, వీళ్లు మనుషుల ఎముకలు ఉపయోగిస్తారు. మునులు నేతిధారలను ఆజ్యంగా అగ్ని గుండంలో ధారపోస్తే, మాంత్రికులు మనుషుల రక్తాన్ని ధారపోస్తారు.

ఈ విధంగా యోగసాధనలకు, క్షుద్ర సాధనలకు, వాటిని సాధించుకునే ప్రయత్నంలోనే ఎంతో వ్యత్యాసం ఉంటుంది. సాధనల ద్వారా అయా ఫలితాలను పొందిన వాళ్లలో ఒక వర్గం - ప్రపంచాలలో శాంతిని, ధర్మాన్ని నీతిని, న్యాయాన్ని నెలకొల్పడానికి తమ శక్తులను వినియోగిస్తూండగా, రెండవ వర్గం - ప్రపంచాలలో అశాంతిని, అధర్మాన్ని అవినీతిని, అన్యాయాన్ని, పెంపొందించటానికి ఉపయోగిస్తూండటం, యుగయుగాలనుంచి ఒక ఆనవాయితీగానే వుండిపోయింది. మునులు చేసే పనుల్లో నిస్వార్థం ఇమిడి ఉండగా, రాక్షసులు చేసే పనుల్లో స్వార్థం మూర్తీభవించి ఉండేది. ఆ స్వార్థంలో ఎన్నో క్రూర గుణాలు గూడు కట్టుకుని ఉండేవి. అందుకే, అలాంటివాళ్లు తమ స్వార్థం కోసం ప్రయత్నాలు చేసినప్పుడల్లా ప్రపంచంలో అరాచకం, అన్యాయం, అధర్మం, మొదలైన వినాశకర కార్యాలు తాండవిస్తూండేవి.

కరడు గట్టిన క్రౌర్యగుణాలు నేవళం దేరిన కాలనేమి మాంత్రిక రాక్షసుడు తలపెట్టిన పాతాళ హోమం, రామాయణ కాలంలో రావణ పుత్రుడైన ఇంద్రజిత్తు చేసిన 'నికుంభిల' హోమం వంటిదే! కాలభైరవుడు చేయబోయే పాతాళ హోమానికి ప్రారంభ దశలో వందమంది సుక్షత్రియ వివాహిత, సంతానరహిత యువతులను బలి ఇవ్వాలి. వివాహితులై, సంతాన వతులు కాని లక్ష మంది ఇతర జాతుల యువతుల రక్తంతో హోమాగ్నికి ఆజ్యం పొయ్యాలి. అలా హోమం జరుగుతూన్నంతకాలం కొన్ని వందలమంది మాంత్రి కులు, మంత్రగత్తెలు, క్షుద్ర మంత్రాలను చదువుతూ హోమాగ్ని గుండం చుట్టూ ఉండాలి.

ప్రారంభించబడిన పక్షం రోజులదాకా అలా ఏకధాటిగా పాతాళ హోమం కొనసాగిస్తే, కాల భైరవుడికి ప్రపంచ వశీకరణ సిద్ధి లభిస్తుంది.

ప్రపంచ వశీకరణ సిద్ధి లభించాక దేవ లోకాలన్నిటిని అధీనం చేస్తానని పాతాళ రాజైన కాలనేమికి ఆశ కలిగించి, కాల భైరవుడు తనకు కావలసిన సదుపాయాలన్నిటినీ అతడి చేత చేయించుకున్నాడు.

కాల భైరవుడు కోరినట్లు కాలనేమి పాతాళంలోని ఒక మారుమూల ప్రాంతంలోని పాత దుర్గాన్నొకదానిని అతడికి ఇచ్చాడు. హోమం పూర్తయ్యేదాకా అవసరమైన పనులు చెయ్యటానికి వందల కొలదిగా రాక్షసులను ఆ మాంత్రికుడి అధీనంలో ఉంచాడు. పాతాళ హోమం పూర్తయ్యేదాకా ఏ లోక వాసులనూ తన లోకానికి రానివ్వకుండా కట్టడి చేశాడు.

కాలభైరవుడు కాలనేమి వల్ల పొందిన దుర్భేద్యమైన ఆ కోటలో నివాసం ఏర్పరచుకున్న తర్వాతనే, కాలంధరను తన దగ్గరికి పిలిపించుకుని, ప్రలోభ పెట్టి, హోమం చెయ్యటంలో తనకు తోడ్పడమని కోరాడు. కాలంధర కొన్ని షరతులతో అంగీకరించింది. అప్పట్నుంచి భూలోకంలోని తన తాంత్రిక కోటక యువతులను రప్పించటం ప్రారంభించింది.

అయితే, ఈ మధ్య కాలంలో అప్పుడప్పుడు ఏర్పడబోయే అవాంతరాలను గురించి కాల భైరవుడితో చర్చించటానికి తరుచుగా పాతాళ లోకానికి రాకపోకలను కొనసాగిస్తూ వచ్చింది.

ఒకనాడు - కాలభైరవుడు తన అనుచరులతో పరివేష్టించబడి, తనకు కావలసిన మంత్ర శాస్త్రాలకి





సంబంధించిన తాళ పత్రాలను తిరగేస్తూండగా, కాలంధర వచ్చింది. ఆ మంత్రగత్తె వెంట చండ వర్మాది దుష్టరాజులు కూడా ఉన్నారు. కాల భైరవుడు కాలంధరను సాదరంగా ఆహ్వానిస్తూనే, చండవర్మాదులను వింతగా చూశాడు.

కాలంధర "మహానాయకా! ఈ నలుగురు రాజులు భూలోకంలో మన కార్య కలాపాలకు ఎన్నో విధాలుగా తోడ్పడుతున్నారు. ఇప్పుడు మన శత్రువులైన కొందరు యువకులు వీళ్లకి కష్టాలు కలిగించారు. ఆపద కాలంలో మన శరణం కోరిన వీళ్లను మీ దగ్గరికి తీసుకు వచ్చాను" అని కాలభైరవుడికి చెప్పింది.

కాలంధరతో బాటు వాళ్లను కూడా తన ఎదుట కూర్చోమని సంజ్ఞ చేస్తూనే, కాలభైరవుడు తన చేతిలోని తాళ పత్రాలను ప్రక్కన ఉంచాడు.

ఆ తర్వాత అనుచరులను అక్కడినుండి పంపివేసి "కాలంధరా! నా ప్రియ శిష్యురాలివైన నీ మీద అపారమైన నమ్మకం ఉంచి బలికి అవసరమైన యువతులను పట్టి తెప్పించే భారం నీమీద ఉంచాను. మొన్న వచ్చినప్పుడు సగం మందికి పైగా లభ్యమైనట్లు చెప్పావు. మనం ఇంకో పదిరోజుల్లో పాతాళ హోమం ప్రారంభించవలసి ఉన్నది" అన్నాడు కాలభైరవుడు.

కాలంధర వినయంతో "ఇప్పటికి ముప్పాతిక వంతు దాకా సిద్ధమయ్యారు గురునాయకా! నాలుగైదు రోజుల్లో మిగతా వారిని సేకరించి, అందరినీ మీ కోటకు చేర్పిస్తాను" అన్నది.

కాలభైరవుడు తల ఊచి "సంతోషం. మరి, ఈ రాజుల మాటేమిటి?" అని అడిగాడు.

కాలంధర చండవర్మాదులు తనతో చెప్పిన విధంగా వాళ్ల కేర్పడిన కష్టాలను విడమర్చి చెప్పింది.

కాల భైరవుడు "ప్రస్తుతం శత్రువుల బారిన పడకుండా వీళ్లనూ, వీళ్ల కుటుంబాలనూ, నీ దగ్గరే ఉంచుకుని చాలా మంచి పని చేశావమ్మా! అయితే - ధర్మపాలుడి ధర్మపత్నియైన ప్రభావతి ప్రస్తుతం ఎక్కడున్నట్లు? ఆమె యోగవిద్యలు నేర్చిందనీ, సిద్ధులు పొందిందనీ, ఎప్పటికైనా మనకు ప్రబల విరోధినిగా రూపొంద వచ్చనీ చెప్పావు కదా? ఆమె ఉనికి తెలియలేదా?" అన్నాడు.

కాలంధర "లేదు నాయకా! మన మాయామయ

తన మాయాజాలం ఉపయోగించి, ప్రభావతి కోసం అన్ని చోట్లా వెతికింది. కొంతకాలం క్రిందట నా నివాసానికి వచ్చి భయపెట్టి వెళ్లి పోయిందని ఇంతకు ముందు చెప్పానుగా? ఆ తర్వాత మనిషి ఏమైందో పత్తాలేదు" అన్నది.

కాలభైరవుడు "సరే - కాలం కలిసి వచ్చినప్పుడు తానే బైట పడుతుంది. పాతాళ హోమం పూర్తయ్యే దాకా మన జోలికి రాకుండా ఉండి ఉంటే సరి! ఆ తర్వాత ఏడేడు పధ్నాలుగు లోకాల్లో మనకు ఎదురు లేదు. ప్రస్తుతం పభావతి కుమారుడు మదనుడు ఎక్కడున్నాడో తెలుసుకున్నావా?" అని అడిగాడు.

కాలంధర "అతడు తన బంధువర్గానికి చెందిన కొందరు యువకులతో, వాళ్ల సైన్యాలతో కలిసి - మన చండవర్మాదులు ఇంతకు ముందు స్వాధీనం చేసుకున్న తన సామ్రాజ్యాన్నే కాకుండా, చండవర్మాదుల రాజ్యాలను కూడా అధీనం చేసుకున్నాడని వార్తలందాయి. తల్లి ఉపదేశించిన కొన్ని దివ్యశక్తులతో ఆ రాకుమారుడు అప్పుడప్పుడు అతడి మీదికి పంపే మన అనుచరులను శృంగభంగం చేసి పంపుతున్నాడు" అన్నది.

అన్ని విధాలా చెరుపు కలుగవచ్చునీ మాంత్రిక రాక్షస నాయకుడికి విన్నవించారు.

అందరు చెప్పిన మాటలను విన్న తర్వాత కాలభైరవ మాంత్రికుడు కొద్ది సేపు తీవ్రంగా ఆలోచించాడు. అనంతరం అతడు - "ఆపద ముంచుకొచ్చినప్పటికంటె, ముందుగానే దాని రాకను తెలుసుకుని ప్రతిక్రియ చెయ్యటం ఉపాయశాలుర లక్షణం. మనకందరికి సమస్యగా తయారైన ఆ మదనుడు ఇప్పుడు ఎక్కడున్నాడో,





ఏం చెస్తున్నాడో చూద్దాం" అని కాల భైరవుడు కళ్లు మూసుకుని ఎదురుగా ఉన్న గోడ కేసి చెయ్యి ఆడించాడు.

అతడు కళ్లు తెరిచేసరికి గోడ మీద విశాల పురి రాజమందిరం లోని దృశ్యాలు కనిపించ సాగాయి.

కాలంధరను, చండవర్మాదులను ఉద్దేశించి "కొంత తడవు అక్కడ జరిగే విశేషాలను గురించి తెలుసుకుందాం. తర్వాత కర్తవ్యం గురించి ఆలోచించుకోవచ్చు" అన్నాడు.

వెంటనే కాల భైరవుడితో బాటు కాలంధర, చండవర్మాదులు గోడమీద కనిపించే విశాలపురి రాజమందిరంలోని దృశ్యాలను చూడటంలో నిమగ్నమయ్యారు. ప్రభాకరసింహుడు, శత్రుంజయుడు, వీరసింహుడు, మదనుడు, సూర్యప్రతాపుడు, బంగారు ఆసనాల మీద కూర్చుని ఉన్నారు.

వాళ్లకు ఇరువేపులా సేనాధిపతులు నిల్చుని ఉన్నారు. మంత్రులు కూడా ఆ సమయానికి విశాలపురికి వచ్చి చేరినందున వాళ్లు కూడా తమ ఆసనాల మీద ఉపవిష్టులై ఉన్నారు.

వాళ్లకి కొద్ది దూరంలో వీరసింహుడి చెల్లెలు సుగంధమాల చెలులతో పరివేష్టించబడి పట్టు తివాచి మీద కూర్చుని ఉన్నది.

ప్రభాకరసింహుడు శత్రుంజయుడితో "చిన్నాన్న గారూ! పదిహేను రోజుల్లో మనం విశాలపురి సామ్రాజ్యాన్ని పూర్తిగా విముక్తి చెయ్యటమే కాకుండా ద్రోహులైన చండవర్మ, దుర్జయుడు, వక్రకేతుడు, ఉగ్రసేనుడు తండ్రి తాతల నుంచి పొందిన రాజ్యాలను కూడా వశం చేసుకున్నాము. పద్దెనిమిది సంవత్సరాలనుంచి శత్రువుల చెరసాలల్లో మ్రగ్గుతూన్న మన ఆప్తులైన విశాల పురి మంత్రులను, సైన్యాధికారులను, తక్కిన రాజోద్యోగులను విడిపించాము. శత్రురాజుల రాజ్యాలలో కూడా మదనుని ప్రభుత్వాన్ని ప్రకటించి సమర్థులైన ప్రతినిధులను అక్కడ నియమించాము. సువిశాలమైన విశాలపురి రాజ్యంలో ఇకమీదట మదనునికి ఎదురులేదు" అన్నాడు.

మదనుడు వినయంతో "పెద్ద బావగారూ! పరలోకంలోని నా తండ్రి ఆత్మ శాంతించేట్లు మీరంతా కలిసి విశాలపురి సామ్రాజ్యానికి శత్రుపీడ విరగడ చేశారు. ఇక - మనం చెయ్య

వలసిన మరో మహత్తర కార్యం ఒకటున్నది. మా సోదరి సునందాదేవిని, మీ చెల్లెలు మనోహరిని, మనోహరి స్నేహితురాలు గుణసాగరిని అపహరించిన మంత్రగత్తె భరతం పట్టాలి. మనం జైత్రయాత్రకు వెళ్లినప్పుడు అక్కడక్కడ తటస్థపడిన కొందరు రాజులు, రాజపుత్రులు తమ కూతుళ్లను, చెల్లెళ్లను పోగొట్టుకున్నట్లు చెప్పారు. అంతేకాదు - మీ విజయపురిలోని వేలాది మంది యువతులు మాయమైనట్లే, పలుదేశాలలో వేలకొలది యువతులు మాయమయ్యారని మనకు తెలిసింది. వీళ్లనందరినీ నెలరోజుల తర్వాత పాతాళంలోని ఓ రాక్షస మాంత్రికుడు తన హోమం కోసం బలి పెడతాడనీ, కాలంధర అనే మంత్రగత్తె కూడా వెయ్యిమంది కన్యలతో ఏదో బలిపూజ చేయనున్నదని పదిహేను రోజుల క్రిందట మా అమ్మ నాతో, సూర్య ప్రతాపుడితో చెప్పింది. ఇక ఆ గడువు పదిహేను రోజులే ఉన్నది. ఈ లోగా మనం ఆ మాంత్రిక రాక్షసుడినీ, కాలంధరను అంతం చేసే పథకాలు వేసుకుని అక్కడికి చేరవలసి ఉన్నది" అన్నాడు.

శత్రుంజయుడు "నిజమే నాయనా! కాని, ఈ మధ్య కాలంలో అమ్మ నీకు కనిపించనే లేదు కదా! ఆమె ఆత్మ అప్పుడప్పుడు నీకు సూచనలిస్తుందేమో అనుకున్నాం! అలా కూడా జరగలేదు. ఆ దుష్టశక్తుల కూటమివల్ల అమ్మకేదైనా ప్రమాదం జరిగి ఉంటుందని మనం ఊహించటం పొరబాటు అవుతుందా?" అన్నాడు.

అతడి మాటలకు - సూర్య ప్రతాపుడు జోక్యం కలిగించుకుంటూ ఇలా బదులు చెప్తూ "తప్పకుండా పొరబాటు అవుతుంది చిన్నాన్నగారూ!



ఎందుకంటె, అత్తగారు సాధించిన యోగ శక్తులు, పొందిన సిద్ధులు అంత తేలికైనవి కావు. ప్రయోగించే కొద్దీ మంత్ర శక్తుల్లాగే, దివ్యశక్తులు కూడా వ్యయం కావచ్చునేమో గాని, అంత మాత్రం చేత ఆ క్షుద్రశక్తుల కూటమి వల్ల అత్తగారికొచ్చే ప్రమాదమేమీ ఉండదు. ఒక సారి జంబోదరుడనే రాక్షసుడు మదనుణ్ణి ఎదుర్కోవటానికి భయపడి, ఓ యుక్తి పన్నాడు. అత్తగారి శరీరాన్ని కాల్చి వేశామనీ, ఆమె ఆత్మ గాలిలో తిరుగుతున్నదనీ నమ్మబలకటంతో మదనుడు విచలితుడై, తల్లిగారి కేర్పడిన దుస్థితివల్ల కలిగిన బాధతో మూర్ఛా క్రాంతుడయ్యాడు. అప్పుడే నేను, వీరసింహుడు మూర్ఛనుంచి మదనుణ్ణి సేదదీర్చి అది అబద్ధమని చెప్పాము. అప్పుడు ఆ రాక్షసుణ్ణి చితగ్గొట్టి తరిమివేశాడు. అందువల్ల మనం అటు వంటి అమంగళాల జోలికి పోకూడదు. ఆ సంగతి విడిచిపెట్టి, మదనుడు చెప్పినట్లు ఆ ముక్కిడి మాంత్రికుడు, మాంత్రికురాలు ఉండే చోటులను తెలుసుకునే ప్రయత్నాలు చేద్దాం'' అన్నాడు.

శత్రుంజయుడు "అలా తెలుసుకునేందుకే అన్నాను ప్రతాపా! మా చెల్లెలు ఇప్పుడిక్కడ ఉండి ఉంటే, ఆమె క్షణాల మీద మనల్ని వాళ్ల నివాసాలకి చేర్పించేది'' అన్నాడు.

ఆ తర్వాత వాళ్లంతా కర్తవ్యం గురించి రక రకరకాలుగా ఆలోచిస్తూ, ఇంకా ఎన్ని విషయాలను ఎవరికి తోచింది వారు ఇతరులకు చెబుతూ, కర్తవ్యాలోచన చేస్తున్నారు.

...కాల భైరవుడు తన ఎదురుగా ఉన్న గోడ మీది దృశ్యాలను అంతవరకు చూసి, ఆ తర్వాత తన మంత్ర శక్తితో వాటిని మాయం చేశాడు. కాలంధఖర "అదేమిటి గురునాయకా? ఇంకా ఏం జరుగుతుందో మనం తెలుసుకునే వాళ్లం కదా?'' అన్నది. కాలభైరవుడు చిరునవ్వుతో "ఇక మనం తెలుసుకోవలసిన విషయం ఏదీ లేదు" అన్నాడు.

— (ఇంకావుంది)



121 G.R.G.




16

[జరిగిన కథ: కాలనేమి అనే రాక్షసరాజు పాలనలో ఉన్న పాతాళలోకంలోని ఒక ప్రదేశంలో కాలభైరవుడనే రాక్షస మాంత్రికుడు నివాసముంటూ, ఎన్నో క్షుద్ర మాంత్రిక విద్యలు నేర్చినవాడైనా, సర్వార్థసాధనియైన ప్రపంచ వశీకరణ మహాశక్తిని పొందడానికి 'పాతాళ హోమం' అనే ఓ భయంకరమైన యాగాన్ని తలపెట్టాడు. ఇందుకు అవసరమైన బలికి కావలసిన రాజకన్యలనూ, ఇతర వివాహం అయి, సంతానం లేని యువతుల్నీ వెలికి తీసుకు వచ్చే పనిని తన శిష్యురాలైన కాలంధరకు ఒప్పగిస్తాడు. కాలంధర తన అనుచరురాలైన మాయామయీ, ఇతర రాక్షసగణాల సహాయంతో బలికి అవసరమైన వారిని ముప్పాతిక వంతు దాకా సేకరించి, తన కోటలో భద్రపరుస్తుం ు. ఆమెను శరణు వేడిన దుష్టరాజులనూ, వారి బంధుమిత్రులనూ కూడా తన కోటకు రప్పించి, తన దగ్గ ౹ ఉంచు ుంటుంది. ఈలోగా కాలభైరవుడు తన మంత్రశక్తితో, మదనుడు, అతని బంధువర్గం వారు చేస్తున్న కర్తవ్యాలోచన గురించి తెలుసుకుంటాడు. — ఇక చదవండి]

కాలభైరవుడలా అనగానే అతణ్ణి ప్రశ్నలతో విసిగించకూడదని భావించిన కాలంధర "అలాగే నాయకా! ఇప్పుడు మమ్మల్నేం చెయ్యమంటారు?" అన్నది.

ఆ మాంత్రిక రాక్షసుడు కాలంధరతో "మీరు నీ నివాసానికి వెళ్లండి. మీ పనుల్లో నిమగ్నమై వుండండి. హోమం ప్రారభించే ఒక్క రోజుకు ముందుగా యువతులందరినీ పాతాళ లోకానికి తీసుకువస్తే సరిపోతుంది. అయితే - ఒక్క మాట. ఇప్పటికే మన చర్యలవల్ల భూలోకం అట్టుడికినట్లుడికి పోతున్నట్లున్నది. ఇప్పటివరకు సాధించిన పనులను కాపాడుకుంటూ, ఇక మీదట సాధించబోయే పనుల పట్ల ఎంతో జాగూరకతను వహించాలి" అన్నారు.

ఆ తర్వాత వాళ్లంతా అక్కణ్ణుంచి వెళ్లిపోగానే, కాల భైరవుడు తను కూడా లేచి, ఏదో ఆలోచిస్తూ

కిరణ్ కుమారి



అటూ, ఇటూ పచార్లు చేస్తూ, కొంతసేపటికి మాయమయ్యాడు. ఇలా వుండగా......

....విశాలపురి రాజమందిరంలో కర్తవ్యం గురించి ఆలోచిస్తూన్న ప్రభాకర సింహాదుల ముందు యోగినీ రూపంలో వున్న ప్రభావతీ దేవి ఆవిర్భవించింది.

మదనుడు ఆమెను చూడగానే ఆసనం నుండి లేచి గబగబా దగ్గరికి నడిచి "అమ్మా!" అని కౌగిలించుకున్నాడు.

ప్రభావతి అతడి శిరస్సు మీద ముద్దు పెట్టుకుంటూ ఆనంద భాష్పాలు రాల్చింది.

శత్రుంజియుడు లేచి దగ్గరగా వెళ్లి "అమ్మా! ఇంత క్రితమే నీ గురించి అనుకుంటున్నాం. ఎంత కాలానికి నిన్ను కన్నుల పండువుగా చూడగలిగాను చెల్లీ!" అన్నాడు.

ప్రభావతీ దేవి అతడికి నమస్కరిస్తూ "మీరంతా కలసి నా బిడ్డకు చేసిన సహాయానికి కృతజ్ఞురాలినన్నయ్యా! కాలంధర అనే మంత్రగత్తె నివాసంలో మాయమైన ఆడపిల్లలూ, ఇతరులూ క్షేమంగా ఉన్నారు. సునంద కూడా కుశలంగా వున్నది" అన్నది.

ఆ తర్వాత ఒకరి తర్వాత ఒకరుగా వచ్చి తనకు నమస్కరించిన ప్రభాకరసింహుణ్ణి, సూర్యప్రతాపుణ్ణి, వీరసింహుణ్ణి, సుగంధమాలను, వేర్వేరుగా కౌగిలించుకుని దీవించింది.

మంత్రులు, సేనానులు, భక్తి వినయాలతో చేతులు కట్టుకుని నిల్చుండిపోయారు.

తర్వాత - మదనుడు ప్రభావతీ దేవితో "అమ్మా! పాతాళహోమం తలపెట్టిన కాలభైరవ మాంత్రిక రాక్షసుడు, బలిపూజ చేయటానికి సంకల్పించుకున్న కాలంధర మాంత్రికురాలు, ఎక్కడున్నారో చెప్పు. మేము వెళ్లి వాళ్ళను వధించి, మనవాళ్లతో బాటు అక్కడ చిక్కుపడి వున్న ఆడవాళ్లందరినీ విడిపిస్తాం" అన్నాడు.

ప్రభావతి అతడి మాటలకు నిట్టూర్పుతూ "కుమారా! దివ్యశక్తులతో ఇంచుమించుగా పోటీపడగల మాయలు, మంత్రాలు నేర్చిన వాళ్లిద్దరినీ ఎదుర్కోవటానికి మీరు చాలరు. లక్షల కొలది పిశాచ గణాలు, వేలుకొలది రాక్షసులు, వాళ్లకు అండ దండలుగా వున్నారు. వాళ్ల మీదకు వెళ్లితే, అనవసరమైన ఆపదల్లో చిక్కుకోవటం తప్ప మీకు వేరే ప్రయోజనం ఏమీ

వుండబోదు'' అన్నది.

మదనుడు జాలిగా ఆమెను చూస్తూ "అయితే, సోదరి సునందను, మనోహరిని, మంత్రి పుత్రికను, ఇంకా తక్కిన యువతులను ఆ దుష్ట కూటమి బారినుంచి తప్పించటమెలా అన్నది తెలుపుము'' అన్నాడు.

ప్రభావతి "అందుకు తగిన ఏర్పాట్లు చేస్తూనే వున్నాను. ఆ ఏర్పాట్లలో ఒక భాగంగానే - ఒక పథకాన్ని ఆలోచించి ఇప్పుడు మీదగ్గరికి వచ్చాను. ప్రస్తుతం నువ్వు నేను చెప్పినట్లు చెయ్యాలి'' అన్నది.

మదనుడు "ఏమిటో చెప్పమ్మా తప్పక చేస్తాను'' అన్నాడు.

ప్రభావతి నిశ్చలంగా అతణ్ణి చూస్తూ "ఇంత వరకు కొనసాగించిన కార్యక్రమాల వల్ల నా దివ్యశక్తులు కొన్ని నా నుంచి పోయాయి. తిరిగి వాటిని సంపాదించే శక్తి లేదు; వ్యవధి అంత కన్నా లేదు. నేను నీకు ప్రసాదించిన కామ రూప, కామ గమన విద్యలను తిరిగి నాకు ధారపొయ్యి. వీటి సహాయంతో నేను కాలభైరవ మాంత్రికుణ్ణీ, కాలంధరను, అంతం చేసి, అక్కడ నిర్బంధంలో వున్న వారినందరినీ విడి పించి, మనవాళ్లతో తిరిగి వస్తాను. నేను వచ్చే దాకా మీరంతా నిశ్చింతగా ఇక్కడే వుండండి'' అన్నది.

వెంటనే సూర్యప్రతాపుడు "అత్తయ్యా! మీ ధోరణి నాకు అర్థం కావటం లేదు. అణిమాద్యష్ట సిద్ధులతో బాటు ఇంకా ఎన్నెన్నో యోగ శక్తులు కూడా కలిగివున్న మీకు ఈ కామరూప, కామ గమన విద్యలు లేకపోతే యేం? మీరన్నట్లు





ప్రయోగాలవల్ల కొన్నిటికి కొన్ని వ్యయమై వుండ వచ్చు. అంత మాత్రాన మీరు ఇంతగా డీల్పడి పోతారా? ఇందుకు మమ్మల్ని ప్రోత్సహించ వలసిన మీరు ఊరికే వుండమని మాకు పిరికి మందు పోస్తున్నారా?'' అన్నాడు.

మదనుడతనితో ''ప్రతాపా! అమ్మ ఎంతగా ఆలోచించనిదే ఈ నిర్ణయానికి రాదు. కామరూప, కామగమన విద్యలు నా దగ్గరున్నా ఒకటే, అమ్మ దగ్గర వుండినా ఒకటే! ఈ విషయమై నువ్వెందుకు మరోవిధంగా ఆలోచిస్తున్నావో అర్థం కావటం లేదు'' అన్నాడు.

ప్రభావతి మదనునితో ''కుమారా! ప్రతాపుడు దూరదృష్టితో అలా చెప్పాడు. అనవసర కాలా యాపన చేస్తే, కార్యహాని కలుగుతుంది. త్వరగా ఆ విద్యలను నాకు ధారాదత్తం చెయ్యి నాయనా!'' అన్నది.

ప్రతాపుడు అడ్డుకుంటూ ''మదనా! నా మాట విను. ఆ విద్యలను నీ దగ్గరే వుండనివ్వు. అంతగా అయితే, అత్తగారికి తోడుగా మనం కూడా వెళదాం'' అన్నాడు.

ప్రభావతీ దేవి కోపంతో సూర్య ప్రతాపుణ్ణి చూస్తూ ''అపు నీ వాచాలత. బంధు వర్గానికి చెందిన నువ్వు ఎంతలో వుండాలో అంతలోనే వుండు. ఇది మా తల్లీ కొడుకులకు సంబంధించిన విషయం. మా విషయంలో ఎవ్వరూ పాల్గొననవసరం లేదు'' అని గద్దించింది.

ఆమెలో అంతటి కోపం చోటు చేసుకోవటానికి అందరూ దిగ్భ్రాంతి చెందారు.

మదనుడు ''కామరూప విద్య, కామగమన విద్య అనబడే దివ్య విద్యలు ఇక నుంచి నన్ను విడిచి ఈ వ్యక్తిలో ఆవహించి తమ ప్రభావాన్ని ఈమె ఇష్టానుసారం చూపించును గాక'' అని ప్రభావతీ మహారాణి శిరస్సు మీద కుడి చెయ్యి వుంచి, మంత్రోచ్చారణ పూర్వకంగా ధారాదత్తం చేశాడు.

మొదట్నుంచీ ప్రభావతి విషయమై మరో విధంగా ఆలోచిస్తున్న సూర్యప్రతాపుడికి, ఆమె తన పట్ల అంత కటువును ప్రదర్శించేసరికి అను మానం మరింత బలపడింది.

ఆ అనుమానం తీర్చుకోవటానికి అతడు ప్రయత్నిస్తూండగానే, మదనుడు తొందరపడి తన కామరూప, కామగమన దివ్య విద్యలను

ధారపోశాడు.

ఆమె ప్రభావతి కాదనీ, అదంతా మాయ అని స్పష్టంగా అప్పటికి అర్థం చేసుకున్న సూర్య ప్రతాపుడు - జరాలున ఒర నుంచి కరవాలం దూసి, "మాయారూపధారీ! నువ్వెవరివో మర్యాదగా చెబుతావా; కత్తితో నీ శరీరాన్ని ఖండఖండాలుగా ఖండించమంటావా?'' అని మహోగ్రుడై కత్తిని పైకెత్తాడు. అతడి ప్రవర్తనకు అందరూ విస్తుపోయారు.

మరుక్షణం - తన కౌగిలిలోని మదనుణ్ణి విసురుగా ప్రక్కకు త్రోసి, ఆ మందిరాంతర్భాగం ప్రతిధ్వనించేట్లు వికృతాట్టహాసాలు చేస్తూ, ప్రభావతి వాళ్ల తలలపైకి లేచింది.

క్రూరత్వం ఉట్టిపడే చూపులతో సూర్యప్రతాపుణ్ణి చూస్తూ,, కర్కశత్వం ధ్వనించే పురుష కంఠస్వరంతో 'ఒరీ; రాచబాలిశా! ఇక్కడున్న వాళ్ల కందరికంటే కాస్త బుర్ర వున్నవాడివి, చొరగలవాడివి, నువ్వొక్కడివే, నిన్ను ఓ కంట కనిపెడుతూనే వున్నాను. మీరిప్పుడు కోరలు పీకిన త్రాచులు. మాయా ప్రభావతీ రూపంలో వచ్చి, మదనుడి దగ్గర వున్న దివ్య విద్యలు కాజేసిన నేనెవరినో రెండు కళ్ళూ చెదిరిపోయేట్లు చూడరా!'' అని అంతవరకూ ఈ ప్రభావతి రూపంలో అమెలా నటించిన వ్యక్తి, చురకత్తుల్లాంటి మీసాలుతో, పొడవాటి గడ్డంతో, అట్టలు కట్టిన తలవెంట్రుకల ముడితో, మెడలో రకరకాల పూసలు, కపాల మాల వ్రేలాడుతుండగా భయంకరమైన ఆకారం కలిగిన మాంత్రికుడుగా మారిపోయాడు.

మదనుడు నిశ్చేష్టుడై "ఆఁ? వీడు కాల భైరవుడు కాడు గదా?'' అన్నాడు.



ఆ మాంత్రికుడు విరగబడి నవ్వి "ఇప్పుడు నీ బుర్ర కూడా పనిచేస్తున్నట్లున్నదిరా అర్భకా? పాతాళహోమం తలపెట్టి, మీ భూలోక వాసులందరినీ గజగజ లాడిస్తున్న మంత్రతంత్ర విద్యా విశారదుడైన కాలభైరవ మాంత్రిక చక్రవర్తిని నేనే! నీ దగ్గరున్న దివ్య విద్యలను వూడగొట్టటానికి నీ తల్లి రూపాన్ని ఉపయోగించుకున్నాను. ఇప్పుడు నువ్వు మాములు మనిషివయ్యావు. సహజంగానే కామరూపం, కామగమనం కలిగిన రాక్షస జాతికి చెందిన నాకు నీ విద్యలు అవసరం లేదు. అయినా - ఆ విద్యల వల్ల నువ్వు గాని, నీ మనుషులు గాని మా దరిదాపులకు రాకుండా వుండేందుకే ఇలా చేశాను. మోసగింపబడి దివ్య విద్యలు కోల్పోయినందుకు కుమిలి కుమిలి ఏడ్చి చావు" అని అక్కణ్ణుంచి రివ్వున సుగంధమాల దగ్గరికి వచ్చాడు.

భయంతో గజగజలాడుతూన్న ఆ జవరాలిని ఎత్తి భుజమ్మీద వేసుకుని "ఈ కన్య మా కాలంధర బలి పూజకు ఉపయోగపడుతుంది" అని విషపు నవ్వులతో అంతర్ధానమైపోయాడు కాలభైరవుడు.

ఇంద్రజాలం జరిగినట్లు తమ కళ్ల ముందు జరిగిన ఆ విషాద పరిణామాలకు శత్రుంజయాదులు ప్రూన్పడిపోయారు.

రాక్షస మాంత్రికుణ్ణి అప్పట్లో అడ్డుకోవటానికి కూడా ప్రయత్నించని విధంగా వాళ్ల బుద్ధి మొద్దుబారిపోయింది.

సుంగధమాలతో బాటు విశాలపురి రాజమందిరంలో అంతర్ధానుడైన కాలభైరవుడు - కాలంధర కోటలోని ఆమె ప్రత్యేక అరలో ఆవిర్భ



ఉంచాడు.

తన చేతిలో గిలగిలలాడుతున్న సుగంధమాలను క్రింద విడిచి, హఠాత్తుగా తాను అక్కడికి వచ్చినందుకు ఆశ్చర్యపడుతూన్న కాలంధరతో "ఈ కన్య మన విరోధియైన మదనునికి చెల్లెలవుతుంది. నీకు వుపయోగపడుతుందని తెచ్చాను" అన్నాడు.

కాలంధర భక్తి భావంతో అతనికి నమస్కరించి "గురు నాయకా! ఈ చిన్న పనికి మీరు వెళ్లారా?" అన్నది.

కాలభైరవ మాంత్రికుడు కనుబొమలు ముడివేస్తూ "కాలంధరా! నేను ఈ కన్యను ఎత్తుకు రావటానికి వెళ్లలేదు. నా మంత్ర శక్తి వల్ల గోచరించిన విశాలపురి దృశ్యాలను చూసి మీరు వచ్చిన తర్వాత నేను తీవ్రంగా ఆలోచించాను. మన విరోధుల్లో ఏ ఒక్కరు కూడా మనల్ని గాని, మన అనుచరులను గాని, ఎదిరించే శక్తిని కలిగి వుండకూడదని నిర్ణయించుకున్నాను. వెంటనే ప్రభావతి కుమారుడైన మదనుడి మీదకి నా దృష్టి పోయింది. స్వతస్సిద్ధంగా అలవడిన పరాక్రమంతో బాటు, కామరూపం, కామగమనం అనే దివ్య విద్యలను తల్లినుండి పొందిన ఆ రాకుమారుడు మన ఉనికిని తెలుసుకుని మనకు కీడు తలపెట్టడానికి ఎంత ఉద్రూతలూగాడో నువ్వూ చూశావుగా? ఆ విద్యలను అపహరిస్తే గాని, వాడు మాములు మనిషి కాడు. ఆ పనికి ఎవరినైనా పంపితే కార్యహాని కలుగటమే కాకుండా, మరింత త్వరగా మనకు కీడు తలపెట్టే ప్రయత్నాలు వాళ్లు ఆ మదనునితో కలిసి చెయ్యవచ్చు. అందువల్ల నేనే స్వయంగా



వెళ్లవలసి వచ్చింది. పనిలో పనిగా అక్కడున్న ఈ రాచ కన్యను నీకోసం తెచ్చాను" అన్నాడు.

కాలంధర సంతోషించి "చాలా మంచి పని చేశారు. గురు నాయకా! కానీ, మనం ఇప్పుడు ఓ ముఖ్యమైన విషయం గురించి తీవ్రంగా ఆలోచించాలి" అన్నది.

కాలభైరవుడు కాలంధరను ఓవిధంగా చూసి, "ఏమిటమ్మా అది?" అన్నాడు.

"ప్రభావతీ దేవి దాదాపు పదిహేను రోజుల్నుంచి మౌనం వహించి ఎక్కడో ఎందుకున్నది? తన వాళ్లకి, తనసాటి ఆడవాళ్ళకు, ఇన్ని ఇక్కట్లు ఏర్పడుతూంటే, చూస్తూ ఎలా ఊరికే ఉండ గలుగుతున్నది? ఆమె గురించి నేనెంత ప్రయత్నించినా ఆమె జాడే తెలియటం లేదు" అన్నది కాలంధర.

కాలభైరవుడు తలవూపి "ఆమె ఉనికిని మనం తెలుసుకోవలసిందే? మన ప్రయత్నాలకు అందనట్లయితే, ఆ ప్రభావతి దేవి నిస్సందేహంగా కాల గర్భంలో కలిసిపోయినట్లే అనుకుందాం" అన్నాడు.

ఆ తర్వాత కాలభైరవుడు కాలంధరకు తన హెూమాన్ని గురించి ఇవ్వవలసిన కొన్ని సూచనలు ఇచ్చి, తగు జాగ్రత్తలు చెప్పి, అక్కణ్ణుంచి మాయమయ్యాడు.

కాలంధర ఓ అనుచరురాలిని పిలిచి "ఈ కన్యను తీసికెల్లి, సువర్ణపురి రాకుమారి, మంత్రి కుమారి, తక్కిన కన్యలున్న అరలో వుంచు" అని ఆజ్ఞాపించింది.

ఆ అనుచరురాలు సుగంధ మాలను తీసుకొని వెళ్లగానే కాలంధర మాయా దర్పణం దగ్గరికి నడిచింది. అక్కడ ఓ తట్టలో వున్న విబూదిని గుప్పెటతో తీసుకుని "విశాల పురి మహారాణి ప్రభావతీ దేవి ఎక్కడున్నదో చూపించు" అన్నది. కానీ ఎంతసేపు చూసినా ఆ మాంత్రికురాలికి ప్రభావతిదేవి జాడ ఆ మాయాదర్పణంలో ఎక్కడా కనిపించలేదు. —(ఇంకా వుంది)



129 G.12.G.




## 17

[జరిగిన కథ : రాక్షస మాంత్రికుడైన కాలభైరవుడు తను ప్రారంభించబోయే పాతాళహోమానికి, కాలంధర వశంలో ఉన్న యువతుల్నందరినీ ఒకరోజు ముందుగా పాతాళలోకానికి చేర్చమని చెప్పి, కాలంధరను ఆమె నివాసానికి పంపివేస్తాడు. ఇంతలో విశాలపురిలోని రాజమందిరంలో తమ కర్తవ్యం గురించి ఆలోచిస్తున్న ప్రభాకర సింహాదుల ముందు ప్రభావతీదేవిలా యోగినీ రూపం ధరించి, ప్రత్యక్షమైన కాలభైరవుడు, మదనుని దగ్గరున్న కామరూప, కామగమన విద్యలను అపహరించి, తర్వాత తన నిజరూపంలో కాలభైరవుడిగా మారి, అక్కడున్న రాకుమారి సుంగధమాలతో అంతర్ధానమయి, కాలంధర కోటలోని ఆమె ప్రత్యేక అరలో ఆవిర్భవిస్తాడు. సుగంధమాలను కాలంధరకు అప్పగించి, పాతాళహోమాన్ని గురించి కొన్ని సూచనలిచ్చి పాతాళలోకం వెళ్ళిపోతాడు. కాలంధర సుగంధమాలను ఇతర రాజకన్యలతో చేర్పించి, తన మాయాదర్పణంలో విభూతి చెల్లి మహారాణి ప్రభావతీదేవి ఎక్కడున్నదో చూపమంటుంది. కానీ అందులో ఆమెకు ప్రభావతిదేవి ఎక్కడా కన్పించలేదు. — ఇక చదవండి]

కాలభైరవ మాంత్రికుడు మదనుణ్ణి వంచించి, అతడినుంచి కామరూప, కామగమన విద్యలను తస్కరించి వెళ్లిన తర్వాత - విశాలపురి రాజ మందిరంలోని అందరి ముఖాలలో విచారం పెల్లుబికింది.

మదనునికి తల్లి వల్ల సంక్రమించిన దివ్య శక్తుల సహాయంతో కాలభైరవుణ్ణి, కాలంధరను, పసికట్టి వాళ్లు అంతు తేల్చాలని ఉవ్విళ్లూరి, ఉద్రూతలూగుతూన్న సమయంలో ఆ దురదృష్ట కరమైన సంఘటన జరగటం ప్రతాపునికి అంత శృల్యమైంది.

శతృంజయాదులు చెల్లెలిని కోల్పోయి దుఃఖంతో కృంగిపోతూన్న వీరసింహునికి ధైర్యం చెప్పసాగారు.

శత్రువుల బారినుంచి సామ్రాజ్యాన్ని తిరిగి పొందామన్న ఆనందంతో అంతకు ముందు


కిరణ్ కుమారి



పొంగిపోయిన మంత్రులు, సేనానులు అప్పుడు జరిగినదానికి కృంగిపోయారు.

మదనుడు వీరసింహుని దగ్గరికి వెళ్లి "అన్నయ్యా! నేను బాల్యంలోనే తండ్రిని శాశ్వతంగా పోగొట్టుకున్న దురదృష్టవంతుణ్ణి! దేవతలాంటి తల్లిని పడరాట్లు పడజేసిన పరమ దౌర్భాగ్యుణ్ణి!! ఇప్పుడు చెల్లెలు నీ నుంచి దూరం కావటానికి కారకుడైన అరిష్ట జాతకుణ్ణి!... నావల్లనే కదా, నీకిన్ని బాధలు ఏర్పడ్డాయి. నా విషయంలో జోక్యం కలిగించుకోకపోతే, ఈపాటికి వివాహితుడివై, పట్టాభిషిక్తుడవై సుఖంగా రాజ్యపాలన చేసుకుంటూ వుండేవాడివి కదా? దయచేసి నన్ను మన్నించు" అన్నాడు విశాదంగా.

వెంటనే వీరసింహుడు దుఃఖం నుండి తేరుకున్నాడు. మదనుణ్ణి రెండు చేతులతో పొదివి పట్టుకున్నాడు. ఆప్యాయంగా నుదిటి మీద ముద్దు పెట్టుకుని "తమ్ముడూ! నీకు ధైర్యం కలిగించవలసినవాడిని - నేనే దుఃఖానికి బానిసనైనందుకు సిగ్గుపడుతున్నాను. నా దుఃఖాన్ని చూసి నిన్ను నువ్వు నిందించుకోవటం నేను సహించలేను" - అన్నాడు.

సూర్యప్రతాపుడు కూడా మదనుడి మాటలకు భిన్నుడై అతడి దగ్గరికి వెళ్లాడు. లాలనగా భుజమ్మీద చెయ్యి వేసి "ఇప్పుడు మనం ధైర్యోత్సాహాలతో ముందడుగు వెయ్యాలిసిన సమయం బావా! ఆ మాంత్రికుడు మీ చెల్లెలిని ఎత్తుకుపోతూంటే, చూస్తూ కూడా ఎవ్వరమూ ఏమీ చెయ్యలేకపోవటం దుర్విధికల్పం. అప్పట్లో వాడి క్షుద్ర శక్తి మనల్ని ఆవరించి నిరుత్తరులను, నిశ్చేష్టితులను చేసింది. అయినా - ఇప్పుడేం మించిపోయింది? మాంత్రికుణ్ణి, మంత్రగత్తెను, మనం విడిచిపెట్టం కదా?" అన్నాడు.

ప్రభాకరసింహుడు కూడా మదనుణ్ణి ఓదార్చి, ధైర్యోత్సాహాలను నూరిపోశాడు.

అనంతరం - వీరసింహుడు విశాలపురి సామ్రాజ్య పాలనా భారాన్ని ప్రభాకరసింహుడి మీదా, శత్రుంజయుడి మీదా, విడిచిపెట్టి, ఆ దినమే సూర్యప్రతాపునితో, మదనునితో కలసి బయలుదేరాడు.

అశ్వారూఢులైన ఆ రాజపుత్రులు ముగ్గురూ కాలంధర నివాసముండే తాంత్రిక కోటను గురించి అక్కడక్కడ విచారించుకుంటూ, ఒక

131

దినమూ, ఒక రాత్రీ, ఏకధాటిగా ప్రయాణం కొనసాగించారు. సూర్యోదయం అవుతూండగా - వాళ్లు ప్రయాణిస్తూన్న బాట ఓ కూడలి వద్ద మూడు బాటలుగా చీలింది.

అప్పుడు వీరసింహుడు మదనుణ్ణీ, సూర్యప్రతాపుణ్ణీ చూస్తూ "మనం ఇక్కడి నుండి విడిపోదాం" అన్నాడు.

మదనుడు ఆశ్చర్యంతో "ఎందుకన్నయ్యా?" అని అడిగాడు.

వీరసింహుడు "తమ్ముడూ! ఇప్పుడు మనకున్న వ్యవధి చాలా తక్కువ. ముగ్గురం ఒకే బాట మీద ప్రయాణం చేస్తూ, ఒకే విధమైన విశేషాలను తెలుసుకుంటూ సమయాన్ని వ్యర్థం చేయటం కంటె, ముగ్గురం మూడు దిశలుగా ప్రయాణిస్తే, మూడింతల విశేషాలను తెలుసుకోవచ్చు, మూడు రెట్లు సమయాన్ని పొందవచ్చు. ముగ్గురి లక్ష్యం ఒక్కటే అయినప్పుడు కార్యాన్ని ఎవరం సాధించినా ఒక్కటే" అన్నాడు.

మదనుడు "నిజమే అన్నయ్యా! మనం ముగ్గురం తలా ఒక బాట మీద ప్రయాణిద్దాం. సరిగ్గా పదిహేను రోజులకు కాలంధర నివాసం పసికట్టి అక్కడ కలుసుకుందాం" అన్నాడు.

ఆ మాటలకు ప్రతాపుడు కూడా అంగీకరించాడు. అనంతరం ఒకరి కొకరు హెచ్చరికలు, వీడ్కోలులు చెప్పుకుని, ఆ రాజపుత్రులు ముగ్గురూ ఇనుమడించిన ఉత్సాహంతో ఒక్కొక్కరు ఒక్కొక్క బాట మీదుగా తమ తమ అశ్వాలను పరుగులు తీయించారు.



ఉత్తరంవేపుగా ప్రయాణిస్తూన్న సూర్యప్రతాపుడు తన అశ్వాన్ని అడవి మార్గాల్లో పేరెము వారిస్తూ, పల్లెలు, పట్టణాలు తటస్థపడినప్పుడు మెల్లిగా నడిపిస్తూ, కనిపించిన ప్రతివారిని "కాలంధర అనే మంత్రగత్తె నివాసం ఎక్కడున్నదో తెలుసా?" అని అడుగుతూ రెండు రోజుల తర్వాత ఓ కారడివి చేరాడు.

అది మామూలు అడవి అనీ, త్వరలో దానిని దాటిపోవచ్చుననీ భావించిన సూర్యప్రతాపునికి ఎంతసేపటికీ దాని అంతం కనిపించకపోయేసరికి మధ్యాహ్నం సమయానికైనా అవతలికి చేరక పోతానా అన్న ఆలోచనతో గుర్రాన్ని మరింత వేగంతో పరుగులు తీయించాడు.

ఎత్తుగా ఆకాశాన్నంటేట్లు సుదూరం విస్త



రంచి పర్వత శ్రేణులతో, దట్టంగా అడ్డదిడ్డంగా పెరిగిన పెద్ద పెద్ద చెట్లతో, అప్పుడప్పుడు భయంకరంగా గర్జిస్తున్న సింహాది క్రూర మృగాలతో నిండిన ఆ అడవిలో ప్రతాపుడు మధ్యాహ్నం దాకా ప్రయాణించాడు.

అడవి అంతకంతకు పెరిగిపోతూన్నట్లనిపిస్తున్నదేగాని, తరిగిపోతున్నట్లనిపించలేదు.

నడిమింటి సూర్యుడు భూమ్మీద నిప్పులు చెరిగిపోస్తున్నట్లు చండ ప్రచండంగా ఎండను కాయిస్తూ, ప్రకాశించసాగాడు. ప్రతాపుడి శరీరం చెమట బిందువులతో నిండి, అతడి దుస్తులు తడిసిపోయాయి.

గుర్రం కూడా ఒళ్ళంతా చెమటలు పట్టి బాగా అలసిపోయినట్లు గ్రహించిన ప్రతాపుడు, కొంచెం సేపు ఎక్కడైనా విశ్రాంతి తీసుకుని, ఆ తర్వాత ప్రయాణం కొనసాగించవచ్చునని భావిస్తూ, అనువైన ప్రదేశం కోసం తల నిక్కించి అటూ ఇటూ చూశాడు.

బాటకు కొద్ది దూరంలో అతడికి ఓ శివాలయం నేత్రపర్వం చేసింది. వెంటనే గుర్రాన్ని ప్రక్కకు త్రిప్పి, ఆ ఆలయానికేసి నడిపించసాగాడు.

అంతవరకు బాట మీద యథేచ్ఛగా పరుగిడిన అశ్వం ముళ్ల కంపలు, గచ్చు పొదలు, కాళ్లకు గ్రుచ్చుకుంటూంటే మెల్లగా నడుస్తూ మరి కొద్ది సేపటికి శివాలయ ప్రాంగణం చేరుకున్నది.

సూర్య ప్రతాపుడు గుర్రం నుండి క్రిందికి దిగాడు. ఆ ప్రాంతమంతా ఏపుగా పెరిగి ప్రాకారం గోడదాకా విస్తరించి వున్న పచ్చికను మేయటానికి వుపక్రమించిన గుర్రాన్ని వీపు దువ్వి, అతడు ఆలయ ప్రాకారం లోపలికి వెళ్లాడు.

రకరకాల శిల్ప సౌందర్యంతో విరజిల్లే ఎత్తైన గోపురమూ, అక్కడక్కడ అలంకారప్రాయంగా నిర్మించబడిన మంటపాలు, నగిషీలు చెక్కబడిన అందమైన స్తంభాలు, మూల విరాట్టుకు నిలయంగా భాసిల్లే గర్భగుడీ, ఒకవేపున స్వచ్ఛమైన నీటితో నిండిన పుష్కరిణి, చిరుగాలి కదలికకు గలగల శబ్దం చేస్తున్న గంటలతో పరిశోభించే ధ్వజస్తంభమూ,... ఆ ఆలయం వైభవాన్ని చాటుతున్నాయి. నిర్జనమై, క్రూర మృగాలకు, దారి దోపిడి దొంగలకు నిలయమైన ఆ కారడవిలో అటువంటి అపురూపమైన

ఆలయాన్ని ఏ మహారాజో నిర్మించి ఉంటాడనీ. సాధారణ వ్యక్తులకు ఆ నిర్మాణం అసాధ్యమనీ, తలపోశాడు అతడు.

బహుశా - స్థల ప్రభావం వల్ల ఈ శివాలయం ఇక్కడ నిర్మితమై వుంటుందని కూడా ఊహించాడు అతడు.

ఏ నగరంలోనో, జనపదంలోనో నిర్మించబడి వుంటే, నిత్య పూజలకు నోచుకుంటూ వుండేది కదా అని కూడా ప్రతాపుడు ఆ ఆలయాన్ని గురించి బాధపడ్డాడు.

అవన్నీ తనకు అనవసరపు విషయాలైనా - తామర తంపరగా మెదడులో చెలరేగుతున్న ఆలోచనలకు స్వస్తి చెప్పి, చక్కగా స్నానం చేసి, కాసేపు విశ్రమించటానికి అనుకూలమైన చోటు దొరికిందని సంతృప్తి చెందాడు.

అతడు పుష్కరిణిలో దిగి, చెమటతో తడిసి, దుమ్ము కొట్టుకుని. వున్న దుస్తులను శుభ్రంగా ఉతికి మెట్లమీద ఆరవేసి, స్నానం చేశాడు.

ఆరిన తర్వాత బట్టలను ధరించి, పుష్కరిణి మెట్టమీద నుండి పైకి వచ్చాడు ప్రాకారం లోపలి భాగంలో అక్కడక్కడ వున్న పళ్ల చెట్ల నుండి కొన్ని తీయని పళ్లు కోసుకుని కడుపునిండా భక్షించాడు.

ఓమారు ఆలయాన్ని ప్రదక్షిణం చేసి, ధ్వజ స్తంభం దగ్గరికి వచ్చాడు. ధ్వజస్తంభం వున్న పాలరాతి అరుగు మీద కూర్చుని, ప్రక్కనే ఓ శిలా శాసనం వుంటం గమనించి, దానిలోని అక్షరాలను ప్రతాపుడు ఈ విధంగా చదువుకున్నాడు.

హెచ్చరిక

"ఈ ఆలయ నిర్మాణంలో ఓ దేవరహస్యం





ఇమిడివున్నది. సాహసము, సత్ప్రవర్తన, సద్గుణము కలిగిన యువకులకు మాత్రమే ఈ కట్టడం గోచరిస్తుంది. విధిప్రేరితులై ఈ ప్రాంతానికి వచ్చినవారిలో - పైన పేర్కొనబడిన లక్షణాలు కలిగిన యువకులు పగలంతా ఆలయంలోని పరమేశ్వర మహాదేవుణ్ణి పూజించుకోవచ్చు. అవసరమైతే విశ్రాంతి తీసుకోవచ్చు. కాని, ఎటువంటి పరిస్థితిలోనూ సూర్యుడు అస్తమించిన తర్వాత - ఈ గుడి పరిసరాల్లో వుండకూడదు. ఇది హెచ్చరిక. దీనిని పాటించకపోతే, ఘోరమైన ప్రమాదం తప్పదు'' - ఆ శాసనాన్ని పూర్తిగా చదువుకోగానే సూర్యప్రతాపుడు మెల్లిగా పాలరాతి అరుగుమీదినుండి లేచాడు.

ఆ శిలాశాసనానికి నమస్కరించి, అక్కడే నిల్చుని కొద్దిసేపు ఆలోచించాడు. తనలాంటి వాళ్ళకి తప్ప ఆ ఆలయం ఇతరులకు కనిపించదని ఈ శాసనం వల్ల తెలుస్తున్నది.

అయితే - ఈ దేవ రహస్యంలోని పరమార్థం ఏమై వుంటుంది. రాత్రి వేళల్లో ఇక్కడేదైనా దైవకార్యం జరుగుతుందా? ఆ సమయంలో ఆ కార్యం ఇతరుల కంట పడకూడదా?

అంతే అయివుంటుంది. అయినా, ఈ శాసనాన్ని చదివిన తర్వాత, దీనిని గౌరవించడమూ, తనకే ప్రమాదం లేకుండా బైటపడటమూ తప్ప, మిగిలిన విషయాలను గురించి తాను ఆలోచించటం కూడా నేరం కావచ్చు.

ఎండ ఇంకా చాలా తీవ్రస్థాయిలో వున్నది. అశ్వం పచ్చికమేసి ప్రాకారం ప్రక్కన నీడలో నిల్చుని నెమరువేస్తున్నది.

తాను కొంచెంసేపు విశ్రాంతి తీసుకుని, సాయంత్రం ఇక్కణ్ణుంచి వెళ్ళిపోవచ్చు. చీకటి పడ్డ తర్వాత మాత్రమే ఇక్కడుండకూడదు!

ఆ విధంగా ఆలోచించి నిర్ణయించుకున్న తర్వాత సూర్యప్రతాపుడు మళ్ళీ పాలరాతి అరుగు మీద కూర్చున్నాడు.

ఆలయ ప్రాకారం చుట్టూ అక్కడక్కడ ఎత్తుగా పెరిగి, పచ్చని ఆకులు నిండిన కొమ్మలతో ఠీవిగా నిల్చుని వున్న చెట్లు మెల్లిగా తలవూపుతున్నాయి. ఆ వూపుల కదలికల వల్ల ఏర్పడిన చల్లని గాలులు మెల్లమెల్లగా ప్రయాణిస్తూ వచ్చి, సూర్య ప్రతాపుని శరీరాన్ని మృదువుగా సోకసాగాయి. అతడు కూర్చున్న పాలరాతి అరుగు శీతలంగా

వుండి, తనమీద మేను వాల్చమని అతణ్ణి ఆహ్వానిస్తున్నట్లనిపించింది.

ప్రతాపుడు ఆ అరుగుమీద పడుకున్నాడు. కొద్దిసేపటికే అతడికి నిద్ర పట్టింది. అది ఒళ్లు తెలీనంతగా గాఢనిద్రగా మారిపోవటానికి ఎంతో సేపు పట్టలేదుగాని; తిరిగి మెలకువ రావటానికి మాత్రం చాలాసేపు పట్టింది. కళ్లు తెరవగానే ప్రక్కలో ఫిరంగి ప్రేలినట్లు ఉలిక్కిపడ్డాడు.

ఆ ఆలయమంతటా దేదీప్యమానమైన వెలుతురు నిండివుంది. అక్కడక్కడ కాంతివంతములైన దీపాలు వెలుగుతున్నాయి.

సూర్యుడు అస్తమించి చాలాసేపు అయిందని తెలుసుకోవటానికి అతడికి ఎంతోసేపు పట్టలేదు. ఆకాశంలో చంద్రుడు ఉదయించి వెన్నెల వెలుగులను భూమ్మీదకు విరజిమ్ముతున్నాడు. నక్షత్రాలు మిలమిలలాడుతూ శోభాయమానంగా వెలుగుతున్నాయి.

ప్రతాపుడు శిలాశాసనం ప్రకారం తనకేదైనా ప్రమాదం కలుగుతుందేమోనని తలపోస్తూనే, అరుగు మీది నుంచి లేచాడు. గుర్రం అప్పటికే ఆవరణలో ప్రవేశించి, తనకు సమీపంగా వచ్చి నిల్చుని వున్నది. తనకు తెలీకుండా జరిగిన అపరాధాన్ని మన్నించమని పరమ శివుణ్ణి ప్రార్థించుకుంటూనే ప్రతాపుడు అశ్వం దగ్గరికి నడిచాడు.

అతడు గుర్రాన్ని అధిరోహించబోతూండగా, ఆ ప్రాంతమంతటినీ అమృతపు జల్లులతో ముంచివేస్తూ, అపూర్వమైన ఒక రాగాలాపన వినిపించింది. మరికొన్ని కోమల కంఠస్వరాలు కూడా ఆ ఆలాపనలో శ్రుతి కలిపి, గంధర్వగానం వెలయించసాగాయి...



దారిన వెళ్లే తనకి ఈ కారడవిలో అత్యద్భుతమైన ఓ శివాలయం కనిపించటమూ, దేవ రహస్యం అని వ్రాయబడివున్న శిలాశాసనం కంటపడటం, గాఢ నిద్రకు లోనైన తాను ఆ శిలాశాసనంలోని అంశాన్ని గౌరవించలేకపోవటం, తీరా బయలు దేరుతూండగా మానవకాంతులకు దుర్లభమైన రీతిలో ఇప్పుడీ దివ్యగానం వినిపించటం,... అన్నీ ప్రతాపుడి మస్తిష్కాన్ని విచిత్రంగా ఉక్కిరి బిక్కిరి చేయసాగాయి.

అతడు అశ్వాన్ని అధిరోహించకుండా, అలా నివ్వెరపోయి ఆ గానం ఎటువేపు నుంచి విన వస్తున్నదా అని పరిశీలనగా చూశాడు.

అప్పుడు కనిపించింది అతడికి ఆకాశం నుండి శివాలయం మీదుగా క్రిందికి జారుతూన్న కాంతిపుంజాల వలయం!

ఒకదాని తర్వాత మరొకటి - ఒకదానిని మించి మరొకటిగా జరుగుతూన్న విచిత్ర సంఘటనలకు విస్తుపోతూనే ప్రతాపుడు, ఎలాగూ చీకటి పడ్డాక అక్కడే వున్నాడు గనుక, ఇంకా కొద్దిసేపు ఉండి ఈ వింతేమిటో తెలుసుకుని పోవాలని నిర్ణయించుకుని, ఆ కాంతి పుంజాల వలయం వంకే చూస్తూ, తిరిగి ధ్వజస్తంభం దగ్గరికి వచ్చాడు.

కొంతసేపటికి కాంతి పుంజాల వలయం శివాలయం మంటపాన్ని సమీపించింది. ఆ వలయం నుంచే సుమధురమైన ఆ సంగీతం వినవస్తున్నది తెలుసుకున్నాడు అతడు.

కాంతి పుంజాల వలయం మంటపంలోకి దిగగానే - అసమానమైన లావణ్యంతో, అసదృశమైన సౌందర్యంతో ప్రకాశించే దివ్య యువతుల సముదాయంగా మారిపోయింది!

ప్రతాపుడు రెండు చేతులు కట్టుకుని, నిర్మలమైన నిశ్చల గంభీర దృష్టులనే ఆ కన్యకామణుల వేపు ప్రసరింపజేస్తూ, అక్కడే నిల్చుండిపోయాడు. ఆ కన్యలంతా ఆ మంటపంలో వలయంగా ఏర్పడ్డారు. చుక్కల్లో చంద్రబింబంలా ప్రకాశించే ఓ యువతి వలయం మధ్యగా నిల్చున్నది!

(ఇంకా వుంది)



15/4 R.G.



# 18

[జరిగిన కథ : కాలభైరవ మాంత్రికుని వంచనవల్ల తన దివ్యశక్తులను కోల్పోయిన మదనుడు విచారభరితుడై ఉండగా, సూర్యప్రతాపుడూ, ప్రభాకరసింహుడూ అతణ్ణి ఓదార్చి, అతనికి ధైర్యోత్సాహాలు నూరిపోస్తారు. తరువాత వీరసింహుడు, సూర్యప్రతాపుడు, మదనుడు కలిసి కాలంధర నివాసమైన తాంత్రిక కోటను వెతుక్కుంటూ బయలుదేరుతారు. ముగ్గురూ ఏకదాటిగా ప్రయాణం చేసి, మూడుబాటల ఒక కూడలి వద్ద ఆగి తలొక బాటలో ప్రయాణం చేసి పదిహేను రోజుల తర్వాత కాలంధర కోటను కనిపెట్టి అక్కడ కలుసుకుందాం అని వీడ్కోలు పుచ్చుకుని విడిపోతారు. వారిలో ఉత్తరం వైపు వెళ్ళిన సూర్యప్రతాపుడు ఒక కారడవిలో ప్రవేశించి మధ్యాహ్నం వేళకు ఒక శివాలయం చేరుకుంటాడు. అక్కడున్న ఒక శిలాశాసనం చదివి అక్కడ కొంతసేపు విశ్రాంతి తీసుకుని, అక్కణ్ణుంచి బయలుదేరబోతున్న సూర్యప్రతాపుడి కంటికి ఆకాశం నుండి శివాలయం మంటపంలోకి దిగివచ్చిన దివ్య యువతుల సముదాయం మధ్యలో చంద్రబింబంలాంటి ఓ యువతి కనిపిస్తుంది.....ఇది ఇలా ఉండగా....పడమటి దిశగా వెళ్ళిన మదనుడు మూడవరోజున ఒక సిద్ధాశ్రమం ప్రాంతం చేరుకుంటాడు..... ఇక చదవండి]

కాలంధర నివాసాన్ని వెతుకుతూ పడమటి దిశగా వెళ్లిన మదనుడు మూడవ రోజున చీకటి పడుతూండగా ఓ సిద్ధాశ్రమ ప్రాంతం చేరాడు. ఆ ప్రాంతమంతా పవిత్రమైనదిగా భావిస్తూ, అతడు గుర్రం దిగి, కళ్లాన్ని పట్టుకుని మెల్లిగా గుర్రాన్ని నడిపిస్తూ, ఆశ్రమం వేపుగా నడక సాగించాడు. కొంతసేపటికి మదనుడు ఆశ్రమం ముఖ ద్వారం చేరుకుని, గుర్రాన్ని అక్కడ విడిచి, లోపలికి వెళ్లాడు.

ఆ కుటీరంలో దీపం వెలుగుతూండటం గమనించి, నిశ్శబ్దంగా అక్కడికి నడిచాడు.

లోపల తెల్లని వస్త్రాలు ధరించిన ఓ సిద్ధుడు జింక చర్మం మీద కూర్చుని, ఉపాసనలో విలీనుడై వుండటం గమనించి, అక్కడినుంచే అతనికి నమస్కరించి వెనుతిరిగాడు.

ఆ సిద్ధ పురుషుడు ఉపాసన పూర్తి చేసుకున్న తర్వాత దర్శనం చేసుకుని, కాలంధర కోట ఎక్కడున్నదో తెలుపమని అడగాలని తలపోసిన

కిరణ్ కుమారి



మదనుడు కొంచేంసేపు అక్కడక్కడే తచ్చాడాడు. కాని, ఎంతసేపటికి ఆయన కళ్లు తెరవకపోవడంతో, ఆశ్రమం బైటికి వచ్చాడు. గుర్రం పచ్చిక మేస్తూండటం గమనించి, కాసేపు అలా తిరిగి వద్దామన్న తలంపుతో అతడు అక్కడి నుంచి బయలుదేరాడు.

ఆ ఆశ్రమానికి కొద్ది దూరంలో ఓ సెలయేరు పారుతున్నది. మదనుడు అక్కడికి వెళ్లి, ఒకచోట కూర్చోబోతూండగా, అక్కడికి సమీపంలో ఏదో మాట్లాడుకుంటూ రెండు పురుష కంఠ స్వరాలు వినిపించాయి.

మదనుడు ఆ సమయంలో అక్కడ చేరి మాట్లాడుకుంటూన్నవాళ్లెవరై ఉంటారో తెలుసుకోవాలన్న కుతూహలంతో నిశ్శబ్దంగా అక్కడికి నడిచాడు.

ఓ పొదకి అటువేపుగా కూర్చున్న ఇరువురు తమ మాటల్లో మునిగి మదనుని రాకను గుర్తించలేదు.

వాళ్లలో ఒకడు ''ఒరే - జంబులింగం! ఇంకా ఎంత కాలం ఈ సిద్ధుడికి శుశ్రూషలు చేసి చావాలిరా! ఇద్దరం ఇప్పటికి మూడు సంవవత్సరాల నుంచి పడిగాపులు గాసి ఏడుస్తున్నామా? ఆ సిద్ధాంజనం డబ్బీని మనకిస్తాడనే ఆశ నీకైతే వుందేమో గాని, నాలో పూర్తిగా అడుగంటిపోయింది'' అన్నాడు.

ఆ మాటలు మదనునిలో కుతూహలాన్ని కలిగించాయి. అతడు అక్కడే నక్కి దాక్కుని వాళ్ల మాటలు వినటంలో దోషం లేదని భావిస్తూ, చెవులు రిక్కించి వినసాగాడు.

జంబులింగం ఆ మాటలకు బదులిస్తూ ''సోమలింగం! ఓపిక పట్టాలిరా! ఎలాగైనా ఆ అంజనాన్ని చేజిక్కించుకున్నామనుకో ... మనం కుబేరులమే'' అన్నాడు.

సోమలింగం నవ్వి ''నీ మొహం. ఆ డబ్బీలోని అంజనాన్ని కాళ్లకి రాసుకుంటే కోరిన చోటుకి క్షణాలమీద వెళ్ళగలం. ఆ మాత్రానికి కుబేరుల మెలా అవుతాంరా'' అన్నాడు.

జంబులింగం ''నీ మట్టిబుర్రకేమీ తోచదురా'' అన్నాడు.

సోమలింగం ''ఎన్నెన్ని పనులైనా ఏం చేస్తావోయ్? ఒక చోటు నుంచి మరోచోటుకి చేర్పించటమేగా దాని పని'' అన్నాడు.

జంబులింగం "ఒరే సోమూ! నీకు అంజనం వని చేసేతీరు మాత్రమే తెలుసు. దానిని ఉపయోగించుకునే విధానం ఒకటి ఉంది. ఆ విధంగా చేస్తే, మనం ప్రపంచంలోని ధనికుల్లో కల్లా ధనికులమైపోతాం" అన్నాడు. అతడి మాటలకు సోమలింగం విసుక్కుంటూ "అబ్బబ్బా! మాట్లాడితే కుబేరులం, ధనికులం అనే కూతలు తప్ప అలా అయ్యేదెలాగో చెప్పవేరా?" అన్నాడు.

జంబులింగం "ప్రపంచజ్ఞానం తెలీని బడుద్దాయీ, విను! రాజుల్లోకల్లా ధనికుడైన రాజును ఎన్నుకుందాం. అతడి ఖజానాను చేరుకొని కొల్లగొడదాం" అన్నాడు.

సోమలింగం "నీ మొహం. ఖజానా దగ్గరికి సిద్ధాంజనం వల్ల చేరుకోవడమైతే చేరుకోగలం గాని, ఖజానాను కొల్లగొట్టేందుకు గుండెబలం, కండబలం కావాలి. అవి మన దగ్గరెక్కడేడిచచ్చాయి? ఖజానా దగ్గర బోలెడుమంది భటులు కత్తులు పట్టుకుని కాపలా వుంటారని నీకు తెలీదనుకుంటాను" అన్నాడు.

జంబులింగం "అయితే, మరో పని చేద్దాం ప్రపంచంలో గొప్ప గొప్ప నిధి నిక్షేపాలున్నట్లు మనం విన్నాం కదా? ఓ పెద్ద నిధి దగ్గరకి చేరుకుని తెచ్చుకుందాం" అన్నాడు.

— అంతవరకూ వెర్రిమొర్రిగా సాగిన వాళ్ల సంభాషణ వల్ల తాను తెలుసుకోబోయే కొత్త విశేషాలు ఏమీ వుండవని భావించాడు మదనుడు. వాళ్లిద్దరూ సిద్ధాశ్రమంలో వుపాసన చేసుకుంటున్న సిద్ధుడి శిష్యులనీ, వీళ్ళెందుకూ పనికి రాని



వారనీ, స్వార్థపరులనీ తెలుసుకున్నందు వల్లనే ఆ సిద్ధుడు తన దగ్గరున్న మహిమాన్వితమైన అంజనం డబ్బీని ఇవ్వలేదనీ ఊహిస్తూ, అక్కడి నుండి లేవబోయాడు. అయితే అంతలోనే జంబులింగం "సోమూ! మనం ఆ అంజనం డబ్బీని పొందాలంటే ఒక్క పని చెయ్యాలిరా. అలా చెయ్యకుండా వూరికే ఆ సిద్ధుణ్ణి సేవిస్తుంటే, మనం జీవితకాలం పూర్తిగా గడిచిపోయినా, దానిని పొందలేం" అన్న మాటలు విని మదనుడు ఆగిపోయాడు.

సిద్ధాంజనాన్ని పొందటానికి వాళ్లేం చెయ్యాలనుకుంటున్నారో విన్న తర్వాతనే అక్కడి నుండి వెళ్లిపోవాలన్న తలంపుతో అతడు మళ్లీ వాళ్ళ మాటలనే వినటంలో నిమగ్నుడయ్యాడు.



సోమలింగం "ఆ పనేమిటో చెప్పరా! చిటికెలో చేసేద్దాం" అన్నాడు. జంబులింగం "సిద్ధుణ్ణి చంపేద్దాం" అన్న మాటను తన నోటి నుంచి వెలువరించగానే అక్కడ సోమలింగం, ఇక్కడ మదనుడు ఉలిక్కిపడ్డారు. సోమలింగం "అయ్యబాబోయ్! చంపెయ్యటమే! సిద్ధుణ్ణి చూడగానే గంగవెర్రులెత్తి గజగజలాడే వాళ్లం. మనమాపని ఎలా చేస్తాంరా?" అన్నాడు భయం భయంగా.

జంబులింగం నవ్వి "ఉపాయం వుండాలే గాని, అదెంతపని? నువ్వు "ఊ" అను ఏం చెయ్యాలో నేను చెబుతాను" అన్నాడు.

సోమలింగం "మూడేళ్ల నుంచీ నీ మాటకెప్పుడైనా ఎదురు చెప్పానటరా? అలాగే అంటున్నానుగా! ఆ ఉపాయమేదో త్వరగా అఘోరించు మరి" అన్నాడు.

జంబులింగం "ఏముందీ! ప్రతిదినంలాగే ఈ దినం కూడా ఉపాసనలో కూర్చున్నాడుగా? ఇక కాసేపటికి దాకా అలాగే కళ్లు మూసుకుని కూర్చుని ఉంటాడు. చెరో బండను తీసికెళ్లి వెనకగా నిల్చుని తలబద్దలు కొట్టేద్దాం" అన్నాడు.

సోమలింగం ఉబ్బితబ్బిబ్బవుతూ "ఆ తర్వాత తలపగిలి సిద్ధుడు చస్తాడు. అంజనం డబ్బీని కొట్టేసి ఇక్కణ్ణుంచి ఉడాయిద్దాం. మా మంచి ఉపాయమేరా? ఇంకా ఆలస్యమెందుకు? వెంటనే బయలు దేరుదాం లెగు" అన్నాడు.

జంబులింగం "ఉండు. నాకు తుమ్ము వస్తున్నది. శకునం బాగాలేదు. కొంచెం సేపు ఉండి వెళదాం" అని గట్టిగా తుమ్మాడు.

సోమలింగం విసుక్కుంటూ "ఛీ - ఛీ - అవశకునపు పక్షీ! నీకీ తుమ్ము ఇప్పుడే వచ్చి చావాలా? ఉపాయం విన్నప్పట్నుంచీ ఎప్పుడెప్పుడు వెళ్ళి సిద్ధుడి తల బ్రద్దలు కొట్టేద్దామని ఆరాటంతో నేను తన్నుకు చస్తూంటే" అన్నాడు. జంబులింగం "చీటికీ మాటికీ చావుపేరెత్తకురా. అదీ అపశకునమేగా? నీ నోటికి అదొక వూతపదమై పోయింది" అన్నాడు.

మదనుడు ఇక వాళ్ల చెత్త సంభాషణ వినవసరం లేదని అక్కణ్ణుంచి లేచాడు.

ఎక్కడో వుపాసన చేసుకుంటూన్న సత్పురుషుడైన సిద్ధుణ్ణి చంపటానికి పథకం వేసుకున్న ఆ పాపాత్ములిద్దరినీ కరవాలంతో నరికి పారెయ్యాలని

పడి మీద చెయ్యివేశాడు. అంతలోనే అతడికి మరో ఆలోచన వచ్చింది.

వీళ్ళిద్దరూ పాపం చెయ్యాలనుకున్నారే గాని, ఇంకా అది చెయ్యలేదు. ఒకవేళ వాళ్లకు ఈలోగా మనసులు మారి ఆ దుర్మార్గం చెయ్యకపోతే?

... అప్పుడు నిష్కారణంగా వీళ్లను చంపిన పాపం తనకు చుట్టుకుంటుంది. అందువల్ల వీళ్లనిక్కడ చంపకూడదు!

ఆ విధంగా నిర్ణయించుకుని, తనలో ఓ వ్యూహ మెదలగా దానిని ఆచరణలో పెట్టడానికి మదనుడు అక్కడి నుండి వెనుతిరిగి సిద్ధాశ్రమం వేపుగా గబగబా నడక సాగించాడు.

జంబులింగం, సోమలింగం మరికాసేపు వెర్రిముర్రిగా తమ తమ ధోరణులలో తాము మాట్లాడుకుని, ఆ తర్వాత అక్కడి నుంచి లేచారు. ఆశ్రమాన్ని సమీపిస్తూ దారిలోనే ఇద్దరూ చెరో బండరాయినీ చేతుల్లో వుంచుకున్నారు.

ఆశ్రమ ముఖద్వారం దాటి సిద్ధుడి కుటీరం దగ్గరికి వచ్చారు. ఇద్దరూ పిల్లుల్లా పొంచి పొంచి ముందుకు చూస్తూ, ఏ మాత్రం శబ్దం కాకుండా అడుగులో అడుగు వేసుకుంటూ లోపలికి వచ్చారు.

అంతకు ముందు దేదీప్యమానంగా వెలుగుతూన్న దీపం, వత్తి తగ్గించబడి సన్నని కాంతిలో వెలుగుతున్నది.

జంబులింగం, సోమలింగం, సిద్ధుడి వెనకగా చేరి, అంగవస్త్రం కప్పబడినట్లున్న తలమీద తమ చేతుల్లోని బండరాళ్లతో బలంగా మోదారు.

అయితే, ఆ ఇద్దరు ధూర్తులు అనుకున్నట్లుగా అది సిద్ధుడి తల కాదు. యోగ దండానికి





మరొక కర్రను జోడించి, వాటిపైన వుంచబడిన ఒక చిన్న కుండ. దానిమీద సిద్ధుడి అంగవస్త్రం కప్పబడి ఉన్నది. మసకగా వెలుతురు కావటం వల్ల అక్కడ నిజంగా సిద్ధుడే కూర్చుని వున్నాడనీ, అంగవస్త్రం క్రిందిది అతడి తలేనని భావించిన జంబులింగం, సోమలింగం కొట్టిన బండ దెబ్బలకు ఆ కుండ పెంకులు పెంకులుగా చిందరవందరవుతూ క్రింద పడింది. యోగదండం ఒకవేపూ, దానిని ఆనుకుని నిలబెట్టబడిన కర్ర ఒకవేపూ క్రింద పడిపోయింది. వాటిని కప్పివేసిన సిద్ధుడి తెల్లని పంచె జంబులింగం, సోమలింగంలను వెక్కిరిస్తూ ప్రక్కన పడింది. ఊహించని విధంగా అక్కడ ఆ పరిస్థితి ఎదురుపడటానికి జంబులింగం, సోమలింగం కంపరమెత్తిపోయారు.

సోమలింగం "ఒరే జంబులింగం! సిద్ధుడు మనల్ని మోసం చేసి, ఇక్కడ తాను కూర్చుని వున్నట్లు భ్రమ కల్పించాడురా" అన్నాడు.

వెంటనే సిద్ధుడు నిప్పులు కక్కుతూన్న కళ్లతో వాళ్ళిద్దరినీ చూస్తూ కుటీరం తడిక చాటు నుంచి బైటికి వచ్చాడు.

అంతవరకు సిద్ధుడితో బాటు తాను కూడా తడిక చాటున నిల్చుని ఆయా విశేషాలను చూస్తున్న మదనుడు కూడా సిద్ధుడితో బాటు అక్కడికి వచ్చాడు.

హఠాత్తుగా తనను చూసి నిరుత్తరులై నిల్చున్న జంబులింగాన్ని సోమలింగాన్ని కోపదృష్టులతో చూస్తూ "ఓరీ, పాపాత్ములారా! మూడు సంవత్సరాల క్రిందట ఆశ్రయం కోరి నా ఆశ్రమానికి వచ్చి ఇంత కాలం నుంచి దుర్బుద్ధితో ఇక్కడున్నారన్న మాట. మీ వంటి పాతకులు భూమికి చేటు. బూడిదైపొండి" అని చేతిని వాళ్లవైపు సాచాడు.

మరుక్షణం - సిద్ధుడి సంకల్ప శక్తి వల్ల అతడి చేతి నుంచి ఆవిర్భవించిన అగ్నిజ్వాలలు విసురుగా ముందుకు వెళ్లి జంబులింగాన్ని, సోమలింగాన్ని సోకాయి. వెంటనే ఇద్దరి శరీరాలు భగభగ మండుతూండగా, ఆర్తనాదాలు చేస్తూ జంబులింగం, సోమలింగం గిరగిర తిరుగుతూ కొంతసేపటికి రెండు బూడిద కుప్పలుగా మిగిలిపోయారు.

ఆ తర్వాత సిద్ధుడు మదనుని వేపు తిరిగాడు. భక్తి వినయాలతో తనకు నమస్కరిస్తూన్న ఆ

రాజపుత్రుణ్ణి ప్రేమగా కౌగిలించుకుని, వాత్స ల్యంతో చూస్తూ "నాయనా! ఉపాసనలో వున్న వాడిని వున్న పళంగా ఆ దుష్టుల చేతిలో బ్రహ్మ కపాలం పగిలి ఈపాటికి మరణించి వుండేవాడిని. వాళ్ల దుష్టమైన ఆలోచనను నాకు తెలియజేసి, లోకోపకారం కోసం వినియోగపడే నా ప్రాణాలను నిలబెట్టావు. నువ్వెవరివి? నావల్ల నీకేం కావాలి? నిస్సంకోచంగా అడుగు" అన్నాడు.

మదనుడు జాలిగా ఆ సిద్ధుడి కళ్లలోకి చూస్తూ "స్వామీ! దురదృష్టవంతుడినో, అదృష్ట వంతుడినో అర్థం కాకుండా వున్నది. నా వృత్తాంతం వివరిస్తాను. ప్రస్తుత పరిస్థితిలో నాకు మీ వల్ల సహాయం ఏమిటో మీరే తెలుసు కుంటారు" అని సంగ్రహంగా తన కథనంతటినీ వివరించాడు. అంతా విన్న తర్వాత సిద్ధుడు ఆశ్చర్యంతో, ఆనందంతో చూస్తూ "ఏమిటీ నువ్వు ప్రభావతి కుమారుడివా?" అన్నాడు.

సిద్ధుడి మాటలకు విస్మయిస్తూ, "మీకు మా తల్లిగారు తెలుసా స్వామీ!" అన్నాడు.

సిద్ధుడు తల వూగిస్తూ "ఆ పుణ్యాత్మురాలు ఇప్పటికి పదిహేను సంవత్సరాల క్రిందట మా గురువు గారి దగ్గరికి వచ్చింది నాయనా! అప్పటికే కొంతకాలం నుంచి యోగులను, సిద్ధులను, మహనీయులను సేవిస్తూ వచ్చిన ప్రభావతి నా తోబుట్టువులా మసలుకుంటూ గురువు గారికి శుశ్రూషలు చేసింది. గురువుగారి దగ్గర కొన్ని యోగ విద్యలు తెలుసుకుని, ఆ తర్వాత ఎక్కడికో వెళ్లిపోయింది. నేనప్పుడే అనుకున్నాను - ఆ తల్లి తాను అన్నది సాధించి తీరుతుందని! పునర్జన్మ వంటి ద్వితీయ జన్మను ఈ జన్మలోనే



నీకు సిద్ధింపజేసిన ఆ రాజయోగిని ఏ కారణం వల్ల ప్రస్తుతం కనుమరుగైనదో ఆ ఈశ్వరుడికే తెలియాలి. ఇక - నీ వృత్తాంతం విన్న తర్వాత, నిన్ను ఆశీర్వదించటం కంటె నేనేమీ చేయలేక పోతున్నాను. ప్రాణులకు సృష్టికర్త విధించిన కొన్ని ప్రారబ్ధ కర్మలను అనుభవించక తప్పదు కదా? అందువల్ల ఆ విషయంలో నేని జోక్యం కలిగించుకోగూడదు! ఇప్పుడు నువ్వు కాలంధర అనే మంత్రెగత్తె కోటకి వెళ్లాలి కదా? నా దగ్గర వున్న సిద్ధాంజనాన్ని నీకు ఇస్తాను. దానిని ఒకసారే ప్రయోగించాలి. రెండవసారి పనికిరాదు. ఈ విషయం గుర్తుంచుకుని ప్రవర్తించు. శుభమస్తు" అని తనదగ్గరున్న అంజనం డబ్బీని మదనునికి ఇచ్చాడు.

మదనుడు సిద్ధుడికి పాదాభివందనం చేసి, అక్కడి నుండి బయలుదేరాడు. పర్ణశాల ఆవరణ ముఖ ద్వారం బైటికి వచ్చి, అక్కడ పచ్చికలో తనకోసం ఎదురుచూస్తూ సిద్ధంగా ఉన్న గుర్రాన్ని సమీపించి దాన్ని అధిరో హించాడు.

ఆ తర్వాత - సిద్ధుడు ప్రసాదించిన డబ్బీలోని అంజనాన్ని తన రెండు చేతులతో తీసుకుని రెండు పాదాలకు రాసుకున్నాడు. కళ్లు మూసు కుని తాను కాలంధర కోట ముందు ఉండాలని కోరుకుని, తిరిగి కళ్లు తెరిచాడు. అయితే అతడికి కనుచూపు మేరలో కాలంధర కోట కనిపించలేదు! ... అంజనం పనిచేయలేదేమో అనుకోవటానికి వీలు లేకుండా అక్కడ సిద్ధాశ్రమం కూడా లేదు. మొత్తానికి తాను ఎక్కడికో వచ్చాడు. ఎదురుగా ఓ పల్లెటూరు కనిపిస్తున్నది! కాలంధర కోటకి దగ్గరగా చేర్పించమంటే, అంజనం తనను గుర్రంతో బాటు ఈ పల్లెటూరు ముందరి కెందుకు చేర్పించిందో అర్థం కాక - మదనుడు ఆలోచిస్తూనే తన గుర్రాన్ని సావదానంగా ఎదురుగా కనిపిస్తున్న ఆ గ్రామానికేసి నడిపించ సాగాడు.

—(ఇంకావుంది)








## 19

[జరిగినకథ: పడమటి దిశగా వెళ్ళిన మదనుడు మూడవరోజున ఓ సిద్ధాశ్రమం చేరుకుంటాడు. ఆ ఆశ్రమంలోని సిద్ధుడు ఉపాసనలో విలీనుడై ఉన్నందున, అలా కాస్త తిరిగి వద్దామని వెళ్ళిన మదనునికి, దగ్గర్లోనే ఇద్దరి మాటలు వినిపిస్తాయి. వారి మాటల్లో ఆ ఆశ్రమంలోని సిద్ధుణ్ణి చంపేయాలనుకోవటం, ఆ వ్యక్తులిద్దరూ ఆ సిద్ధుని శిష్యులేననీ తెలుసుకుంటాడు. ఈ విషయం ముందుగా వెళ్ళి ఆ సిద్ధునికి తెలిపి, అతని ప్రాణాన్ని రక్షిస్తాడు. సిద్ధుడు మదనునికి కృతజ్ఞత తెలిపి, అతని వివరాలడిగి పదేళ్ళ క్రితం తన గురువుగారికి సేవలుచేసి, కొన్ని యోగవిద్యలు నేర్చుకుని వెళ్ళిన ప్రభావతీదేవి కుమారుడే ఈ మదనుడని తెలుసుకుంటాడు. తర్వాత తన దగ్గరున్న అంజనాన్ని అతనికిచ్చి దీవిస్తాడు. మదనుడు గుర్రాన్ని అధిరోహించి సిద్ధుడిచ్చిన అంజనాన్ని తన కాళ్ళకు రాసుకుని, కళ్ళు మూసుకుని కాలంధర కోటముందు ఉండాలని కోరుకుని, కళ్ళు తెరుస్తాడు. కాని అతని ముందు కాలంధర కోటకు బదులు ఒక గ్రామం కనిపిస్తుంది. అర్థంకాని మదనుడు ఆ గ్రామం వైపు తన గుర్రాన్ని నడిపిస్తాడు....ఇలాగే తూర్పు దిశగా వెళ్ళిన వీరసింహుడు మూడవనాటి సాయంత్రానికి ఓ పట్టణం చేరుకుంటాడు... ఇక చదవండి]

మూడు బాటల కూడలి నుండి తూర్పు దిశగా వెళ్ళే బాటమీద ప్రయాణిస్తూ వెళ్ళిన వీరసింహుడు అక్కడక్కడ మజిలీలు చేస్తూ, కాలంధర మాంత్రికురాలు వుండే చోటును గురించి విచారిస్తూ మూడవనాటి సాయంత్రానికి ఓ పట్టణం చేరుకున్నాడు.

ఆ రాత్రికి అక్కడ బసచేసి, ఉదయాన్నే ప్రయాణం కొనసాగించవచ్చునని. తలపోస్తూ, అతడు ఓ పూటకూళ్ళ అవ్వ ఇంటికి వెళ్లాడు.

అతని ఆకారం చూసి ఎవరో గొప్పింటి బిడ్డడై వుంటాడని భావించిన అవ్వ ఆ రాత్రి షడ్రసోపేతమైన భోజనం పెట్టింది.

భోజనం తర్వాత వీర సింహుడు తన మెడలోని ఆభరణాల్లో ఒక దానిని తీసి అవ్వకు బహుమతిగా ఇచ్చాడు. అవ్వ అతణ్ణి పెద్దగా పొగడుతూ, ఓ చక్కటి గదిలో పడక ఏర్పాటు చేసింది.



వీరసింహుడు ప్రయాణపు బడలికవల్ల పాన్పుమీద చేరిన కొద్దిసేపటికే నిద్రపోయాడు. నిద్రలో ఏవేవో కలలు వస్తూ, అతణ్ణి చిరాకు పర్చసాగాయి. కొంతసేపు అటూ ఇటూ పొర్లి పడుకుంటూ, చివరకు అర్ధరాత్రిని సూచిస్తూ కోటలో ఘంట మ్రోగుతున్న సమయంలో నిద్ర పూర్తిగా పాడుకాగా - పాన్పు మీద లేచి కూర్చున్నాడు.

అవ్వ పూటకూళ్ల ఇల్లు రాజమందిరం వున్న వెనుక వీధిలో ఉన్నది. వీరసింహుడు పాన్పు దిగి, తనకు నిద్రాభంగం కలిగించిన కలలోని మంచిచెడ్డలను గురించి ఆలోచిస్తూ అటూ ఇటూ గదిలో పచార్లు చేయసాగాడు.

కలల్లో పాములు కన్పించటం, వాటిలో తనకు పరిచయం కావటం మంచో చెడో అతడు ఊహించలేకపోయాడు.

ఆలోచిస్తూనే కిటికి దగ్గరికి వెళ్ళి, గాలికోసం కిటికి రెక్కలను తెరిచాడు.

ఎదురుగా కన్పించిన దృశ్యం అతన్ని ఆశ్చర్యంలో ముంచెత్తింది.

రాజమందిరం వెనక భాగంలోని ప్రహరీగోడ మీది నుంచి ఓ స్త్రీ ఆకారం క్రిందకు దూకుతూ అతడి దృష్టి పథంలో పడింది!

ఆ స్త్రీ ఎవ్వరో, ఎందుకలా రహస్యంగా రాజమందిరం నుంచి బైటపడుతున్నదో తెలుసుకోవాలన్న ఆతురత అతడిలో హెచ్చింది.

వీరసింహుడు చూస్తూండగానే ఆ స్త్రీ ఆకారం క్రిందికి దూకి అటూ ఇటూ చూసింది. ఎవ్వరూ తనను పసికట్టలేదని గ్రహించగానే, ప్రాకారం ప్రక్కగా గబగబా అడుగులు వేసుకుంటూ ముందుకు సాగిపోయింది.

ఆమె అవ్వ ఇంటి ముందు భాగంలోని ప్రహరీ దగ్గరికి రాగానే సూదంటురాళ్ళ వంటి తన చూపులను వీరసింహుడు మరింత సునిశితం చేసి, ఆమె మీదికి పరగింపజేశాడు.

పదహారు సంవత్సరాల వయస్సులో ఉన్న ఓ అందాల బొమ్మనుగా ఆ ఆకారాన్ని గుర్తించాడు అతడు. ఆమె ధరించిన దుస్తులు, ఆభరణాల తీరును పరిశీలిస్తే, అతనికామె ఓ రాకుమారిలా అనిపించింది.

ఒక దేశానికి అధికారియైన వ్యక్తి కూతురు ఎందుకలా భయంభయంగా అటూ ఇటూ

చూస్తూ నడుస్తున్నది? ఈ అర్ధరాత్రి సమయంలో ఎక్కడికి వెళుతున్నది?

కుతూహలాన్ని అణచుకోలేని వీరసింహుడు వెంటనే పాన్పు దగ్గరకు నడిచాడు. ప్రక్కనే ఉన్న ఓ పీఠం మీద వుంచబడిన కరవాలసహితమైన ఒరను తీసుకున్నాడు. దానిని నడుముకు బిగించుకుని, గది వాకిలి దగ్గరికి గబగబా నడిచాడు.

ఆ గదికి రెండు తలుపులున్నాయి.

ఒకటి ఇంట్లోకి వెళ్ళటానికీ, మరొకటి బైటికి వెళ్ళటానికీ?

వీరసింహుడు బైటికి వెళ్ళటానికి ఏర్పరచ బడిన తలుపు తీసుకుని, నిశ్శబ్దంగా ముందుకు నడిచాడు. ఆ వీధి నిర్మానుష్యంగా ఉన్నది. రాజమందిరం నుండి బైటపడిన యువతి అతడికి కనిపించలేదు. చరచరా ప్రహరీ దగ్గరికి నడిచి, అక్కడికి సమీపంలో ఉన్న మలుపు దగ్గరికి చేరాడు.

అంతక్రితమే మళుపు తిరిగిన యువతి క్రీనీడలలో నడుస్తూ కోట దక్షిణం బురుజు వేపుగా వెళ్లటం వీరసింహుడు గమనించాడు.

వెంటనే తను కూడా చాటు చాటుగా నడుస్తూ ఆమెను సమీపించాడు. యువతి బురుజు దగ్గ రికి వెళ్లి మెట్ల మీదుగా పైకి వెళ్లటం ప్రారంభించింది.

ఆ దరిదాపుల్లో కాపలా వాళ్లెవరూ లేకపోవటం గమనించిన వీరసింహుడు తనుకూడా బురుజు మెట్లెక్కుతూ పైకి వెళ్ళసాగాడు. యువతి బురుజు పైకెక్కి అటు ప్రక్కన వున్న మెట్లంబడి క్రిందికి దిగింది.





వీరసింహుడు కూడా బురుజు పైకి చేరుకోగానే అటు ప్రక్క మెట్ల మీదుగా క్రిందికి చేరాడు. అతడు చూస్తూండగానే ఆ యువతి అక్కడికి సమీపంలోని ఓ వనంలోకి చరచరా నడుచుకుంటూ వెళ్లింది. తనలో వుత్కంఠత అంతకంతకు అధికం అవుతూండగా, వీరసింహుడు కూడా గబగబా అడుగులు వేసుకుంటూ వనంలోకి వెళ్లాడు. రకరకాల పూలతీగెలతో, ఫలవృక్షాలతో నిండి ఆ వనం ఎంతో ఆహ్లాదకరంగా వున్నది. యువతి ఆ వనం మధ్యలోని ఓ పెద్ద మర్రిచెట్టు దగ్గరికి వెళ్లి, తనతో తీసికెళ్లిన ఓ బంగారు గిన్నె మూత తీసి క్రింద వుంచింది.

చెట్లుచాటుగా ఆమెను అనుసరిస్తూ వెళ్లి, సమీపంలోని ఓ మందారం చెట్టు మొదట వెనక దాగిన వీరసింహుడు కన్నార్పకుండా ఆమె చేష్టలనే గమనించసాగాడు.

అంతలో - మర్రిచెట్టు తొర్రలోంచి సన్నని వెలుతురు పైకి విరజిమ్మటం ప్రారంభించింది. ఆ వెలుతురులో తాను ఎంత మాత్రం బయల్పడ కూడదని భావించిన వీరసింహుడు, మందారం చెట్టు మొదలుకు అతుక్కుపోయినట్లు నక్కి దాక్కున్నాడు.

మర్రిచెట్టు తొర్రలోంచి వెలుతురు క్రమక్రమంగా అధికం కాసాగింది. వీరసింహుడు వూపిరి సైతం బిగబట్టి ఆ వెలుతురు ప్రసరిస్తూన్న మర్రితొర్ర వేపే చూస్తుండిపోయాడు.

కొంతసేపటికి శిరస్సు మీద ఓ మణి దేదీప్యమానంగా వెలుగుతూ, ఆ పరిసర ప్రదేశమంతటినీ వెలుతురుతో నింపుతూండగా చూడచక్కని శరీరాన్ని మెలికలు త్రిప్పుతూ ఓ నాగిపాము బైటికి వచ్చింది! కలలో పాములు ఎందుకు కన్పించాయో వీరసింహుడికి అప్పుడర్థమైంది. కొన్ని కలలు భవిష్యత్తును సూచిస్తాయని శాస్త్రం చెబుతుంది. మరి, కలలో పరిచయమైనట్లే ఈ పాము తనకు పరిచయం అవుతుందా?

క్షణక్షణం ఉత్కంఠభరితంగా ఇంతవరకు జరిగిన సంఘటనలలాగే, ఇంకా ఏమేం జరుగుతాయో తెలుసుకోవాలన్న తహతహతో అతడక్కడే స్థాణువులా నిలబడి చూస్తూండిపోయాడు!

తొర్రలో నుండి బైటికి వచ్చిన పాము చరచరా క్రిందికి ప్రాకుతూ వచ్చింది. అలా వచ్చిన వెంటనే మర్రిచెట్టు మొదలు చుట్టూ ముమ్మారు

ప్రదక్షిణం చేసింది. ఆ తర్వాత - కన్నీటితో తననే చూస్తున్న యువతి దగ్గరికి వచ్చింది. పాము తనను సమీపించగానే యువతి తాను తెచ్చిన గిన్నెముందు మోకాళ్ల మీద కూర్చున్నది.

పాము పడగవిప్పి, శరీరాన్ని కొద్దిగా పైకి లేపి, నోటితో ఆ యువతి నుదుటి మీద ముద్దు పెట్టుకున్నది.

ఆ తర్వాత బంగారు గిన్నెలోని పాలను పూర్తిగా త్రాగింది. యువతి తననే జాలిగా చూస్తుండగా పాము మనుష్య వాక్కులతో "సువర్ణా! నాకు సంక్రమించిన పాపంవల్ల ప్రతిదినం అర్ధరాత్రివేళ కొంచెంసేపు సంచారశక్తి కలిగి వుంటాను. అది కూడా నాగుపాము రూపంలో! ఈ సమయంలో మనోహరుణ్ణీ; అతడు స్వంత చెల్లెలుగా భావించే నిన్నూ కలుసుకుంటూన్న తృప్తి మాత్రమే నా జీవితానికి మిగులుతున్నది. కాని, ప్రతిదినం అర్ధరాత్రివేళ ఎవరికి తెలియకుండా రహస్యంగా పాలు తీసుకొనివచ్చి నా ఆకలి తీరుస్తూన్న నీకు ఎప్పుడైనా ఎవరివల్లనైనా ఏదైనా కీడు జరుగుతుందేమోనని భయంగా కూడా వున్నది. దిక్కు దిక్కులనూ శాసించగల దేశాధీశ్వరునికి ఒక్కగానొక్క కూరిమిగారాల పుత్రికవైన నీకు నా వల్ల ఈ అర్ధరాత్రి వేళ సంచార ఖర్మ పట్టింది" అన్నది పాము.

సువర్ణ జాలిగా ఆ పామునే చూస్తూ "సుచిత్రా! నీ శాప రహస్యం ఎవరికీ మనం చెప్పకూడదని కూడా యోగిని అన్నది కదా? అందువల్లనే నేను ఇలా రావలసి వస్తున్నది. లేకపోతే నా తండ్రికి వివరంగా అంతా చెప్పి, ఆయన అనుమతితో రక్షక భటులను వెంటబెట్టుకునే వస్తూండేదానిని కదా? నన్ను గురించి నువ్వు బాధపడకు...నీకు





మా తండ్రిగారికి, శాపవిముక్తిని నిర్దేశిస్తూ యోగినీమాత చెప్పిన గడువు కూడా సమీపిస్తున్నది ఏ రోజులోనైనా మీకు మంచి జరగవచ్చు" అన్నది.

పాము "ఏమో? త్యాగంలో విక్రమార్కుని వంటి గుణం కలిగిన ఉత్తమ క్షత్రియ వంశీయుడైన యువకుడు తనంతట తానుగా ఇక్కడికి రావాలి గదా? ఎవరితోనైనా మన బాధలు చెప్పుకుందామన్నా శాపం సంగతి ఇతరులకు తెలియకూడదన్న నియమాన్ని యోగిని విధించింది కదా?" అన్నది.

అంతవరకు ఉత్సుకతతో, ఉద్వేగంతో వాళ్ల మాటలను వింటూన్న వీరసింహుడు, ఉత్తమ క్షత్రియ వంశానికి చెందిన యువకుడు ఏ త్యాగం చేస్తే వాళ్ల బాధలు తీరుతాయో తెలుసుకోగలిగితే, తన జన్మ ధన్యమవుతుందని భావించాడు.

ఆ సమయంలో - నల్లని ఆకారం కలిగిన ఓ పెద్ద పాము ఆ పరిసర ప్రాంతం ప్రతిధ్వనించేటట్టు బుసలు కొడుతూ అక్కడికి వచ్చింది. ఆ పాము అక్కడికి రాగానే మొదటి పాము భయంతో వొణకసాగింది.

సువర్ణ రాకుమారి ఆ నల్లపామును చూడగానే, తన మిత్రురాలు ఎందుకలా భయపడుతున్నదో అర్థం కాక అయోమయంగా చూడసాగింది. నల్ల పాము మొదటిపాముకు మరింత దగ్గరగా వచ్చి "సుచిత్రా! నన్ను కాదని మా క్రింద బ్రతికే రత్నపాలుణ్ణి ప్రేమించినందుకు ఇప్పుడు ఫలితం అనుభవింపజేయటానికే వచ్చాను. నువ్వు నాగుబాముగా వుండగానే నీతో బలాత్కార సౌఖ్యం అనుభవిస్తాను. ఇక్కడ నన్నెవరు అడ్డుకుని నిన్ను కాపాడుతారో చూస్తాను." అని ఒక్క ఉదుటున మీదకు దూకింది.

నాగుబాము చటుక్కున ప్రక్కకు తప్పుకుని "సువర్ణా! ఈ దుష్టుడి వల్ల ఆపద కలిగినా కలుగవచ్చు. దయచేసి ఇక్కడనుండి వెళ్లిపో. రేపటినుంచి పాలు తీసుకుని రావద్దు. ఆకలితో నేను మరణించినా పర్వాలేదుగాని, నీ వంటి మిత్రురాలికి నా వల్ల చెడు జరగకూడదు" అంటూనే మర్రిచెట్టు మొదలు దగ్గరికి ప్రాకసాగింది.

నల్లపాము "ఓహో, ఆ అందాలరాశి నీ మిత్రురాలా? పాము రూపంతో మొదట నీతో సుఖించి, ఆ తర్వాత నా రూపంతో ఆ పరువాల పడతి వసందును విందు చేసుకుంటాను" అంటూ చటుక్కున ఒక్క ఉదుటుతో నాగుబాము

పదకు దూకింది.

నిస్సహాయంగా నల్లపాము చేతిలో చిక్కి గిలగిలలాడుతున్న తన స్నేహితురాలైన నాగుబామును దీనంగా చూస్తూ నిశ్చేష్టురాలైంది రాజకుమారి సువర్ణ.

ఆ చర్యలన్నిటినీ వీక్షించిన వీరసింహుడు ఇక తాను బయల్పడటంలో దోషం లేదని భావించాడు.

మరుక్షణం జరాలున ఒరనుంచి కరవాలం దూసి మందారం చెట్టు చాటునుంచి మర్రి చెట్టు మొదలు దగ్గరికి పరుగెత్తాడు. హఠాత్తుగా ఖడ్గహస్తుడై అక్కడికొక వీరయువకుడు రావటానికి విస్తుపోతూ, సువర్ణ ఆనందంతో అతడినే చూడసాగింది.

నాగుబామును ఆక్రమించి పట్టుకున్న నల్లపాము శరీరం మీద కత్తిమొనతో పొడుస్తూ "ఇది పాము రూపం! నిజరూపమేదో వున్నదన్నావే? దానిని చూపించరా; వీరత్వం ఏ కోశానాలేని పిరికి పందా?" అన్నాడు.

వెంటనే నల్లపాము బుసలు కొడుతూ, నాగుబామును విడిచి తీవ్రదృష్టులతో వీరసింహుణ్ణి చూస్తూ "నేను పిరికిపందను కానురా మానవాధమా! పాతాళలోక ప్రభువైన కాలకేతు కుమారుణ్ణి - ధూమ్రకేతుణ్ణి" అంటూ పాములరూపం విడిచి రాక్షస యువకుడుగా మారిపోయాడు.

అలా నిజరూపం ధరించిన వెంటనే పెద్ద రంపం వంటి ఓ పొడవైన కత్తి అతడి చేతిలోకి వచ్చింది. దానిని పైకెత్తి వీరసింహుణ్ణి వ్రేయబోగా రెప్పపాటు కాలంలో తన ఖడ్గాన్ని ధూమ్రకేతుడి కత్తికి అడ్డుపెట్టి "నేను మానవాధముణ్ణి కాదురా,



అదమ కార్యాలు చేసే నీచ రాక్షసాధమా! సుక్షత్రియ వంశానికి చెందిన మణిపుర మహారాజు శూరసేన ప్రభువు పుత్రుణ్ణి - వీరసింహుణ్ణి! నీ పాపం పండినందుననే ఈ అర్ధరాత్రి అసహాయు రాలైన అబలను హింసిస్తూ నాచేత చిక్కావు. నిజమైన వీరుడివైతే చివరదాకా నాతో పోరాడు'' అని ఒక్క నెట్టు వెనక్కి నెట్టాడు.

ధూమ్రకేతుడు రెండడుగులు వెనక్కి తూలి, మళ్ళీ కత్తి త్రిప్పుతూ వీరసింహుని మీదికి వచ్చాడు.

ఖడ్గ విద్యలో తనకు గల నేర్పు ఏర్పడేట్టు చిత్ర విచిత్రంగా తన చేతిలోని కరవాలాన్ని భయంకరంగా ఝుళిపిస్తూ వీరసింహుడు ధూమ్రకేతునితో భీకర సమరం చేశాడు.

మర్రి మొదలు నుంచి వీరసింహుడి మాటలను ఆనందంగా విన్న నాగుబాము బిరబిరా సువర్ణ దగ్గరికి వచ్చి, పడగ విప్పుకుని సువర్ణతోబాటు వీరసింహుని ఖడ్గ విద్యా కౌశల్యాన్ని కన్నుల పండువుగా చూడసాగింది.

ఒకరి కత్తినొకరు దట్టించుకుంటూ, సమయం చూసి ఒకరినొకరు దెబ్బ తీయాలని ప్రయత్నిస్తూ ఆ వనంలో ఆ అర్ధరాత్రి సమయంలో ధూమ్ర కేతుడు, వీరసింహుడు, చాలాసేపు భీషణ సంగ్రామాన్ని కొనసాగించారు.

కొంతసేపటికి ధూమ్రకేతుడి శౌర్యం వీరసింహుని పరాక్రమం ముందు తెల్లమొగం వేసింది.

అంతకంతకు ధైర్యోత్సాహాలతో పురవడించి పోతూన్న వీరసింహుడు కొదమ సింహంలా విజృంభించాడు.

క్రమంగా ధూమ్రకేతుడు వీరసింహునితో పోరాడటం అటుంచి, అతడి కత్తె దెబ్బలను తప్పించుకోవటానికి కూడా అశక్తుడయ్యాడు. అక్కడక్కడ తగిలిన కత్తిదెబ్బలకు శరీరమంతా రక్తంతో నిండిపోతూండగా మరి కొంతసేపటికి ధూమ్రకేతుడు పరాజితుడై ఆ ప్రాంతంలోంచి మాయమైపోయాడు. —(ఇంకావుంది)









[జరిగిన కథ: తూర్పు దిశగా వెళ్ళిన వీరసింహుడు, మూడవ రోజున ఓ పట్టణం చేరుకుని, ఒక పూటకూళ్ళ అవ్వ ఇంటిలో బస చేస్తాడు. అర్ధరాత్రి సమయంలో అతని నిద్రపాడు కాగా, గదిలోని కిటికీ దగ్గరికి వెళ్ళి నిలబడ్డ అతనికి దూరంగా కనిపించిన ఒక స్త్రీ ఆకారాన్ని చూసి వెంటనే ఆమెను వెంబడిస్తాడు. ఆ యువతి సమీపంలోని ఓ ఉద్యానవనంలో ప్రవేశించి అక్కడున్న ఒక మర్రి చెట్టు క్రింద తాను తెచ్చిన బంగారు గిన్నెను ఉంచి దాని మూత తెరుస్తుంది. అప్పుడు ఆ మర్రిచెట్టు తొర్రలోంచి శిరస్సుపై మణిని ధరించిన నాగుపామొకటి వచ్చి, ఆ గిన్నెలోని పాలను త్రాగుతుంది. చెట్ల చాటున దాగి చూస్తున్న వీరసింహుడు ఆశ్చర్యచకితుడౌతాడు. గిన్నెలోని పాలన్నీ త్రాగిన తర్వాత ఆ నాగుపాము పాలు తెచ్చిన యువతితో మనుష్య భాషలో మాట్లాడుతుంది. వారిద్దరి సంభాషణవల్ల ఆ పాలు తెచ్చినామె ఆ దేశవు రాజకుమారి సువర్ణ అనీ, నాగుపాము రూపంలో శాపగ్రస్తురాలై ఉన్నామె పేరు సుచిత్ర అనీ వీరసింహుడు తెలుసుకుంటాడు. అంతలో అక్కడికి ఒక నల్లపాము వచ్చి, మనుష్య భాషలో మాట్లాడి, పాము రూపంలోని సుచిత్రని బలాత్కారం చేయబోతుంది. ఇక ఆలస్యం చేయకూడదని వీరసింహుడు కరవాలం దూసి, ఆ మర్రి చెట్టు వద్దకు పరిగెత్తాడు. అప్పుడు ఆ నల్లపాము రాక్షస యువకుడిగా మారి, తను పాతాళ ప్రభువైన కాలకేతుని కుమారుణ్ణని చెప్పి, వీరసింహునితో భీకరంగా ఖడ్గయుద్ధంచేసి, పరాజితుడై అక్కడి నుంచి మాయమైపోతాడు. ఇక చదవండి]

వీరసింహుడు కాలనేమి పుత్రుడైన ధూమ్రకేతుణ్ణి పరాజితుణ్ణి చేసి తరిమి వెయ్యగానే సువర్ణ అతడికి రెండు చేతులూ జోడించి నమస్కరించింది. నాగుపాము ప్రాకుతూ వచ్చి అతడి పాదాల మీద తల వుంచింది. వీరసింహుడు కరవాలాన్ని ఒరలో ఇముడ్చుకుని, తన పాదాల ముందున్న పామును రెండు చేతులతో ఆప్యాయంగా చేరదీసుకున్నాడు.

అతడు జాలిగా ఆ పామును చూస్తూ "చెల్లీ! నాగురూపంలో వున్న నువ్వెవరివో తెలియదుగాని, నీ వెనక అద్భుతమూ, విషాదభరితమూ అయిన కథ వున్నదని మాత్రం తెలుసుకున్నాను. ఇంతకు ముందు నువ్వూ, నీ స్నేహితురాలు మాట్లాడుకున్న మాటలను బట్టి నేను నీకు ఉపకారం చెయ్యటానికి అర్హుడిననే అనుకుంటున్నాను. నేనిక్కడికి ఎవ్వరి ప్రేరణవల్లనూ రాలేదు. నాయంతకు నేనుగా రావటం కూడా నీ శాపవిముక్తికి తోడ్పడు-

కిరణ్ కుమారి



తుంది. చెప్పమ్మా! నువ్వెవరు? నీకీ శాపం ఎలా ఎవరివల్ల సంక్రమించింది?" అని అడిగాడు.

తన స్నేహితురాలిని, తనను, ఓ దుష్టుడి బారినుంచి రక్షించటమే కాకుండా పైపెచ్చు శాపవిముక్తికి కూడా తోడ్పతానంటున్న వీరవరుని ఉపకారగుణాన్ని మనస్సులోనే స్తుతించుకుంటూ, సువర్ణ ఆనందంతో అతడినే చూడసాగింది.

నాగుబాము "అన్నయ్యా! నేను గంధర్వరాజైన చిత్రసేనుడి పుత్రికను. నా పేరు సుచిత్ర. చిత్ర అనే పేరుగల నా అక్కతో కలిసి అప్పుడప్పుడు నేను భూలోక విహారానికి వచ్చేదానిని. వసుమతీ నగరానికి సమీపంలో వున్న ఈ వనం మమ్మల్ని ఆకర్షించటంతో తరుచుగా ఇక్కడికే వస్తూండేవాళ్లం. ఈ సువర్ణరేఖ వసుమతీ పురానికి ప్రభువైన కీర్తిసేన మహారాజు పుత్రిక. ఒకనాడు చెలులతో కలసి తాను కూడా ఈ వనానికే విహారానికి వచ్చి, మాకు పరిచయమైంది. అంతకుముందు అప్పుడప్పుడు భూలోకానికి వచ్చే మాకు, సువర్ణ పరిచయం కావటంతో ప్రతిరోజూ వచ్చే వాళ్లం. సువర్ణ నాకు, మా అక్కకు ప్రాణస్నేహితురాలుగా అయింది. ఆ తర్వాత - ఒకనాడు నాగలోక ప్రభువు, మా నాన్నగారికి మిత్రుడు అయిన మణిమంత్రుడు తన కుమారుడైన రత్నపాలుడితో కలిసి మా మందిరానికి వచ్చాడు. ఆ తండ్రీ కొడుకులకు అతిధి సత్కారాలు చెయ్యటానికి మా తండ్రి మమ్మల్ని నియోగించాడు. నవ యౌవనంతో పోటీపడే అందానికి తోడు వినయమూ, సద్గుణమూ కలిగిన రత్నపాలుణ్ణి నేనూ, మా అక్కా ప్రేమించాము. అతడు కూడా మమ్మల్ని ప్రేమించాడు.

పాతాళలోకంలో ఏవో దుష్టశక్తులు చెలరేగుతున్నాయనీ, వాటిని గురించి మాట్లాడటానికి తన తండ్రి మా తండ్రి దగ్గరికి వచ్చారనీ రత్నపాలుడు మాతో చెప్పాడు. రెండురోజులు పెద్దవాళ్లు వాళ్ల సమాలోచనల్లో వాళ్లుండగా మేము రత్నపాలునితో కలసి మా ఉద్యానవనంలో విహరించే వాళ్లం. మర్నాడు తండ్రితో కలిసి తమ లోకానికి వెళుతున్నట్లు రత్నపాలుడు మూడవ రోజున చెప్పగానే నేనూ, మా అక్కా దిగులు పడ్డాం. అప్పుడు రత్నపాలుడు మరెక్కడైనా కలుసుకునే ఏర్పాటు చెయ్యమని మమ్మల్ని కోరాడు. మా అక్క వసుమతీ నగర రాజపుత్రికయైన

సువర్ణ మాకు మిత్రురాలనీ, ప్రతిదినం ఆ నగర సమీపంలోని వనానికి విహారానికి వెళ్లే అలవాటు మాకున్నదనీ, అక్కడ కలుసుకోవచ్చనే సూచించింది. రత్నపాలుడు సంతోషంతో అంగీకరించాడు.

"మర్నాడు నేనూ మా అక్కా వింటూండగా మణిమంతుడు "మిత్రమా! మనం మిత్రులమైనందుకు మన పిల్లలు కూడా మనసులు కలుపుకున్నట్లున్నారు. శుభముహూర్తం పెట్టించండి. సుచిత్రను, చిత్రను, నా కోడళ్లుగా చేసుకుని నా లోకానికి తీసికెళతాను అన్నాడు.

"మేము ముగ్గురం చనువుగా తిరగటం గమనించటం వల్లనే మణిమంతుడు మా తండ్రితో అలా అన్నాడని గ్రహించాం మేము.

మా నాన్నగారు నవ్వి "రత్నపాలుని వంటి గుణవంతుడు నా అల్లుడు కావటం నా అదృష్టం. అలాగే చేద్దాం" అన్నారు.

"ఆ తర్వాత రత్నపాలుడు తండ్రితో కలిసి నాగలోకానికి వెళ్లగానే, మేము ఈ వనంలోకి వచ్చాం. మూడు రోజుల్నుంచి మేము రాకపోవటం వల్ల కంగారు పడుతున్న సువర్ణ రేఖను కౌగలించుకుని జరిగింది చెప్పాం. అప్పటినుంచి రత్నపాలుడు ప్రతిదినం నాగలోకం నుండి ఇక్కడికి మా కోసం వస్తూండేవాడు. రత్నపాలుడు, సువర్ణా, అన్నాచెల్లెళ్లలా అనుబంధాన్ని పెంచుకున్నారు. సంతోషంతో రోజులు దొర్లిపోతూండగా ఒకనాడు ఇప్పుడు మీ చేత ఓడించబడి మాయమైపోయిన ధూమ్రకేతుడు ఈ వనానికి వచ్చాడు.

"సువర్ణ రాకకోసం ఎదురు చూస్తున్న నన్నూ, మా అక్కనూ బలవంతం చెయ్యబోయాడు. సమయానికి వచ్చిన రత్నపాలుడికీ, ధూమ్రకేతుడికీ





మా విషయమై పెద్ద గొడవ జరిగింది. సమయం చూసి ప్రతీకారం తీర్చుకుంటానని బెదరించి ధూమ్రకేతుడు వెళ్లిపోయాడు.

"ఆ తర్వాత ఒకరోజు సువర్ణ, నేను, మా అక్క, రత్నపాలుడు, వినోదంగా ఓ ఆట ఆడాము. ఆ ఆట మా జీవితాలను కన్నీట ముంచుతుందని మేమెప్పుడూ వూహించలేదు..." అని చెప్పి, ఆ తర్వాత స్వరం గద్గదం కాగా మాట్లాడలేక నాగుబాము రూపంలోని సుచిత్ర వీరసింహుణ్ణి దీనంగా చూస్తూండిపోయింది.

వీరసింహుడు సుచిత్ర తల మీద చెయ్యి వేసి లాలనగా దువ్వుతూ "ఆ సమయంలో మీ స్నేహితురాలైన సువర్ణ వున్నదిగా? తర్వాత ఏం జరిగిందో ఈమె చుబుతుంది. నువ్వు ఊరడిల్లు చెల్లీ!" అన్నాడు.

వీరసింహుడి అభిప్రాయాన్ని అర్థం చేసుకున్న సువర్ణ అతడితో "రాజపుత్రా! ఆ ఆటను పేరేపించింది నేనే. వినోదం కోసం నేను పెళ్లి పెద్దనై సుచిత్రకూ, చిత్రకూ, రత్నపాలునికీ, వివాహం జరిపించాను. ఆ తర్వాత రత్నపాలుడి కళ్ళకు గంతలు కట్టి "అన్నయ్యా! నీ భార్యలిద్దరూ తమంత తాముగా నీ దగ్గరికి రారు. నువ్వే వెతికి పట్టుకోవాలి. ఈ కొత్త ఆట చాలా వినోదంగా వుంటుంది. ఎంతసేపైనా, నువ్వు వాళ్లకోసం ఈ వనమంతా తిరిగైనా పట్టుకోవాలి సుమా!" అన్నాను.

రత్నపాలుడు నవ్వుతూ "నీ స్నేహితురాండ్రిద్దరూ మూగనోము పట్టి తిరుగుతూంటే నేనెలా తెలుసుకో గలనమ్మా! నవ్వుతూ తప్పించుకోవటానికి ప్రయత్నిస్తూ తిరగమని చెప్పు. ఒకటికి పదిసార్లయినా ఈ వనమంతా తిరిగి, వాళ్ల నవ్వులను ఆధారం చేసుకుని పట్టుకుంటాను" అన్నాడు. అందుకు సుచిత్ర, చిత్ర, సమ్మతించారు.

"వెంటనే సుచిత్ర, చిత్ర, ఆ వనమంతా కోయిలలు కూస్తున్నట్లు తమ మధుర కంఠస్వరాలు నుంచి నవ్వులు వెలయిస్తూ, ముందుకు సాగారు. రత్నపాలుడు చేతుల్తో తడుముకుంటూ వాళ్ల ననుసరించాడు. నేను కూడా వినోదం చూస్తూ రత్నపాలుడి వెంట నడవసాగాను. తమ నవ్వులతో ఆ వనమంతా ప్రతిధ్వనిస్తుండగా సుచిత్ర, చిత్ర, రత్నపాలుడికి అందుబాటు అవుతూ, అంతలోనే తప్పించుకుంటూ చాలా దూరం వెళ్లారు. ప్రతిదినం మేం విహరించే ప్రదేశాలే

తెలుసుగాని, ఆ వనం ఎంత దూరం వరకు వ్యాపించి వున్నదో నాకు తెలియదు.

"అంతకంతకు ఆసక్తిని కలిగించే ఆ ఆటలో లీనమై మేము పరిసరాలను కూడా గుర్తించని స్థితికి వచ్చాం.

"ఆ సమయంలో వున్నట్లుండి ధూమ్రకేతుడు సుచిత్ర, చిత్రల ముందు ఆవిర్భవించి, వాళ్లిద్దరినీ గట్టిగా ప్రక్కకు త్రోసి మాయమయ్యాడు. ఆ పాపాత్ముడు అలా ఎందుకు చేశాడో ఆ మరుక్షణమే మాకు అర్థమైంది. పండి ఎండిన ఆకులు దట్టంగా తన మీద పరుచుకుని వుండగా - ఏకాగ్రతతో సాధన చేసుకుంటూన్న ఓ యోగిని మీద ఆ ఇద్దరక్కచెల్లెళ్లూ దభాలున పడిపోయారు.

"తన నిష్ఠ చెడిపోయినందుకు యోగిని తీవ్రమైన ఆగ్రహంతో చటుక్కున లేచింది. అప్పటికి నేను రత్నపాలుడి కళ్లగంతలు విప్పి, అతడితో బాటు భయంతో యోగినిని చూస్తూండిపోయాను.

యోగిని "ఓసీ! యౌవనగర్వంతో మిడిసిపడుతూ, విచ్చల విడిగా మగవాడితో విహరించే మీకు నాతో పరాచికాలా? ఎందుకు నా నిష్ఠను పాడు చేశారు?" అని చిత్రను, సుచిత్రను నిలదీసింది.

అందుకు సుచిత్ర పెడసరంగా "మా విహారాల సంగతి అలావుంచు. ముక్కుమూసుకుని తపస్సులు, నిష్ఠలు చేసుకునే నువ్వు మరెక్కడా చోటు చిక్కనట్లు ఇక్కడికే ఎందుకు వచ్చావు?" అన్నది. యోగిని క్రోధంతో "ఛీ—అసందర్భ ప్రలాపీ! అత్యంత నియమంతో నిష్ఠాగరిష్ఠురాలినై, ఎన్నో రోజులు దీక్షబూని ఒకానొక దివ్యశక్తిని నాలో ఆవహింపజేసుకుంటూన్న సమయంలో





నన్ను కదలించి, నా ఏకాగ్రతను చెదరించి, విఘ్నం కలిగించింది చాలక, పైపెచ్చు అహంకారంతో తూలనాడుతావా? ఇందుకు తగిన ఫలం అనుభవించు. నువ్వు ఇప్పటి నుంచి నాగుబాామువై ఈ వనంలోనే పడివుందువుగాక!" అని భయంకరంగా శపించింది.

"రత్నపాలుడు, నేను నివ్వెరపోయి నోట మాటరాక అలాగే మంత్రించిన బొమ్మలంలా వుండిపోయాం.

చిత్ర యోగిని పాదాలపై పడి "అమ్మా, యోగినీ మాతా! నా చెల్లెలి నోటి దురుసును, అవివేకాన్ని మన్నించు మేము కావాలని మీ మీదపడి మీ నిష్ఠను చెడగొట్టలేదు. మమ్మల్ని కామించి, మాచేత తిరస్కరించబడిన ఒకానొక రాక్షసుడు బలవంతంగా మీ మీదికి త్రోసి అదృశ్యుడయ్యాడు. మేము గంధర్వరాజైన చిత్రసేనుని పుత్రికలం. మీ బోటి యోగినులను పూజించటమే గాని, అవమానించే వాళ్లం కాము. మా మీద దయ చూపు తల్లీ" అని పరిపరి విధాలుగా ప్రార్థించింది.

అదే సమయంలో గంధర్వరాజైన చిత్రసేనుడు అక్కడ ఆవిర్భవించాడు. అతడు నిర్లక్ష్యంగా యోగినిని చూస్తూ "యోగినీ! శాంబరీ విద్యా ప్రభావంతో ఇక్కడేం జరిగిందీ తెలుసుకుని వచ్చాను. మానవ మాత్రురాలైన నువ్వు కొన్ని మహిమలను, శక్తులను సంపాదించినంత మాత్రాన ఇంతటి మిడిసిపాటు తగదు. నా చిన్న కూతురుకిచ్చిన శాపాన్ని ఉపసంహరించుకో" అన్నాడు.

యోగిని కోపానికి అతని మాటలు అగ్నిలో ఆజ్యం పోసినట్లయ్యాయి. నిప్పు కణికలను కురిపిస్తూన్నట్లున్న చూపులతో చిత్రసేనుణ్ణి మహోగ్రంగా చూస్తూ "శాంబరీ విద్య తెలిసిన నీకు ఇంగిత జ్ఞానం అంటే ఏమిటో తెలియదా గంధర్వా నీకు తెలిసిన విద్య అదొక్కటే కావొచ్చు. శాంబరి, నిశాంబరి, తిరస్కరిణి, రూపప్రచ్ఛన్న మేఘమాయ, మాయామేయ, దృష్ట ప్రకాశ, మొదలైన దివ్యవిద్యలతో బాటు అణిమాద్యష్ట మహాసిద్ధులను కూడా సాధించిన ఈ మానవ మాత్రురాలి శక్తి ఏపాటిదో చవిచూడు. ఇప్పటి నుంచి నువ్వు ఇదేవనంలో మర్రిచెట్టువై పడి వుందువుగాక!" అని శపించింది.

అప్పటికిగాని ఆ యోగినీమాత తనను పించిన ఎన్నో శక్తులను కలిగినదన్న సత్యం చిత్రసేనునికి తెలియలేదు. పరిస్థితి మరింత ప్రమాదకరంగా మారుతున్నందుకు చిత్ర దుఃఖిస్తూ తండ్రితో "నాన్నా! ఎన్నడూ యెవ్వరినీ పన్నెత్తు మాట అనని మీకిప్పుడేం దుర్బుద్ధి పుట్టింది? చెల్లెలంటే చిన్నది కాబట్టి తొందరపడింది. లోక పూజ్యురాలైన యోగినీ మాతను రెచ్చగొట్టి, మీరు కూడా శాపానికి గురి అయ్యారే" అని యోగిని పాదాలను మరింత గట్టిగా పట్టుకున్నది.

"చిత్ర సేనుడు సుచిత్రతో బాటు యోగిని పాదాల మీద పడ్డాడు. తండ్రీ కూతుళ్ళు ఎంతో జాలిగా ప్రార్థించిన మీదట యోగిని చిత్రను పైకి తీసి, కాస్త వెనక్కి తగ్గింది.

"చిత్ర సేనుణ్ణి, సుచిత్రను పైకి లేవమన్నట్లు సంజ్ఞచేసి, చిత్రతో "పుత్రీ! నీ వినయము, పెద్దల యెడగల నీకు గల పూజ్యభావము నాకు సంతోషాన్ని కలిగిస్తున్నాయి. దుర్మదాంధుడైన నీతండ్రి, వాచాలతతో విర్రవీగే నీచెల్లెలు నా శాపం నుంచి విముక్తి చెందిన తర్వాతనైనా, సౌమ్యతను అలవర్చుకుంటే సంతోషిస్తాను....

"ఎప్పటికైనా సుక్షత్రియ వంశానికి చెందిన యువకుడు ఎవ్వరి ప్రబోధం లేకుండా, తనంత తానుగా ఇక్కడికి వచ్చి, మీ తండ్రి, చెల్లెలు స్థితి తెలుసుకొని, నిండు మనస్సుతో తన శరీరంలోని రక్తంతో వీళ్లకు అభిషేకం చేస్తే, వీళ్లకి శాపవిమోచనం కలుగుతుంది. ఈలోగా నువ్వు ప్రతిదినం రాత్రి సమయాల్లో నృత్యగానాలతో సంవత్సరం కాలం నువ్వు అచంచల భక్తి శ్రద్ధలతో మహేశ్వరుణ్ణి ఆటపాటలతో అర్చించాలన్న



విషయం బాగా జ్ఞాపకం పెట్టుకో! మరో మాట - శాప విముక్తి కోసం త్యాగం చేసే యువకుడు తటస్థపడి అతడు ఆత్మార్పణ చేసే రాత్రీ; నువ్వు పరమేశ్వరుణ్ణి ఆరాధిస్తూ గడిపే సంవత్సర కాలపు చివరి రాత్రీ; రెండూ ఒక్కటే కావాలి! ఒక రోజు అటు అయినా, ఇటు అయినా ఎవ్వరికీ ఏ ఫలితమూ వుండదు! నాగుపాము రూపంలో వున్న నీ చెల్లిలికి ప్రతిదినం అర్ధరాత్రి సమయం నుంచి సూర్యోదయం వేళదాకా సంచార శక్తి వుంటుంది. ఆ సమయంలోనే ఆహారం తీసుకోవాలి. ఈ రహస్యం ఎవరైనా తెలుసుకోగలిగితే తప్ప, మీయంతకు మీరు వెల్లడి చేయరాదు. ఇక శాపం ఇచ్చిన వ్యక్తి, దానిని అంతం చేస్తూ నిర్దేశించే కాలంలో తను ఎవరో బయల్పరుచుకోవాలి కనుక నేనెవరినో చెబుతున్నాను. ఒకానొక లక్ష్యం కోసం దీక్ష వహించి యోగశక్తులను పూర్తిగా వశం చేసుకోవటానికి ప్రయత్నిస్తూన్న రాజవంశీయురాలిని. నా పేరు ప్రభావతీ దేవి''

అని ఆ యోగిని అంతర్థానమైపోయింది.

''ఆ తర్వాత - జరిగిన అనర్థానికి చిత్రసేనుడు, చిత్ర, సుచిత్ర, దుఃఖిస్తూ ఒకొర్నొకరు కౌగలించుకుని కొంత తడవు వుండిపోయారు. రత్నపాలుడు, నేను, వాళ్లకి ధైర్యం చెప్పాము.

చివరకు మనసు రాయి చేసుకున్న చిత్రసేనుడు చిత్రతో ''తల్లీ! ఇప్పుడైనా నీవల్లనే యోగిని దయతో శాపాంతాన్ని ప్రసాదించింది. నువ్వు తదేక దీక్షతో ప్రతిదినం రాత్రి సమయాల్లో ఏ విఘ్నమూ కలుగకుండా - నృత్య, గానప్రియుడైన పరమేశ్వరుణ్ణి ఆర్జిస్తూండాలి. ఏ లోపం జరిగినా ఇక మా బ్రతుకులు ఇంతే! నా సంకల్ప శక్తితో నీ పరమేశ్వర సేవలకు అన్ని విధాలుగా అర్హమైన ఈశ్వరాలయం ఏర్పరచుతాను. ఇప్పటికే నాలో, చెల్లిలో శాపం ఆవహిస్తున్నది. జాగ్రత్త తల్లీ!'' అని చెప్పి శాపఫలితం అనుభవించటానికి చిన్న కూతురైన సుచిత్రతోబాటు అంతర్ధానుడయ్యాడు.

—(ఇంకావుంది)





[జరిగిన కథ: పాతాళరాజైన కాలనేమి పుత్రుడు ధూమ్రకేతుణ్ణి వీరసింహుడు పరాజితుణ్ణి చేసి తరిమివేసిన తర్వాత, పాము రూపంలో ఉన్న సుచిత్ర వీరసింహునితో తాను గంధర్వరాజు చిత్రసేనుని పుత్రికననీ, తాను, తన అక్క చిత్రతో కలిసి తరచు ఈ ఉద్యానవనం వచ్చేవాళ్ళం, మమ్మల్నిద్దరినీ ప్రేమించిన రత్నపాలుడూ ఇక్కడికి వచ్చి మాతో కలిసేవాడనీ, ఇక్కడే ఈ వసుమతి రాజపుత్రిక సువర్ణ మాకు పరిచయమయిందనీ, మేమందరం కలిసి ఓ రోజు ఓ విచిత్రమైన ఆట ఆడాము. ఆ ఆటే మా జీవితాలకు ముప్పయిందని చెప్పి ఇక చెప్పలేక కళ్ళనీళ్ళు పెట్టుకుంటుంది. ఆ తర్వాత కథను సువర్ణ వీరసింహునికి వివరిస్తూ, ఈ ఉద్యానవనంలో నేను ప్రేరేపించిన ఆటను ఆడుతూ చాలా దూరం వెళ్ళిపోయాం. అప్పుడు అనుకోకుండా ఇప్పుడు మీతో తరిమివేయబడిన ధూమ్రకేతుడు ఆవిర్భవించి చిత్ర, సుచిత్రలను ఒక చోట తపస్సు చేసుకుంటున్న ఒక యోగిని మీదకు తోసివేశాడు. అంతటితో ఆగ్రహురాలైన ఆ యోగిని, ఈ సుచిత్రను పాముగాను, అప్పుడే అక్కడికి వచ్చి యోగినిని నిర్లక్ష్యం చేసిన గంధర్వరాజు చిత్రసేనుణ్ణి మర్రిచెట్టుగానూ ఉండమని శపించింది. కొంతసేపటికి తన శాపానికి అంతం తెలిపి తానెవ్వరో కూడా చెప్పి అంతర్ధానమయింది. ఆ ప్రకారం వీళ్ళిద్దరూ ఇక్కడ శాప ఫలితం అనుభవిస్తున్నారు అని సువర్ణ చెబుతుంది.

—ఇక చదవండి]

శాప ఫలితాన్ని అనుభవించటానికి చిత్రసేనుడు, సుచిత్ర వెళ్లిపోగానే చిత్ర ..న్ను పట్టుకుని చిన్న పిల్లలా దుఃఖించింది. రత్నపాలుడు, నేను, ఎన్నో విధాలుగా ఆమెను ఊరడించాము.

కొంతసేపటికి చిత్ర దుఃఖం నుంచి తేరుకుని నన్ను జాలిగా చూస్తూ "రాకుమారీ! ఇక నుంచి ప్రతిదినమూ అర్ధరాత్రి సమయంలో నువ్వూ రత్నపాలుడూ మా చెల్లెలిని కలుసుకుంటూ ఓదార్చుతూ ఉండండి. అంతఃపురంలో నివసించే నిన్ను ఇలా కోరటం ఉచితం కూడా కాదు. అయినా - నా చెల్లెలికి నువ్వంటే పంచప్రాణాలు. దానికి పాలు తెచ్చి ఇస్తూ ధైర్యం చెప్పవలసిన దానవు నువ్వే. యోగినీ మాత సెలవిచ్చినట్లు శాపం తొలగించే యువకుడు తటస్థపడితే సరేసరి, - లేకపోతే ఇక మా బ్రతుకులు ఇంతే! నా తండ్రికి, నా చెల్లెలికి లేని జీవితం నాకు కూడా

కిరణ్ కుమారి



వొద్దు. శాపం పొందక పోయినా, నేను కూడా శాపగ్రస్తురాలిలా ఇక నుంచి పగటి పూట ఎవ్వరికీ కనిపించను. రాత్రి సమయాల్లో మాత్రం నియమం తప్పకుండా మా తండ్రి సృష్టించిన ఈశ్వరాలయానికి వెళుతూంటాను. యోగిని శాపం తొలగిపోయాకనే మనం అందరం మళ్లీ కలుసుకుందాం. అంతవరకూ సెలవు" అని చెప్పి అంతర్హితురాలైపోయింది.

రత్నపాలుడు నన్ను చూస్తూ "సువర్ణా! చిత్ర చెప్పినట్లు ప్రతిదినం అర్ధరాత్రి వేళల్లో కోట నుండి ఇక్కడికి వస్తూండు చెల్లీ! నీ రాకపోకలకు ఎటువంటి అంతరాయమూ లేకుండా చూసే బాధ్యత నాది. ఇక నువ్వు దుఃఖం విడిచిపెట్టి నగరానికి వెళ్లు తల్లీ! అవతార పురుషులకు, అవతార స్త్రీలకే ప్రారబ్ధం అనుభవించక తప్ప లేదు. ఇక మనమెంత? మంచికాలం కోసం చూస్తూ గడుపుదాం" అని చెప్పి తనూ మాయమయ్యాడు.

"సుముహర్తంగాని, దుర్ముహూర్తంగాని, రెప్ప పాటు కాలంలో పదోవంతు అట! ఆ ముహూర్తంలో జరిగే మంచి చెడ్డల అంకురార్పణ ప్రభావం ఎంత గొప్పదో ఊహించటానికే సాధ్యం కాదని శాస్త్రకారులు చెబుతారు.

"ఆ పరిస్థితిని కల్పించిన దుర్ముహూర్తాన్ని తిట్టుకుంటూ, నేను కూడా వికల మనస్కురాలినై నగరానికి వెళ్లాను. అప్పటినుంచి ప్రతిరోజూ అర్ధరాత్రి పాలు తీసుకుని ఇక్కడికి వచ్చి సుచిత్రకు ధైర్యం చెప్పి, కాసేపు ఉండి తిరిగి అంతఃపురానికి వెళ్లిపోతూంటాను. ఒక్కొక్కసారి నేను ఉన్నప్పుడో, లేక నేను వెళ్లాకనో తన లోకం నుండి రత్నపాలుడు కూడా వచ్చి సుచిత్రను చూసి, ఓదార్చి వెళుతూంటాడు. ఇదీ మాకు సంబంధించిన విషాద చరిత్ర" అని వివరించి సువర్ణ దీర్ఘంగా ఓ నిట్టూర్పు విడిచింది.

అప్పటికి తెల్లవారుఝాము అయింది. వీరసింహుడు ఆ వృత్తాంతం పూర్తిగా విన్న తర్వాత తన చేతుల్లోని సర్పరూపిణియైన సుచిత్ర తల మీద ముద్దు పెట్టుకుని క్రింద విడిచాడు.

ఆ తర్వాత అతడు సువర్ణతో "రాకుమారీ! నువ్వు చెప్పిన వృత్తాంతంలోని యోగిని నా పిన తల్లి. ఎంతో ఉత్తమురాలుగాను, సాత్త్వికురాలుగాను, సాధ్వీమ తల్లిగాను ప్రసిద్ధి

గాంచింది. నా పినతండ్రియైన ధర్మపాల సార్వ భౌమునికి కూరిమి ఇల్లాలు. ఆమె జీవితంలో చెలరేగిన అల్లకల్లోలాలే యోగినిగా ఆమె ఇక్కడికి రావటానికి కారణాలు" అని క్రింద ఉన్న సుచిత్ర, తన ప్రక్కన ఉన్న సువర్ణ ఆశ్చర్యంతో తనను చూస్తుండగా ప్రభావతీదేవి చరిత్రను, తన వృత్తాంతాన్ని పూర్తిగా వివరించాడు.

సుచిత్ర వీరసింహుడి పాదాల మీద తల ఉంచి "అన్నయ్యా! అజ్ఞానంతో, అవివేకంతో, అహంకారంతో తల్లిగారి కోపానికి గురి అయ్యాను. కానీ, దేవుడి వంటి ఒక అన్నను ఇప్పుడు ఆ తల్లే పంపిందనుకుంటున్నాను" అన్నది.

సువర్ణ కూడా రెండు చేతూలూ జోడించి వీరసింహుడికి నిండుగా నమస్కరిస్తూ "వీరసింహ యువరాజా! ఉత్కృష్టమైన జీవితాలతో ఉన్నతులైన మీ పిన్న తల్లిగారిని, మిమ్మల్ని కలుసుకున్నందుకు మా జన్మలు ధన్యమయ్యాయి" అన్నది.

వీరసింహుడు గంభీర దృష్టులను సువర్ణ ముఖం మీదకు ప్రసరింపజేస్తూ "లేదు సువర్ణా! నేను చెయ్యవలసిన ఒకానొక మహత్కార్యం ఇంకా పూర్తికాలేదు. అది నెరవేరిన తర్వాతనే మీ జీవితాలు ధన్యవంతం అవుతాయి. నా పినతల్లి శాపాంతాన్ని నిర్దేశిస్తూ చెప్పిన క్షత్రియ యువకుణ్ణి నేనే కావటం నా అదృష్టం" అన్నాడు.

అతడి మాటలకు సువర్ణ మంత్రించిన బొమ్మలా నిల్చుని అలాగే చూస్తుండిపోయింది.

సుచిత్ర దీనత్వం వుట్టిపడే స్వరంతో "అన్నయ్యా!



నీ నిర్ణయం అర్థమైంది. కాని, కొండంత పనిని నిర్వహించవలసిన వాడివి నువ్వు. ఒక చెల్లెలిని పోగొట్టుకుని ఆమె చెరవిముక్తితో బాటు వేలాది సోదరీమణులను కాలభైరవ మాంత్రికుడి బారి నుంచి రక్షించాలన్న స్థిరసంకల్పంతో ఉన్నవాడివి. దిక్కుమాలిన నాకోసం, నా తండ్రి కోసం అమూల్యమైన నీ ప్రాణాన్ని ధారపోయటం ఎంతమాత్రం తగదు. దయచేసి - ముందు నీ పనిమీద నువ్వు వెళ్ళు అన్నయ్యా!" అని చెప్పి వెనుతిరిగి చరచరా ప్రాకుతూ మర్రిచెట్టు తొర్రలోకి వెళ్ళిపోయింది.

మరుక్షణం - సువర్ణరేఖ నిశ్చేష్టితురాలై, కన్నీటితో చూస్తూండగా వీరసింహుడు నిర్మలమైన మనస్సుతో మర్రిచెట్టు ఎక్కాడు. ఒర నుంచి కత్తి దూసి "నా పినతల్లియైన ప్రభావతీ మహా



రాణి నిర్దేశించిన శాపాంతాన్ని విజయవంతంగా నెరవేర్చగలిగిన అర్హత నిజంగా నాలో వుండి వుంటే, నా రక్తధారలతో అభిషిక్తులవుతూ, చిత్రసేన గంధర్వరాజు, సుచిత్ర ఈనాటితో శాపం తొలగి, పూర్వరూపాలలో విలసిల్లేట్లు ఆశీర్వదించండి'' అని సకలదేవతలను ప్రార్థించుకున్నాడు.

తల పైకెత్తి సువర్ణ దుఃఖాశ్రువులను రాలుస్తూ చూస్తూండగా వీరసింహుడు తన చేతిలోని కత్తితో శిరస్సును ఖండించుకున్నాడు.

వెంటనే నెత్తుటి ధారలతో మర్రిచెట్టును అభిషేకిస్తూ, అతడి తలా, మొండెమూ క్రింద పడ్డాయి.

ఆ దృశ్యాన్ని చూడగానే సువర్ణ దుఃఖాన్ని ఆపుకోలేకపోయింది. అతణ్ణి చూసినప్పటి నుండి ఏర్పడిన సద్భావమూ, అతడి ప్రవర్తనకు ముగ్ధమై అల్లుకున్న కన్నెప్రేమా, ఒక్కసారిగ ఆమెలోని అణువణువునూ ఆవరించుకుని, సర్వం వీరసింహమయం చేశాయి.

వెంటనే భోరున ఏడుస్తూ అక్కడే కూలబడిపోయింది.

వీరసింహుడి శిరస్సును తన రెండు చేతులలోకి తీసుకుని పిచ్చిదానిలా నుదుటిని ముద్దాడసాగింది.

కొంతసేపటికి మర్రితొర్రలోంచి, వీరసింహుడి రక్తంతో తడిసిన శరీరంతో పాము రూపంలోని సుచిత్ర బైటికి వచ్చింది. క్రిందికి ప్రాకుతూ సువర్ణ దగ్గరికి వచ్చి ''ఎంత చెప్పినా వినకుండా అన్నయ్య ఆత్మార్పణ చేశాడు. అయినా ఫలితం లేకపోయింది. ఆయనమీద ఇంత ప్రేమను పెంచుకున్న నీకు కూడా అన్యాయం చేశాను సువర్ణా!'' అని దుఃఖించసాగింది.

అదే సమయంలో - రత్నపాలుడు అక్కడికి వచ్చి, జరిగిందంతా తెలుసుకుని చింతాక్రాంతుడయ్యాడు. సువర్ణను, సుచిత్రను ఓదార్చటానికి కూడా అతడు అశక్తుడై, వీరసింహుడి మొండానికి నమస్కరిస్తూ, ప్రక్కనే కూలబడిపోయాడు! గాలికి కొమ్మలు మెల్లిగా కదలాడుతూండగా మర్రిచెట్టు స్తబ్ధంగా అలాగే వుండిపోయింది.

సూర్యోదయం కావటానికి ఇక ఎంతో కాలం లేదని సూచిస్తూ, శుక్రనక్షత్రం ఆకాశంలో

వెలసింది!

ఇలా వుండగా — అక్కడ శివాలయంలో ధ్వజస్తంభం దగ్గర నిల్చుని, దివ్యకాంతల నృత్య గానాదులను భక్తి పారవశ్యంతో వీక్షిస్తూన్న సూర్య ప్రతాపుడు అక్కడినుండి కదలలేకపోయాడు.

ఆ నర్తకీమణులందరికీ నాయకురాలుగా వున్న యువతిని చూస్తూన్నకొద్దీ అతడి అంత రంగంలో గౌరవ భావం ఏర్పడసాగింది.

అతి విచిత్ర పరిస్థితిలో వెలసిన ఆ శివుని కోవెలలో ఆ యువతులంతా ఏ ప్రయోజనం కోరి అంతసేపటి నుంచి అలసట కూడా ఎరగకుండా తన్మయత్వంతో అలా నృత్య సంగీతాలు కొన సాగిస్తున్నారో అతడు వూహించలేకపోయాడు.

"ఓం హరహర శంభో - మహాదేవ పాహి ... గిరిజా రమణా ... భవభవ హరణా ...' అంటూ వివిధములైన నామాలతో రకరకాల ఆలాపలను మేళవిస్తూ ఆ దివ్యసుందరీమణులు తెల్లవారు ఝాము దాకా అలాగే తమతమ నృత్య గానాదులను కొనసాగించారు.

ఆ ఆలయ ప్రదేశమంతా పట్టపగల్లా వెలుతురుతో నిండి, పరమ పవిత్రమైన పరమేశ్వర నామోచ్చరణతో పరవశించిపోతూన్న ఆ సమయంలో - వున్న ట్లుండి ఓ వికృత కంఠస్వరం భయంకరంగా పెడబొబ్బలు పెట్టడం విని, సూర్యప్రతాపుడు వులిక్కిపడ్డాడు.

అంతలోనే కాలమేఘం వంటి నల్లటి శరీరంతో, క్రూరత్వం ఉట్టిపడే చూపులతో అతి భయంకర రూపుడైన ఓ రాక్షసుడు ఆలయ మంటపం ప్రక్కన ఆవిర్భవించాడు.

ఆ రాక్షసుణ్ణి చూడగానే ప్రతాపుడు





అప్రయత్నంగా కరవాలం పిడిమీద చెయ్యి వేశాడు.

రాక్షసుడు వికృతాట్టహాసాలు చేస్తూ, అడుగులను ఆ యువతుల వేపుకి వేయసాగాడు.

ఆ అరుపులు వినగానే, చుట్టూ తిరుగుతూ ఈశ్వర స్తోత్రం చేస్తూ ఆడుతూన్న యువతులు ప్రక్కకు తిరిగిచూశారు.

మరుక్షణం - భయంతో కేకలు వేస్తూ అందరూ అక్కడినుండి బైటికి పరుగెత్తి ధ్వజస్తంభం చాటున దాక్కుని ముందుకు చూడసాగారు.

మంటపంలో నాట్యం చేస్తూ, వలయంలో వుండిన యువతి మాత్రం ఆ రాక్షసుడి అరుపులను లెక్కచెయ్యకుండా, ఏకాగ్రత చెడకుండా, అలాగే పరమేశ్వర సమారాధనలో లీనమైంది.

రాక్షసుడు ఆ యువతిని సమీపించి, "గంధర్వ రాజపుత్రీ! నీమీద మోహంతో ఇంతకాలం తపించిపోయాను. ఇప్పుడు నాకారిన పడ్డావు. ఉలుకూ పలుకూ లేని ఆ శివలింగాన్ని కొలుస్తూంటే నీకే ప్రయోజనమూ వుండదు. నన్ను సేవిస్తే, నిన్ను నెత్తిన పెట్టుకుంటాను. కోరిన కోర్కెలన్నీ తీరుస్తాను. రా - నా బాహు బంధాలకు చిక్కి, నీ కౌగిలింతలతో నన్ను ఆనందింపజెయ్యి" అని ఉన్మాదంతో ప్రేలుతూ ఆ యువతిని అమాంతరం కౌగిలించుకున్నాడు.

పరిస్థితి విషమిస్తున్నదని గ్రహించిన సూర్య ప్రతాపుడు ఇక ఉపేక్షించలేకపోయాడు.

వెంటనే ఒరనుంచి కత్తిని దూసి అతడు ముందుకు పరుగెత్తాడు.

రాక్షసుణ్ణి సమీపించి ఖడ్గంతో అతడి వీపున పొడుస్తూ "ఓరీ; దుష్ట రాక్షసా! పరమేశ్వర పూజలో లీనమైన ఈ యువతిని అపవిత్రం చేయటానికి ప్రయత్నించే నిన్ను ముక్కలు ముక్కలు చెయ్యటానికి ఆ భగవంతుడే నన్నిక్కడికి పంపించాడు. ఆమెను విడిచిపెట్టి ఇటు తిరుగుతావా; తల నరకమన్నావా?" అన్నాడు.

రాక్షసుడు యువతి కౌగిలి విడిచిపెట్టాడు. ఆమె యధాప్రకారం తన నృత్యగానాదులతో పరమశివుణ్ణి స్తుతించటంలో మునిగిపోయింది.

ప్రతాపసింహుడు రాక్షసుణ్ణి మంటపం బైటికి గెంటుకుంటూ వచ్చి, అతడి కళ్ల ముందు భయంకరంగా ఖడ్గాన్ని ఝుళిపించాడు. రాక్షసుడు తన చేతిలోకి ఓ ముళ్ల గదను రప్పించుకుని

...సమాంతరం ప్రతాపుడి మీద తలపడ్డాడు.

రాక్షసుడు గదను తనమీదికి విసిరినప్పుడల్లా ఎంతో జాగ్రత్తగా తప్పించుకుంటూ, సమయం చిక్కినప్పుడల్లా చేతిలోని కత్తితో ఆ రాక్షసుడి కడుపులో, గుండెల్లో పొడుస్తూ, ప్రతాపుడు చాలాసేపు పోరాడాడు.

ధ్వజస్తంభం చాటున నిల్చుని వున్న యువతులు, తమ నాయకురాలిని పీడించే రాక్షసుడిని ఎదుర్కొని పోరాడుతున్న యువకునికి విజయం కలిగించమని పరమేశ్వరుణ్ణి ప్రార్థిస్తూ, బైటికి వచ్చారు. వాళ్లు వినోదంగా తమ పోరాటాన్ని చూస్తూండగానే ప్రతాపసింహుడు అంతకంతకు విజృంభించి, రాక్షసుణ్ణి నిర్వీరుణ్ణి చేయసాగాడు. శరీరమంతా గాయాలు నిండి నెత్తురు విపరీతంగా స్రవించడంతో రాక్షసుడు నీరసపడ్డాడు. అతడి చేతిలోని ముళ్ల గదను కూడా సరిగా పైకెత్తలేని పరిస్థితికి వచ్చాడు. ఆ దుష్ట దానవుడిపై జాలి చూపటం ఎంతమాత్రం మంచిది కాదని భావించిన ప్రతాపుడు ఒక్క వ్రేటుతో తల ఖండించివేశాడు.

అప్పటికి తెల్లగా తెల్లవారింది. ధ్వజస్తంభం చాటు నుంచి బైటికి వచ్చిన యువతులంతా నమస్కరిస్తూ ప్రతాపుడి దగ్గరికి వచ్చారు. రాక్షసుడి నెత్తురుతో తడిసిన కత్తిని ఒరలో పెట్టుకుంటూ ప్రతాపుడు "యువతీమణులారా! ఆకాశం నుండి తేజోరూపాలుగా ఆలయంలోకి ప్రవేశించినప్పుడే మిమ్మల్ని చూసిన నేను మీరు ఏ దేవలోకానికి చెందినవారై వుంటారని వూహించాను. మీరెవరు? ఎంతో ఏకాగ్రతతో పరమేశ్వరుణ్ణి అర్చిస్తూన్న ఆ సౌశీల్యవతి



ఎవరు?" అని అడిగాడు.
ఒక యువతి "మానవవీరా! చిత్ర అనే పేరుగల ఆమె గంధర్వలోకానికి రాజైన చిత్ర సేనుల వారి పుత్రిక. మా లోకానికి వచ్చి అప్పుడప్పుడు మా రాజపుత్రిని వేధించే ఈ రాక్షసుడు తన పాపం పండటంతో, ఇక్కడికి కూడా వచ్చి మీచేతుల్లో చనిపోయాడు. మేము చిత్రకు స్నేహితురాండ్రం" అని చెప్పింది.

అప్పటికి తన ఆరాధన పూర్తి కావటంతో చిత్ర కూడా ప్రతాపుడి దగ్గరికి వచ్చి "మానవ సోదరా! మీరాకపట్ల నా జన్మ ధన్యమైంది. ఇప్పుడు మీరు చేసిన ఈ మహోపకారానికి నేను, నా తండ్రి, నా చెల్లెలు, చిరకాలం కృతజ్ఞులంగ వుంటాము" అన్నది.

సూర్యప్రతాపుడు నవ్వి "గంధర్వ సోదరీ! ఈ ఆలయంలోని శిలాశాసనం ప్రకారం ఈ రాత్రికి ఇక్కడ వుండటం వల్ల ఏదో ఆపద కలుగుతుం దనుకున్నాను. కానీ, నీవంటి దేవతా యువతికి తోడ్పడే మంచి అవకాశం కలిగింది. దీనికై నన్నింతగా నీవు పొగడవలసిన పని ఏమీలేదు" అన్నాడు.

చిత్ర అతడితో "సోదరా! ఆ శిలాశాసనం ఉండటానికి ఓ కారణమున్నది. నా చెల్లెలు, నా తండ్రి, ప్రభావతీదేవి అనే పేరుగల ఒక క్షత్రియ యోగినివల్ల శాపం పొందారు. శాప రహస్యం ఇతరులకు గోచరించే ఈ ఆలయంలో, అటువంటివారెవరైనా రాత్రివేళ ఇక్కడ వుండ కుండా చేయటానికే శిలాశాసనం ఉపయోగం. మీరు మంచి మనస్సుతో ఇక్కడ వుండి, మా జీవితాలు మళ్లీ పూర్వశోభలతో ప్రకాశించేట్లు చేశారు. ఈ రాక్షసుడీ వల్ల నా ఆరాధన చెడి, నేను అపవిత్రురాలినై వుంటే, మా తండ్రికి, యుగాలు గడిచినా నిజరూపం వచ్చేది కాదు" అన్నది. ఆ తర్వాత చిత్ర ప్రతాపుడి కోరిక ప్రకారం అతడికి తమ వృత్తాంతం చెప్పటం ప్రారంభించింది.

— (ఇంకావుంది)





[జరిగిన కథ: యోగినీ మాతవల్ల శాపగ్రస్తులైన చిత్రసేనుడూ, సుచిత్ర అంతర్ధానులయ్యాక జరిగిన వృత్తాంతాన్ని సువర్ణ వీరసింహునికి వివరిస్తూ, "యోగినీ మాత శాపం అంతమయ్యే వరకూ, సుప్ర రత్నపాలుడు ఇక్కడికి వచ్చి, నా చెల్లెల్లిని ఓదార్చుతూ ఉండండి. నేను మా తండ్రి సృష్టించిన ఈశ్వరాలయానికి వెళతాను అని చెప్పి చిత్ర అంతర్హితురాలైంది. అప్పటినుంచి నేను రాత్రి వేళ సుచిత్రకు పాలు తెచ్చి, ధైర్యం చెప్పి వెళుతుంటాను. రత్నపాలుడూ అప్పుడప్పుడు వచ్చి సుచిత్రను కలుసుకుంటాడు" అని సువర్ణ తమ చరిత్రను వీరసింహునికి వివరిస్తుంది. ఇది విన్న వీరసింహుడు, వారి శాపాంతానికి తనే తగినవాణ్ణని నిర్ణయించుకుని, మర్రిచెట్టునెక్కి తన తలను తాను ఖండించుకుని, తన నెత్తురి ధారలతో మర్రిచెట్టును అభిషేకిస్తాడు.... అక్కడ శివాలయంలో ఈశ్వరుని ముందు నృత్యం చేస్తున్న దివ్యయువతుల నృత్యాన్ని సూర్యప్రతాపుడు ధ్వజస్తంభం దగ్గర నిలిచి చూస్తుంటాడు. అప్పుడు అకస్మాత్తుగా అక్కడ ఒక రాక్షసుడు ఆవిర్భవించి, ఆ దివ్యకన్యల గుంపులోని చంద్రబింబంలాంటి అమ్మాయిని బలాత్కారం చేయబోతాడు. సూర్యప్రతాపుడు కలుగజేసుకుని, ఆ రాక్షసుని తలను ఖండించి వేస్తాడు. తర్వాత ఆ యువతి గంధర్వరాజు చిత్రసేనుని పుత్రిక చిత్ర అనీ, మిగిలిన యువతులు ఆమె స్నేహితురాండ్రని తెలుసుకుంటాడు.

—ఇక చదవండి]

పక్షులు కిలకిలారవాలు చేస్తూ, మర్రిచెట్టుమీది తమతమ గూళ్లలోంచి బయటపడ్డాయి. తూర్పు కొండ ఎరుపుదనం పులుముకుని వున్నది.

అప్పటివరకూ వీరసింహుడి తలను పట్టుకుని దుఃఖిస్తూన్న సువర్ణ, తన కిరువేపులా వుండి దీనంగా తనను చూస్తున్న రత్నపాలుడినీ, సుచిత్రనూ ఓమారు చూసింది. ఆ తర్వాత "సుచిత్రా! ఇంతకాలం నుంచి ఏ ప్రయోజనం కోసం ఎదురుచూశామో, అది నిష్ప్రయోజనమైంది. ఉదాత్త చరిత్రుడైన ఒక ఉత్తముడి జీవితం బలి కావటం తప్ప, మీకు మంచి జరగలేదు. వీరసింహులవారిమీద ఏ దైవ ప్రేరణతోనో లగ్నమైన నా మనస్సు విరక్తి చెందుతున్నది. మీ దుఃఖాన్నీ చూడలేను, వీరసింహులవారి మరణంవల్ల ఏర్పడిన దుఃఖంతో జీవించలేను. ఇక్కడే ప్రాయోపవేశం చేసి ప్రాణ

కిరణ్ కుమారి



త్యాగం చేస్తాను." అని లేవబోయి, అంతలోనే మర్రిచెట్టు అటూ ఇటూ వూగటం గమనించి, ఆశ్చర్యంతో చూస్తుండిపోయింది. అప్పుడే ఆ రాజపుత్రికి అమితమైన విస్మయాన్ని కలిగిస్తూ సుచిత్ర నిలువెత్తునా లేచి, తల వూపుతూ ఆనందంతో పరవశించిపోసాగింది.

రత్నపాలుడు సువర్ణతో "చెల్లీ! నువ్వు శాంతించు. అన్నీ సవ్యంగా జరుగుతాయి" అన్నాడు.

కొంతసేపు అటూ ఇటూ వూగిన మర్రిచెట్టు, తూర్పుకొండ కొనకొమ్ము మీద అప్పుడే ఉదయించిన సూర్యభగవానుడి లేత కిరణాలు తనమీద పడుతుండగా - గంధర్వరాజైన చిత్ర సేనుడుగా మారిపోయింది. అప్పుడే నాగుపాము రూపం నుండి సుచిత్ర కూడా నిజరూపాన్ని పొందింది.

రత్నపాలుడు, సువర్ణ, వాళ్లను చూస్తూ లేచి నిల్చున్నారు. చిత్రసేనుడు సుచిత్రతో కలిసి ఆనంద భాష్పాలు రాలుస్తూ, సువర్ణను వాత్సల్యంతో కౌగలించుకున్నాడు. ఆమెను చూస్తూ "పుత్రీ! నా బిడ్డల కోసం సంవత్సరం పాటు శ్రమపడ్డావు. మమ్మల్ని నిజరూపానికి తీసుకురావటానికి ఆత్మ త్యాగం చేసిన నీ మనోహరుణ్ణి నీ నుంచి దూరం చేస్తామా? ఆ శిరస్సు ఇలా ఇవ్వు తల్లీ!" అని సువర్ణ చేతిలోని వీరసింహుడి తలను తీసుకున్నాడు.

ఆ తర్వాత తలను మొండానికి చేర్చి "చిరంజీవీ! శిబి, కర్ణ, దధీచి, విక్రమార్కుల వంటి త్యాగ గుణం కలిగిన నువ్వు మా గాంధర్వ మహిమ వల్ల ప్రాణప్రతిష్ఠను పొందుదువుగాక" అన్నాడు.

మరుక్షణం - వీరసింహుడు దిగ్గున లేచి నిల్చున్నాడు. అతడికి ఎదురుగా మర్రిచెట్టు కన్పించకపోవటంతో ఆశ్చర్యంతో ప్రక్కకు తిరిగాడు. కళ్ళెదుట కనిపించిన వ్యక్తి శాపవిముక్తి చెందిన గంధర్వరాజై వుంటాడని భావిస్తూ, అతడికి నమస్కరించాడు.

చిత్రసేనుడు అతణ్ణి కౌగలించుకుని కొనియాడాడు. సుచిత్ర వీరసింహుడికి రత్నపాలుణ్ణి పరిచయం చేసింది. ఆ ఇద్దరూ ఒకరినొకరు గాఢంగా ఆలింగనం చేసుకుని, పరస్పర గౌరవాన్ని వ్యక్తం చేసుకున్నారు.

కన్నుల పండువుగా వాళ్ల నల్గురినీ చూస్తున్న

సువర్ణను దగ్గరికి తీసుకుని చిత్రసేనుడు వీరసింహునితో "నాయనా! ఈ సౌభాగ్యవతితో కలిపి నాకు ముగ్గురు పుత్రికలనుకుంటున్నాను. నిన్ను చూసినప్పటినుంచి మీ మీద ఆశలు పెంచుకున్నది. నువ్వు అంగీకరిస్తే, ఈమె తండ్రిగారి అనుమతి తీసుకుని మీ వివాహం మా గంధర్వ లోకంలో జరిపిస్తాను" అన్నాడు.

వీరసింహుడు వినయంతో "గంధర్వా శేఖరా! ప్రస్తుతం నా మీద ఓ పెద్ద బాధ్యత వున్నది. దానిని నెరవేర్చేదాకా నా మనసు మరో వ్యాపకం మీదికి మరలదు. సువర్ణ నాకు అన్ని విధాలా తగిన ఇల్లాలు కాదగినదే! అయితే, సమయం కలిసి వచ్చినప్పుడు ఇన్ని వేడుకలను జరిపించిన ఆ భగవంతుడు ఆ వేడుక కూడా జరిపించి తన ముచ్చటను తీర్చుకుంటాడు" అన్నాడు.

అదే సమయంలో "ఓయీ, వెర్రి రాకుమారా! ముందు మా ముచ్చటను తీర్చుకోవటానికి ఈ రాజపుత్రిని నాతో తీసికెళుతున్నాను. ప్రియురాలిని పోగొట్టుకున్న దుఃఖంతో మతిచెడి కృంగి కృశించి నశించిపో. మహా మాంత్రికురాలైన కాలంధర అనుచురాలినైన మాయామయిని నేను" అని మాయామయి అదృశ్య రూపంతో సువర్ణను ఎత్తుకుపోయింది.

సువర్ణ మాయం కాగానే సుచిత్ర హాహాకారాలు చేసింది. గంధర్వరాజు, రత్నపాలుడు విచారించసాగారు.

వీరసింహుడు వాళ్లకు ధైర్యం చెబుతూ "ఇప్పుడు



కాకపోయినా, ఏదో ఒక సమయంలో సువర్ణ ఆ మంత్రగత్తె బారిన పడక తప్పదు. సువర్ణవంటి రాచకన్యలు కాలంధరకు వెయ్యిమంది కావాలి. ఆ మంత్రగత్తెతోనూ, దాని గురువైన పాతాళ లోకనివాస - కాలభైరవ రాక్షస మాంత్రికుడితోనూ, ఇప్పటికే ఎంతో మంది కన్యల , యువతులు వాళ్ల నివాసానికి కొనిపోబడ్డారు. కాలంధర నివాసం ఎక్కడో తెలుసుకోవటానికే నేనూ, మా మదనుడు, మా సూర్యప్రతాపుడు కూడా నాతో బాటు బయలుదేరారు" అని కొంతకు కొంత తమ వృత్తాంతం వివరించాడు.

చిత్రసేనుడు "నాయనా! ఇక ఆ మంత్రగత్తెను ఎంత మాత్రం వుపేక్షించవద్దు. కళ్లు మూసి తెరిచేలోగా నువ్వు కాలంధర తాంత్రిక కోట



ముందు వుండేట్టు నా సంకల్ప శక్తిని నీ మీద ప్రవేశపెడతాను. ఇక మీదట కాదగిన పనుల్లో నా సహకారమూ, రత్నపాలుడి సాయమూ మీకు వుంటుంది. త్వరలో మేమంతా మిమ్మల్నందరినీ కన్నుల పండువుగా కలుసుకోగలమన్న నమ్మకం మాకున్నది'' అన్నాడు.

వీరసింహుడు కళ్లు మూసుకుని ''అయితే, నన్ను త్వరగా కాలంధర కోట ముందుండేట్టు చెయ్యండి'' అన్నాడు.

చిత్రసేనుడు ఇదిగో సంకల్ప శక్తిని నీలో ప్రవేశపెడుతున్నాను. తిరిగి కొద్ది క్షణాల తర్వాత కళ్లు తెరువు. ఆ మంత్రగత్తె నివాసం ముందుంటావు'' అన్నాడు.

వీరసింహుడు కొద్ది సేపటి తర్వాత కళ్లు తెరిచాడు. అయితే, అతడు నలువేపులకీ తల త్రిప్పి ఎంతసేపు చూసినా, కాలంధర నివాసం కనిపించ లేదు. తానున్నది వసుమతీ నగర సమీపంలోని వనమూ కాదది. మరేమిటి? ఒక చోటికని సంకల్పించ బడిన చిత్రసేనుడి గంధర్వమాయ తనను మరో చోటికి ఎందుకు చేర్పించింది? ఎదురుగా ఓ చిన్న పల్లెటూరు మాత్రం కనిపిస్తున్నది. అది కాలంధర నివాసం కాదని చెప్పకనే చెబుతున్నది... ఆలోచించిన వీరసింహుడు ఏం జరుగుతుందో కానిమ్మని తలపోస్తూ, ఆ పల్లెటూరుకేసి నడక సాగించాడు!

—శివాలయంలో చిత్ర తన వృత్తాంతమంత చెప్పగానే, సూర్యప్రతాపుడు ఆశ్చర్యపోయాడు. అతడిలో ఓ అనుమానం లీలగా మెదలింది. దానిని నివృత్తి చేసుకోవటానికి ''సోదరీ! ఇక్కడ నీ వుపాసన నిర్విఘ్నంగా నెరవేరింది. కాని, అక్కడ మీ తండ్రిగారికోసం, మీ చెల్లెలికోసం, ఆత్మార్పణ చెయ్యగలిగిన వీరక్షత్రియ యువకుడు తటస్థపడి, తన రక్తంతో అభిషేకం చేసి వుంటాడని ఎలా వూహించగలవు? అది జరిగితేనే కదా వాళ్లకి శాపవిముక్తి?'' అని అడిగాడు.

చిత్ర ''అన్నయ్యా! మేము గంధర్వులం. మాకు సంబంధించిన మంచి చెడ్డలు ఎప్పుడు ఎక్కడ జరిగినా, క్షణాల మీద ఒకరినొకరు తెలుసుకోగల శక్తి వున్నది. వీరసింహుడనే క్షత్రియ యువకుడు ఆ త్యాగం చేసి, మళ్లీ మా తండ్రిగారి చేత బ్రతికింపబడి, ఇప్పుడే కాలంధర మాంత్రికురాలి నివాసం దగ్గరికి వెళ్లాడు'' అన్నది.

ఆ మాటలు వినగానే ప్రతాపుడు సంతోషంతో "చిత్రా! చిత్ర విచిత్రంగా సాగిన మన చరిత్రలు ఒకరి జీవితంతో మరొకరి జీవితం ముడిపడి వున్నాయి. పుత్రశోకంతో పొగిలిపోతూ, అతణ్ణి బ్రతికించుకోవాలన్న తపనతో యోగసాధనలు చేస్తూ వుండిన చోట వుండక ప్రపంచమంతా కలియ తిరుగుతూన్న సమయంలో - దురదృష్టవశాత్తూ మీ తండ్రినీ, మీ చెల్లెలిని శపించిన ప్రభావతీ మహారాణి నాకు మేనత్త అవుతుంది. నీ మీద కలిగిన జాలితో ఆ మహా ఇల్లాలు శాప నిర్దేశం చేస్తూ, శాప విముక్తి కోసం మమ్మల్నే వినియోగించిందన్నమాట. ఇప్పటికి సంవత్సరం క్రిందట ఆమె మిమ్మల్ని శపించిన పరిస్థితి వేరు, ఇప్పటి పరిస్థితి వేరు. దుష్టసంహారం కోసం ఇంకా ఆమె ఎక్కడో వుండి తన దీక్షను కొనసాగిస్తూనే వున్నదని నా అభిప్రాయం. పోతే, వీరసింహుడెవరో కాదు. నా బావగారు. మా అత్త కుమారుడైన మదనుడు కూడా మాలాగా కాలంధర కోటకు బయలుదేరాడు. మరో మాట. నువ్వు చెప్పిన వృత్తాంతం విన్న తర్వాత నాకు మరో ఆనందం కూడా కలిగింది. ప్రేమించి, నువ్వూ మీ చెల్లెలు సుచిత్ర, వివాహం చేసుకోవాలనుకుంటున్న రత్నపాలుడు నా ప్రియ మిత్రుడు. నేను గురుకులంలో చదువుకునేటప్పుడు పరిచయమయ్యాడు. అప్పుడప్పుడు నాగలోకం నుండి నా కోసం గురుకులానికి వస్తూండేవాడు. ఈ మధ్య సంవత్సరం నుంచి రాకపోయేసరికి ఏమిటో అనుకున్నాను. ఇప్పుడు నువ్వు చెప్పిన దానిని బట్టి, నాన్నగారికి, చెల్లెలికి ఏర్పడిన



శాపం వల్ల వికలమనస్కుడై నిర్వికారంగా వుండి పోయి వుంటాడనుకుంటున్నాను. ఈనాడు నిజంగా పర్వదినం. పూజ్యమైన ఓ గంధర్వ కుటుంబానికి నేనూ, మా వీరసింహుడూ, ఉపయోగపడ్డాం" అని మురిసిపోయాడు.

చిత్ర కూడా అతడు చెప్పిన వివరాలకు మహదానందం చెంది "అన్నయ్యా! ఇప్పుడే నాన్నగారు, సుచిత్ర, రత్నపాలుడు మా లోకానికి వెళ్లారు. మనం కూడా వెళదాం పదండి. వాళ్లు మిమ్మల్ని చూస్తే ఎంతో సంతోషిస్తారు" అన్నది.

సూర్యప్రతాపుడు "చెల్లీ! ముందు ఆ కాలంధరను, కాలభైరవ మాంత్రికుణ్ణీ అంతం చెయ్యనిదే నా మనస్సు మరో విషయంమీదికి మళ్లదు. కార్యసాధన జరిగిన తర్వాత అందరం తప్పకుండా కలుసు



కుంటాం. ఇక నువ్వు నీ సఖురాంద్రతో కలిసి నీ లోకానికి వెళ్లమ్మా!" అన్నాడు.

చిత్ర "అన్నయ్యా! ఇంత గొప్ప వుపకారం, మాకు చేసి కూడా, నన్ను ఏ విధమైన సాయమూ కోరని నీ గొప్ప మనస్సును అభినందిస్తున్నాను. నీ చెల్లెలు వుడతా భక్తితో ఇచ్చే ఈ చిరు కానుకను స్వీకరించు" అని తన మెడలో జాజ్వల్యమానంగా ప్రకాశించే ఓ హారాన్ని తీసి "ఈ హారంలో నా శక్తులలో కొన్నింటిని పొందుపరుస్తున్నాను. దీనికి నాయకమణిగా వున్న కెంపులో నా ప్రతిబింబం వుంటుంది. నా అవసరం ఏర్పడినప్పుడు హారంలోని కెంపును నుదుటికి సోకించుకుని పిలిస్తే తక్షణం నీ ముందుంటాను. అయితే, నేనేదైనా ముఖ్యమైన పనిలో వుండి రావటం ఆలస్యమైతే మాత్రం క్షమించాలి" అని హారాన్ని ప్రతాపుడి మెడలో వేసింది.

ప్రతాపుడు హారాన్ని కళ్ళకద్దుకుని "ఇక నువ్వు వెళ్లిరా చెల్లీ!" అన్నాడు.

అలా అనటంలో అతడి ఆంతర్యం అర్థం చేసుకుని నవ్వుకుంటూనే ఆ గంధర్వరాజ పుత్రి తన సఖురాంద్రతోబాటు అంతర్హితురాలైంది.

సూర్యప్రతాపుడు అడుగు ముందుకు వేయబోతూండగానే, అంతవరకు ఓ ప్రయోజనం కోసం సృష్టించబడిన శివాలయం అదృశ్యమైంది. గుర్రం కోసం అటూ ఇటూ చూశాడు. గుర్రం తనదగ్గరికి రాగానే, దానిని ఆరోహించి బాటవేపు నడిపించాడు.

కొంత దూరం వెళ్లగానే అతడు తన మెడలోని హారం మధ్యన వున్న కెంపును నుదుట సోకించుకుని మనస్సులోనే చిత్రని స్మరించుకున్నాడు. మరుక్షణం - అశ్వం ముఖం ముందు అల్లంత దవ్వులో పైన సాక్షాత్కరించి అశ్వంతోబాటు తనూ ప్రయాణిస్తూ "ఏం కావాలన్నయ్యా?" అన్నది చిత్ర. సూర్యప్రతాపుడు "నీ సహాయం లభించినప్పుడు ఇంకా ఈ గుర్రం మీద ఆలస్య ప్రయాణం ఎందుకమ్మా! అదీగాక కాలంధర కోట ఎక్కడున్నదో నాకు తెలీదు కదా! నన్ను గుర్రంతోబాటు ఆ మంత్రగత్తె నివాసానికి చేర్పించు" అన్నాడు.

చిత్ర నవ్వుతూ "అలాగే - కళ్లు మూసి తెరిచేసరికి అక్కడ వుంటావులే" అని మాయమైంది.

175

సూర్యప్రతాపుడు కళ్లు మూసుకుని కొద్దిసేపటికి మళ్లీ తెరిచాడు. అతడి కళ్లకు కాలంధర తాంత్రిక కోట కనిపించలేదు. అక్కడక్కడ చెట్లూ చేముతో, పంట పొలాలతో కూడుకున్న జనసంచార యోగ్యమైన ప్రదేశంలో వున్నాడు. దగ్గరలో ఓ పల్లెటూరు మాత్రం కనిపిస్తున్నది.

మళ్లీ చిత్రను స్మరించుకుందామనుకుని, అంతలోనే అభిమానం అడ్డు వచ్చి, చీటికీ మాటికీ ఆడపిల్ల సాయం కోరటం బేలతనం అవుతుందని భావించి, కాలంధర గురించి ఆ పల్లెటూరిలోనే విచారించి, తర్వాత సంగతి ఆలోచించుకోవచ్చునని భావించాడు.

ఆ ప్రకారంగానే సూర్యప్రతాపుడు గుర్రాన్ని నడిపించికుంటూ, పల్లెలోకి వెళ్లాడు.

అంతకు ముందు సూర్యప్రతాపుడితో బాటు గురుకులంలో చదువుకున్న విదిశాపుర యువరాజైన ప్రసేనపాలుడికి జరిగిన అనుభవాలన్నీ వరుసగా - రచ్చబండ మీద చుట్ట కాల్చుకునే వ్యక్తి, పల్లె మధ్యలో పెద్ద ఇల్లు, అందగత్తె, ఆమె వయ్యారాలు....అన్నీ సూర్యప్రతాపుడికి కూడా జరిగాయి.

చివరకు సూర్యప్రతాపుడు శిరస్సు మాత్రం మానవ లక్షణాలు, కదలికలు కలిగి, మిగిలిన శరీరమంతా శిలగా మార్పు చెంది; తనలాగే దురవస్థకులోనైన రాజపుత్రుల గుంపులో తనూ ఒకడుగా చేరిపోయాడు. అక్కడ మదనుడు, వీరసింహుడు కనిపించేసరికి దిగ్భ్రాంతుడయ్యాడు. అంతేకాదు - తన సహాధ్యాయి, ప్రియ మిత్రుడు అయిన ప్రసేనుడు కూడా అక్కడ వుండటం



గమనించాడు.

మదనుడు సూర్యప్రతాపునితో "బావగారూ! అన్నయ్య కూడా నాలాగే శిరోమాత్ర మానవ రూపుడై ఇక్కడికి చేరుకోవటానికి విచారిస్తూన్న నేను మిమ్మల్ని కూడా ఇదే దుస్థితిలో చూడ గలుగుతున్నాను. మీరైనా, ఎలోగా ఈ రహస్యం తెలుసుకుని తమరు వుద్ధరిస్తారన్న ఆశతో వుండిపోయాను. ఆ ఆశ కూడా పూర్తిగా అడుగంటి పోయింది" అన్నాడు.

సూర్యప్రతాపునితో "విచారించకు మదనా! ఇక్కడ వున్న సోదర రాజపుత్రులంతా మనలాగే కాలంధరను వెతుకుతూ వచ్చిన వారే అను కుంటున్నాను. నువ్వెలా ఇక్కడి వచ్చావు?" అని అడిగాడు.

ప్రసేనుడు సూర్యప్రతాపునితో "మిత్రమా! మీ మదనుడు, వీరసింహుడు, నేను ఇక్కడ వున్న రాజపుత్రులు, అందరం ఒక పల్లెటూరిలోని అందగత్తె మాయాజాలంలో పడి ఈ స్థితిలో ఇక్కడున్నాం. బహుశా నీకు కూడా పల్లెటూరు, అందగత్తె తటస్థపడి వుండాలే?" అన్నాడు.

సూర్యప్రతాపుడు ఆశ్చర్యంతో "అవును ప్రసేనా! అయితే, కాలంధర సృష్టించిన మాయే అదంతా అయి వుంటుందా?" అన్నాడు.

మొట్టమొదటిసారిగా అక్కడికి చేరిన విదర్భ రాకుమారుడు జయుడు "అందులో అనుమానం ఏమీ లేదు సోదరా! ఆ మంత్రగత్తె ఎందుకు ఇక్కడికి మనబోటి రాకుమారులందర్నీ తెచ్చి పడేస్తున్నదోనన్న విషయం గురించి, ఇంతకు ముందు ఓమారు అందరం చర్చించుకున్నాం. తన ప్రయత్నానికి ఆటంకం కలిగించే శక్తి సామర్థ్యాలు కలిగిన వారినందరినీ ఇలా కదలక మెదలక చేసి, బలి పూజను నిర్విఘ్నంగా కొనసాగించుకోవాలని ఆ మంత్రగత్తె సంకల్పం" అన్నాడు.

ఆ విషయమై అక్కడి రాజపుత్రులంతా చాలా సేపు తర్జనభర్జనలు చేశారు. వాళ్ళ తార్కిక వాదాలను వింటూ అంతసేపట్నుంచి అదే విషయాన్ని ఆలోచిస్తున్న వీరసింహుడు ఉత్సాహంతో "కాలంధర తాంత్రిక కోట నిస్సందేహంతో ఈ ప్రాంతంలోనే వుండి వుంటుంది. నన్ను, మా సూర్యప్రతాపుణ్ణి, మా మదనుణ్ణి ఇక్కడికి చేర్చించిన శక్తులు సరిగానే తమ కర్తవ్యాన్ని నిర్వర్తించాయి. అయితే, ప్రతి విషయాన్ని ఎంత జాగ్రత్తగా పసికట్టే కాలంధర తన మాయజాలంతో ప్రస్తుతం తన నివాసాన్ని మన కళ్ళకి కనిపించని విధంగా మన మీద కనికట్టు విద్యను ప్రయోగించింది. మనం ఎక్కడో దూరప్రాంతంలో వుండేట్టు చిత్తభ్రమ కలిగించటానికే అది తన మాయతో ఆ పల్లెటూరును సృష్టించింది" అన్నాడు. అతడి బుద్ధి కుశలతను అక్కడున్న రాజపుత్రులందరూ అభినందించారు. — (ఇంకావుంది)





[జరిగిన కథ: వీరసింహుని తలను పట్టుకుని ఏడుస్తున్న సువర్ణ తానూ ప్రాణత్యాగం చేయాలనుకుంటుంది. అప్పుడు మర్రిచెట్టు కదిలి, శాపగ్రస్తుడైన గంధర్వరాజు చిత్రసేనుడుగా మారిపోతాడు. పాము రూపం పోయి సుచిత్ర కూడా తన నిజరూపం పొందుతుంది. చిత్రసేనుడు సువర్ణను ఓదార్చి, వీరసింహుని తలను మొండానికి చేర్చి అతనికి ప్రాణప్రతిష్ఠ చేస్తాడు. తర్వాత వీరసింహుని మీద సంకల్పసిద్ధిని ప్రయోగించి కాలంధర కోట దగ్గర ఉండగలవు అని చెప్పి, సుచిత్రతో గంధర్వ లోకానికి వెళ్ళిపోతాడు. వీరసింహుడు తాను చేరినచోటు కాలంధర కోట కాదనీ, తెలుసుకుంటాడు. అక్కడ తనకు కనిపించిన పల్లెటూరి వైపు వెడతాడు....అక్కడ శివాలయంలో చిత్ర తన వృత్తాంతాన్ని సూర్యప్రతాపునికి చెప్పి తన మెడలోని హారాన్ని అతని మెడలో వేస్తుంది. సూర్యప్రతాపుడు అందులోని కెంపును నుదుటికి సోకించుకుని తను కాలంధరకోట దగ్గర ఉండాలనుకుంటారు. కానీ అతనూ ఆ పల్లెటూరి దగ్గరకే చేరుకుంటాడు. ఆ పల్లెలో అంతకు ముందు అతని మిత్రుడు ప్రసేనపాలునికి జరిగిన అనుభవాలన్నీ సూర్యప్రతాపునికీ జరిగాయి. శిలారూపుడై, అంతకుముందు శిలారూపులైన మిగతా రాజ కుమారుల వద్దకు చేరుకుంటాడు. అక్కడ మదనుడు, వీరసింహుడు కూడా ఉండటం గమనిస్తాడు. తర్వాత శిలారూపులందరూ కాలంధర కోట గురించి తర్జనభర్జనలు చేస్తూంటారు.

— ఇక చదవండి.]

కాలంధర తాంత్రిక కోట అదృశ్యంగా ఆ ప్రాంతంలోనే ఉన్నట్లు రాజపుత్రులంతా రూఢి పరచుకోగానే వాళ్ళలో కలిగిన ఆనందం ఎంతోసేపు నిలువలేదు. తలలు తప్ప తక్కిన శరీరభాగాలన్నీ శిలామయంగా వుండే దుస్థితి నుంచి తప్పించుకోవటమెలాగా అన్న విషయం వాళ్ళను తీవ్ర మనస్తాపానికి గురిచేసింది.

కంఠం నుంచి క్రిందిదాకా రాయిగా వున్నందున సూర్యప్రతాపుడు తన మెడలోని హారాన్ని నుదుటికి సోకించుకునే అవకాశంలెదు

వాళ్లు వున్న చోట ఓ పెద్ద బూరుగుచెట్టు ఉన్నది. ఆ చెట్టు కొమ్మల్లో ఒకటి సూర్యప్రతాపుడి తలకు పైభాగందాకా విస్తరించి వున్నది. అప్పుడే కొమ్మ మీదికి ఓ గ్రద్ద వచ్చి, సూర్యప్రతాపుడి తలకు సరిగ్గా కూర్చున్నది. అది కూర్చోగానే, ఆ కొమ్మకు సంబంధించిన ఓ చిన్న ఎండుపుల్ల



విరిగి సూర్యప్రతాపుడి తల మీద పడింది.

తల మీద నుంచి ముఖం మీదుగా క్రిందికి జారుతున్న ఎండుపుల్లను ప్రతాపుడు నోటి దగ్గరికి వచ్చేసరికి రెండు వరుసల పళ్లతో దానిని బిగించి పట్టుకున్నాడు.

శిలామయంగా మారిపోయిన చేతులు చేయలేని పనిని ఏదోవిధంగా సాధించాలన్న ఉద్దేశ్యంతో సూర్యప్రతాపుడు అలా ప్రయత్నిస్తున్నాడన్న విషయాన్ని అర్థం చేసుకున్న వీర సింహుడు, మదనుడు, తక్కిన రాజపుత్రులు ఉత్సుకతతో చూడసాగారు. అణగారిన ఆశ వాళ్ల మనస్సులో తణుకు మిణుకు మనసాగింది.

సూర్యప్రతాపుడు పళ్ల పట్టును కొద్ది కొద్దిగా సడలిస్తూ, ఎండుపుల్ల తన నోటి నుండి జారిపోకుండా జాగ్రత్త పడుతూ, కొద్దిసేపటికి పుల్ల ఓ వేపు చివరిభాగం మాత్రం తన పళ్ల మధ్యన ఉండిపోయే స్థితికి దానిని తెచ్చాడు. ఆ తర్వాత తలను క్రిందికి వాల్చి, ఎండుపుల్ల అటు ప్రక్క చివరకు తన మెడలోని హారం మధ్యలోని కెంపు తగుల్కొనేట్లు చేశాడు. నెమ్మదిగా తలను పైకి ఎత్తుతూ, పుల్లతోబాటు హారం కూడా పైకిలేచే పరిస్థితిని ఏర్పరిచాడు. మరికొంతసేపటికి అతడి శ్రమ ఫలించింది. అక్కడి రాజపుత్రులందరి ముఖాలు పౌర్ణమినాటి చంద్రబింబాల్లా ఆ దృశ్యాన్ని చూస్తూ వెలుగుతూండగా, ఎండుపుల్ల అటు ప్రక్క చివరిభాగం నుంచి జారుతూ హారం మధ్య భాగం ప్రతాపుడి నుదుటిమీద పడింది. మధ్య భాగంలోని కెంపు నుదుటిని తాకగానే ప్రతాపుడు సంతోషం పొంగులువారే స్వరంతో "చెల్లీ, గంధర్వ రాజపుత్రీ! చిత్రా!!" అని పిలిచాడు. మరుక్షణం - అందరి కళ్లకు ఆశాజ్యోతిలా - సౌందర్యరాశియైన చిత్ర ప్రతాపుడి కళ్లెదుట సౌమ్యస్వరూపంతో ఆవిర్భవించింది.

అలా సన్నిధికాగానే ఆశ్చర్యవిషాదాలతో ప్రతాపుణ్ణి చూస్తూ "ఇదేమిటన్నయ్యా? కాలంధర మాంత్రికురాలి నివాసానికి చేర్పించమని నన్నడిగావు కదా? ఇక్కడిలా అయిపోయావెందుకు? నీలాగే తలలు తప్ప తక్కిన శరీరభాగాలు రాళ్ళుగా ఉన్న ఈ అన్నయ్యలంతా ఎవరు?" అని అడిగింది.

ప్రతాపుడు "చెల్లీ! నీ ప్రశ్నలన్నిటికీ సమాధానం చెబుతాను గాని, ముందు ఆ మాంత్రికురాలి నివాసానికి వెళ్లి, దానికి తెలియకుండా అది

మాయకు మంత్రాలకు ఉపయోగించే తంత్రకోలను తీసుకుని వచ్చి మాకందరికి సోకించు" అన్నాడు.

చిత్ర "అలాగే" అని చెప్పి అదృశ్యురాలైంది. అప్పటికి రాకుమారులందరికి తిరిగి యథాపూర్వ రూపాలను పొందగలమన్న నమ్మకం కలిగింది.

వారంతా ప్రతాపుణ్ణీ, చిత్రనూ, రకరకాలుగా అభినందిస్తూండగానే, మరికొద్ది సేపటికి మంత్ర కోలతో చిత్ర ప్రతాపుడి ముందు వెలసింది.

చిత్ర సంతోషంతో "అన్నయ్యా! అదృశ్యరూపంలో నేను వెళ్లిన సమయానికి ఆ మంత్రగత్తె తన అరలో లేదు. అది కాలభైరవుడితో ఏదో చర్చించ డానికి పాతాళలోకానికి వెళ్లిందట" అంటూనే తన చేతిలోనే మంత్రదండాన్ని ప్రతాపుడికి తగిలించింది.

వెంటనే ప్రతాపుడి మెడనుండి క్రింది భాగం పూర్తిగా ఆవరించుకుని ఉన్న రాతిరూపం తొలగి పోయింది. కాళ్లు గట్టిగా ఝాడిస్తూ, చేతులు పైకెత్తి విదిలించుకుంటూ, ఆనందంతో తన ఆత్మీయులందరివైపూ చూస్తూండగానే చిత్ర మంత్రకోలను ఒక్కొక్కరికీ సోకిస్తూ, కొద్ది సేపటి లోనే అందరినీ యథాపూర్వ రూపులను చేసింది.

రాజపుత్రులంతా చిత్రను చూస్తూ, "చెల్లీ! నువ్వు మా పాలిటి దేవతవమ్మా!" అని కొనియాడారు.

చిత్ర వాళ్ళతో "అన్నయ్యలూ! మీరింకా చాలా పెద్దకార్యాలు సాధించాలి. ఆ పనుల్లో తోడ్పడిన తర్వాత విజయం సాధించి నన్ను అభినందించు దురుగాని! మీరంతా మాట్లాడుకుంటూ



ఉండండి. ఈ మంత్రకోలను మళ్ళీ యథాస్థానంలో పడేసివస్తాను. లేకపోతే ఆ మంత్రాలముండ అసలు సంగతి తెలుసుకుని మీకు మళ్లీ అపకారం తలపెడుతుంది" అని చెప్పి మాయమై పోయింది. కొద్దిసేపటికే వాళ్లముందు మళ్ళీ ప్రత్యేక్ష మైంది.

ప్రతాపుడు చిత్రతో "చెల్లీ! కాలంధర తాంత్రిక కోట ఈ ప్రాంతంలోనే ఉన్నట్లు అను మానంగా ఉన్నది. మా కంటపడకుండా ఆ కోటను అదృశ్యంగా వుంచిందా, లేక మాకు ఇంద్రజాలాన్ని ప్రదర్శించుతున్నదా అన్నది తేలటంలేదు. నీకే మైనా కనిపిస్తున్నదా?" అన్నాడు.

వెంటనే "మీ చెల్లెలి శక్తులు కొంతవరకే పరిమితం బావగారూ! నా శక్తితో ఆ మాంత్రికు



రాలి తాంత్రిక కోటను బయల్పరుస్తానుండండి" అన్న మాటలు వినిపించగానే ఆ స్వరాన్ని గుర్తు పట్టిన సూర్యప్రతాపుడు, చిత్ర సంతోషంతో ఒకరి మొహాలు ఒకరు చూసుకుంటూ చిరునవ్వు వెలయించారు. తమ బావమరిదికి మరో కొత్త బావమరిది ఎవరా అని మనుడు, వీరసింహుడు వింతగా చూడసాగారు. ఆగంతకుడు ఎవరైనా తమకు ఆత్మీయుడే అయిఉంటాడని భావిస్తూ, తక్కిన రాజపుత్రులు కూడా ఉత్సాహంతో ఎదురు చూశారు.

మరుక్షణం — తలమీద ఓ దివ్యమణి దేదీప్యమానంగా ప్రకాశిస్తూండగా నీలనీరద గంభీరరూపుడైన ఓ అందాల యువకుడు అక్కడ ఆవిర్భవించాడు.

అతణ్ణి చూడగానే సూర్యప్రతాపుడు "రత్నపాలా! ఎన్నాళ్ళకి నిన్ను చూడగలుగుతున్నాను మిత్రమా!" అంటూ గట్టిగా కౌగలించుకున్నాడు.

రత్నపాలుడు ప్రతాపుణ్ణి పొదివిపట్టుకుని, ఆనందంతో కుశలప్రశ్నలు వేశాడు. వీరసింహునికి పాదాభివందనం చేశాడు. మదనుణ్ణి కౌగలించుకుని, తక్కిన రాజపుత్రులందరినీ ఆదరంగా సంభావించాడు.

ఆ తర్వాత అతడు ప్రతాపునితో "మిత్రమా! ఇప్పటిదాకా తన నివాసాన్ని మీ అందరికంటా పడకుండా చేసింది కాలంధర! ఇప్పుడు ఆ మంత్రగత్తె కోట మీకు కనిపిస్తూ, మీరెవరూ ఆ మంత్రగత్తెకుగాని, దాని అనుచరులకు గాని కనిపించకుండా వుండేట్టు నా నాగమహిమను ప్రేరేపిస్తున్నాను. మీ పనులన్నీ పూర్తయ్యేదాకా ఇక్కడ నిర్భయంగా ఉండండి. అంతేకాదు — నీకు ఓ మహిమాన్విత సాధనాన్ని కూడా ఇస్తాను" అని తన తల మీది మణిని చేత్తో తీసుకుని "దీనిని ధరిస్తే, నువ్వు కోరుకున్నప్పుడు ఇతరుల కంటపడవు. మరోమాట — దీనికి కామగమన శక్తి కూడా ఉన్నది. ఇప్పటి నుంచి ఈ దివ్యమణి నీ అభీష్ట ప్రకారం నడుచుకుంటుంది. ప్రస్తుతం నాకు, చిత్రకు ఓ ముఖ్యమైన పని ఉంది. మేము వెళుతున్నాం" అని చెప్పి ఆ మణిని ప్రతాపుడికిచ్చి, చిత్రతోబాటు అదృశ్యుడయ్యాడు.

తలవని తలంపుగా ప్రతాపుడికి పూర్వ మిత్రుడు, చిత్రకు ప్రియుడు అయిన ఆ నాగకుమారుడు అక్కడకు వచ్చేసి, తమకు సహాయం చేసివెళ్లి

నందుకు రాజపుత్రులంతా సంతోషించారు.

అంతలోనే — ఆ ప్రాంతమంతా పెద్ద కోలాహలంతో నిండిపోయింది. వాళ్లు చూస్తుండగానే చాలా సమీపంలో ఓ బ్రహ్మాండమైన కోట ఏర్పడింది. ఆ కోట గోడలమీదా, బురుజుల మీద పలు విధాల భయంకరాయుధాలను ధరించిన భీకర రాక్షసులు కొండల్లా నిల్చుని కాపలా కాస్తూ కనిపించారు. వికృతస్వరాలతో కేరింతలు కొడుతూ, భూత ప్రేత పిశాచాలు ఆ కోట చుట్టూ తిరుగుతున్నాయి!

రత్నపాలుడి నాగమహిమవల్ల బయల్పడిన కాలంధర కోట అదేనని గ్రహించిన ప్రతాపుడు "చూశారా? ప్రక్కనే ఉండి కూడా మనం తెలుసుకోలేక పోయాం. ఇప్పుడు మనమెవ్వరం ఆ కోట వాసులకి కనిపించటంలేదు" అన్నాడు.

వీరసింహుడు "అవును. చిత్ర, రత్నపాలుడు వచ్చి, స్తబ్ధంగా వున్న మన జీవితాలకు చైతన్యవంతమైన ఓ మళుపుత్రిప్పారు. ఇక-మనం ఆ తాంత్రికురాలి కోటలోకి చొరబడదామా?" అన్నాడు.

అప్పటికే కర్తవ్యాన్ని నిర్ణయించుకుని వున్న సూర్యప్రతాపుడు "బావగారు? శతృస్థావరాలమీదికి వెళ్ళేటప్పుడు, అక్కడి పరిస్థితిని పూర్తిగా తెలుసుకోవటం విజ్ఞుల లక్షణం. మీరంతా ఇక్కడే వుండండి. దివ్యమణి సహాయంతో ఎవరి కంటా పడకుండా నేను కోటలోకి వెళ్ళి, అవసరమైన విశేషాలు సేకరించుకుని వస్తాను" అన్నాడు.

అతడు చెప్పిందే సరియని రాజపుత్రులంతా అనటంతో వీరసింహుడు ప్రతాపుణ్ణి చూస్తూ



"అలాగేచెయ్యి" అన్నాడు.

మణిని స్మరించుకుని, కామగమనాన్ని అదృశ్యతను తనలో సంకల్పించుకోగానే - ప్రతాపుడు అక్కణ్ణుంచి మాయమయ్యాడు.

తనవదినె, మనోహరి, గుణసాగరి, సుగంధమాల, సువర్ణ, మొదలైన రాజ పుత్రికలు, దేశదేశాల యువతులు బంధించబడిన అరలోకి చేరుకోవాలని మొదట ప్రతాపుడు సంకల్పించుకుని వున్నందున క్షణంలో అక్కడికి చేరాడు.

అప్పటికి - కాలుంధర ఆ అరలోకి వచ్చి చేరుకున్నది. తన అనుచరురాండ్రతో అక్కడి కన్యలను, యువతులను వరసలు వరుసలుగా నిల్చోబెట్టించి, మరి కొందరిచేత వాళ్లను లెక్క పెట్టిస్తున్నది.



కొంత సేపటికి మాంత్రికురాలి అనుచరాండ్రతో ఒకతె "గురుమాతా! మనకు పనికి వచ్చే కన్నెల సంఖ్య తొమ్మిదివందల అరవైరెండు. ఈ లెక్కన ఇంకా ముప్పైయెనిమిది మంది కన్యలు కావాలి. పాతాళమాంత్రిక గురువుగారి కోసం తెప్పించిన - రాజవంశాలకి చెందిన యువతులు వంద మంది సరిపోయారు. ఇతర జాతుల యువతులు సంఖ్య లక్షకు నూటొక్క మంది తక్కువగా వున్నారు" అని వివరించి చెప్పింది.

కాలంధర తలవూపి "అయితే, ముప్పైఎనిమిది మంది కన్యలను రెండు రోజులలోగా ఇక్కడికి చేర్పించాలని మాయావికి చెప్పు. నూటొక్కమంది యువతులను తీసుకువచ్చే బాధ్యతను జంబోదరునికి అప్పగించు. నేను ఈ రోజంతా మంత్ర గ్రంథాలను తిరగేయవలసి వున్నది. ఇక అరలకు తలుపులను బిగించి, పనికత్తెలతో కలసి నువ్వు బైటికిరా" అని చెప్పి అక్కణ్ణుంచి వెళ్ళిపోయింది.

ఆ తర్వాత అనుచరురాలు పనికత్తెలతో అరలను మూయించి, అక్కడినుంచి వారితో కలసి వెళ్ళిపోయింది.

వాళ్ళు వెళ్ళిపోగానే ప్రతాపుడు దివ్యమణిని స్మరించుకుని తన్ను బయల్పరచుకున్నాడు. అతడు సునంద పాదాలకు నమస్కరించాడు ఆమె మహదానందంతో పొంగిపోతూ "బాబు! ఈ మాయకోటలోకి నువ్వెలా వచ్చావు తండ్రీ?" అన్నది.

ప్రతాపుడు క్లుప్తంగా అప్పటిదాకా జరిగిన సంగతులన్నీ సునందకు చెప్పాడు. మనోహరి పరుగెత్తుకుంటూ వచ్చి ప్రతాపుణ్ణి కౌగలించుకున్నది. ఆమెతోబాటు గుణసాగరి, సుగంధమాల, సువర్ణ, ప్రసేనుడి చెల్లెలైన మందారవల్లి, మరికొంత మంది రాజకన్యలు ప్రతాపుడి దగ్గరికి వచ్చి ఆనందంతో అతణ్ణి చూడసాగారు.

మనోహరి "అన్నయ్యా! ఆనాడు నువ్వు వదినెను, విజయపురి యువతులను ఎత్తుకుపోతున్న జంబోదర రాక్షసుడికాలి చిటికెన వ్రేలిని పట్టుకునిపోతూ జారిపడ్డావు. అప్పుడు పక్షి రూపంలో వచ్చి నిన్ను కాపాడిందెవరనుకున్నావు?" అన్నది.

ప్రతాపుడు గోముగా మనోహరి తలమీద చిన్న మొట్టికాయవేసి "మన బావగారు - మదనులవారు! ఇప్పుడు మరో బావగారైన వీరసింహులవారు,

చిన్నబావ మదనుడు, ప్రసేనాది రాజపుత్రులైన నా మిత్రులు కాలుంధర కోటకు సమీపంలో వున్నారు. అదృశ్యంగా నేనిక్కడికి వచ్చాను. కన్నుల పండువుగా మిమ్మల్ని చూశాను. త్వరలో ఈ మంత్రగత్తె పీచమణిచి, కాలభైరవ మాంత్రి కుణ్ణి వధించి మీ అందరికి విముక్తి కలిగించటానికే మేమంతా పథకాలు వేసుకుంటూ వున్నాం. మీరంతా ధైర్యంగా వుండండి." అని చెప్పి, వదినెను వీడ్కొని మణిని స్మరించుకున్నాడు.

వెంటనే ప్రతాపుడు ఆ అరనుంచి అంత ర్ధానమై అదృశ్యరూపంలో కాలంధర అరలో ఆ మంత్రగత్తె సమీపంలో వుండిపోయాడు.

అప్పటిదాకా తనను ప్రశ్నలమీద ప్రశ్నలు వేస్తూ విసిగిస్తున్న అనుచరురాలిని విసుగుతో చూస్తూ "ఓసి నీవల్ల మాలిన ప్రేమ లగుల బడితేగాను? నాకూ, మన గురువుగారికీ, ప్రాణ భంగం లేదనీ, వాటిని అతి భయంకర ప్రదేశంలో సురక్షితంగా మా మంత్ర మహిమతో వుంచామనీ ఎన్నిసార్లు చెప్పినా, అలా భయపడతావేమే? ఇంకెప్పుడూ ఇలాంటి ప్రశ్నలతో నన్ను వేధించ కుండా, మా ప్రాణాలు ఎక్కడ ఏ రూపంలో వున్నాయో జాగ్రత్తగావిను..." అని తన అనుచరు రాలికి వివరంగా చెప్పటం ప్రారంభించింది.

కాలభైరవ మాంత్రికుడి ప్రాణాలూ, కాలం ధర ప్రాణాలూ, ఎక్కడ నిక్షిప్తమై వున్నవో, అక్కడికి చేరటం ఎంత కష్టమో, ప్రతాపుడు కాలంధర నోటి ద్వారానే వివరాలు శ్రద్ధగా వినటం ప్రారంభించాడు. అంతా పూర్తయ్యాక ఇప్పుడు



నీ భయం తీరిపోయిందా - ఇంకా ఏమైనా సందేహాలున్నాయా?" అని అడిగింది కాలంధర - అనుచరురాలు "చాలా కాలంనుంచి నిన్ను కనిపెట్టుకుని వున్న దానిని కాబట్టి, ఈ వుపద్రవ సమయంలో నీవు నీ ప్రాణ రహస్యం చెప్పి ధైర్యం కలిగించావు తల్లీ! ఇక నిన్ను ఎవ్వరూ ఏమీ చెయ్యలేరు" అని ఆవులిస్తూ నిద్రకువ క్రమించింది.

తలవని తలంపుగా తాను ఓ ముఖ్యమైన రహస్యం తెలుసుకున్నందుకు సంతోషిస్తూ ప్రతాపుడు అక్కణ్ణుంచి తన మిత్రుల దగ్గరికి చేరుకునేట్టు దివ్యమణిని సంకల్పించుకున్నాడు.

అప్పటిదాకా ఎంతో ఆతురతతో అతడికోసం నిరీక్షిస్తున్న వీరసింహుడు, మదనుడు, ప్రసేనుడు,

సంతోషంతో ప్రతాపుణ్ణి చుట్టుముట్టారు.

ప్రతాపుడు వీరసింహునితో "బావగారూ! అక్కడ వదినెగారు, మనోహరి, గుణసాగరి, సుగంధమాల, మందారవల్లి, ఇంకా ఇక్కడున్న మనమిత్రుల చెల్లెంద్రతోబాటు దేశదేశాలనుండి ఆ మంత్రగత్తె తెప్పించిన వారందరూ క్షేమంగా వున్నారు. నేను వారిని చూసి ధైర్యం చెప్పి వచ్చాను. అంతేకాదు - పాతాళ మాంత్రికుడికి, కాలంధర మంత్రగత్తెకు సంబంధించిన ప్రాణ రహస్యాలను కూడా వివరంగా తెలుసుకుని వచ్చాను" అన్నాడు.

మదనుడు ఆశ్చర్యంతో "ప్రాణ రహస్యమా?" అన్నాడు. ప్రతాపుడు తాను విన్నదంతా విపులంగా వివరించాడు.

వీరసింహుడు "కాలంధర బలికర్మకూ, కాల భైరవుడి పాతాళహోమానికి ఇంకా కొద్దిరోజులు వ్యవధి మాత్రమే వున్నది. ఈలోగా మనం వారిద్దరి ప్రాణాధారాలను సాధించాలి. లేకపోతే, ఇంతవరకూ మనమందరం పడిన పాట్లన్నీ బూడిదలో పోసిన పన్నీటి చుక్కలవుతాయి" అన్నాడు.

విదర్భరాజ పుత్రుడైన జయుడు "అవును ప్రతాపా! బావగారి ఆలోచన సమంజసంగాను, మనకు తక్షణ కర్తవ్యంగాను వున్నది. ముందు వాళ్ళ ప్రాణరహస్యాలను ఛేదించుదాం బయలు దేరండి" అన్నాడు.

తక్కిన రాజపుత్రులంతా ఉత్సాహంతో అతడి మాటలను బలపరిచారు. సూర్యప్రతాపుడు వారి మాటలకు తల అడ్డంగా వూగిస్తూ "దయచేసి మీరంతా ఇక్కడే వుండండి. నేనొక్కడినే వెళ్ళి వాటిని సాధించుకుని వస్తాను.

మదనుడు "ప్రతాపా! ఎంత ప్రమాదకరమైన ప్రదేశంలో వాళ్ళు తమ ప్రాణాలను నిక్షిప్తం చేశారో నువ్వే చెప్పావు. అటువంటి చోటికి ఒంటరిగ వెళతారా? అందరం కలిసి వెళ్ళటం మంచిది" అన్నాడు.

— (ఇంకావుంది)





24

[జరిగినకథ: శిలారూపంలో ఉన్న రాజపుత్రులందరూ కాలంధర కోట గురించి ఆలోచిస్తుండగా అనుకోని విధంగా చెట్టుపైనుంచి తన మీదపడిన ఒకపుల్ల సహాయంతో సూర్యప్రతాపుడు తన మెడలోని మణిని నుదిటికి సోకించి, గంధర్వకన్య చిత్రను స్మరిస్తాడు. ఆమె ప్రత్యక్షమై కాలంధర దగ్గరున్న మంత్రకోలను తెచ్చి సూర్యప్రతాపునికీ, అతని మిత్రులకు సోకించగా శిలా రూపులందరికీ యథారూపం వస్తుంది. అంతలో అక్కడ చిత్రకు ప్రియుడు, ప్రతాపునికి మిత్రుడూ అయినా రత్నపాలుడు ఆవిర్భవించి, తన తలమీది మహిమానిత్యమై మణిని సూర్యప్రతాపునికి ఇచ్చి, అక్కడి రాజకుమారులందరూ ఎవరి కంటా పడకుండా వారిపై నాగమహిమను ప్రేరేపించి చిత్రతో కలసి అదృశ్యుడవుతాడు. అప్పుడు రాజపుత్రులందరికీ దగ్గర్లోనే కాలందరకోట కనిపిస్తుంది సూర్యప్రతాపుడు దివ్యమణి సహాయంతో అదృశ్యరూపంలో వెళ్ళి కోటలో బందిలై ఉన్న తన వదినె, మనోహరి, గుణసాగరి ఇతర యువతులను కలుసుకుని వారికి జరిగిన సంగతులన్నీ క్లుప్తంగా వివరించి, ధైర్యంగా ఉండమనిచెప్పి, అక్కడణ్ణించి మళ్ళి అదృశ్య రూపంలో కాలంధర అరలో ప్రవేశిస్తాడు. అక్కడ కాలందర తన ప్రాణాలు, కాలభైరవుని ప్రాణాలు ఎక్కడ నిక్షిప్తమై ఉన్నదీ, తన అనుచరురాలికి చెబుతుండగా విన్న సూర్యప్రతాపుడు వెంటనే అక్కడినుండి రాజకుమారులున్న చోటుకు వెళ్ళి వారికి విషయం చెపుతాడు. ఆ మాంత్రికుల ప్రాణరహస్యాలను ఛేదించుటకు రావటానికి అందరం కలసి వెళ్ళడం మంచిది అంటాడు మదనుడు. —ఇక చదవండి]

తన వెంట వస్తామని పట్టుబట్టిన రాజకుమారులకు నచ్చజెప్పి, సూర్యప్రతాపసింహు డొక్కడే మాంత్రికుడి ప్రాణాలూ, కాలంధర ప్రాణాలూ, నిక్షిప్తమైవున్న ప్రదేశానికి బయలుదేరాడు.

చిత్ర ఇచ్చిన మహిమాన్విత హారంవల్ల కామగమనంతోను, రత్నపాలుడిచ్చిన నాగమణి ప్రభావం వల్ల అదృశ్యరూపంతోను అతడు క్షణమాత్రంలోనే అక్కడికి చేరుకున్నాడు.

రకరకాల భూతప్రేత పిశాచాలూ, అతి భయంకరులైన రాక్షసులు, అనునిత్యం కేరింతలు కొట్టే మాయవనం అది. సూర్యప్రతాపుడు అక్కడ చేరిన తర్వాత - కాలంధర తన అనుచరురాలికి చెప్పిన వివరాల ప్రకారం మూడు తలల పులివుండే బిలం కోసం వెతికాడు. కొద్దిసేపటి

కిరణ్ కుమారి



తర్వాత ప్రతాపుడికి ఆ బిలం కనిపించింది. ఆ బిల ద్వారం ముందు మూడు తలల పులి అటు ఇటూ తిరుగుతూ కనిపించింది.

ప్రతాపుడు నిశబ్దంగా అడుగులో అడుగు వేస్తూ, పులిని తప్పించుకుని గుట్టుచప్పుడు కాకుండా లోపలికి వెళ్ళటానికి ప్రయత్నించాడు. మరుక్షణం పులి మూడు నోళ్ళ నుంచి భయంకర మైన అగ్నిజ్వాలలు చెలరేగాయి. ప్రతాపుడు దిగ్భ్రాంతుడై అలాగే నిల్చుండిపోయాడు.

అంతవరకు లేని అగ్నిజ్వాలలు అప్పుడే ఆ పులి నోళ్ళనుండి బయలు వెడలటానికి కారణం వెంటనే అతడికి స్ఫురించింది. అదృశ్యంగానో, ప్రత్యక్షంగానో, మాంత్రికుడికి అతడి అనుచరు రాలికి కీడు తలపెట్టే వ్యక్తులు బిలద్వారం చేరితే, ఆ పులి అలా అగ్నివర్షం కురిపిస్తుందని భావించాడు అతడు.

ఎంతసేపటికీ ఆ జ్వాలలు ఆరిపోక పోవడంతో ప్రతాపుడు కొంచెం వెనక్కి తగ్గాడు. అగ్నిజ్వాలలు మటుమాయమయ్యాయి. మళ్ళీ రెండడుగులు ముందుకు వెయ్యగానే, అగ్నిజ్వాలలు కూడా మళ్ళీ బిలద్వారం పూర్తిగా ఆవరించాయి. పులి అటు ఇటూ తిరగడం చాలించి, నిప్పుకణిక ల్లాంటి కళ్ళను నిశంతగా పెద్దవిచేసి నలు వేపులా కలియజూసింది. ఆ చూపులు తనకోసమే నని గ్రహించిన ప్రతాపుడు తనలో తాను నవ్వు కుంటూనే, పులిని సమీపించాడు. పులి ఇంకా కళ్ళతో వెతుకుతూనే వున్నది.

ప్రతాపుడు అగ్నిజ్వాలల వేడిమిని సహిస్తూనే పులితలల దగ్గరికి వెళ్ళి ఒరనుంచి కత్తి దూశాడు. ఉత్తరక్షణం అతడి చేతిలోని కరవాలం వ్రేటుకి పులి మూడుతలలూ బంతుల్లా ఎగిరి క్రింద పడ్డాయి. వెంటనే పులి మొండెం నుంచి చిమ్మిన గ్రోవులతో చిమ్మినట్టు రక్తధారలుపైకి ఎగిశాయి. అవి కొద్ది క్షణాలలోనే రక్తవర్షంగా మారి బిల ప్రదేశం చుట్టు ప్రక్కల ఉధృతంగా కురిశాయి. కొన్ని చినుకులు తనమీద పడగానే, అగ్నిలో దహించబడుతున్నట్టు విలవిలలాడుతూ ప్రతాపుడు అక్కడికి సమీపంలోని సరస్సు దగ్గరికి పరుగెత్తి అందులో దూకాడు. పులి మరణించినా, దాని రక్తం అగ్నివర్షంగా మారి చుట్టుప్రక్కల వారిని దహిస్తుందని అతడు తెలుసుకున్నాడు. కొంతసేపు కుత్తుకబంటి నీళ్ళలోనే వుండి శరీర తాపం తగ్గిన

187

తర్వాత బైటకి వచ్చాడు. ఏకదాటిగా కురుస్తున్న రక్తాగ్నివర్షం కొద్దిసేపటి తర్వాత పూర్తిగా మటు మాయమైంది.

ప్రతాపుడు ముందుకు కదిలాడు. బిలద్వారం లోపలికి ప్రవేశించబోతూన్న అతడి చేతిని ఎవరో గట్టిగా పట్టుకున్నట్లు కాగా విదిలించుకో బోయాడు. కాని, ఆ పట్టు అతణ్ణి వదలలేదు.

నాగమణి ధరించిన కారణంగా తాను అదృశ్యంలో వున్నాడు. అయినా, తనవునికిని పసికట్టి, ఇలా తనను ముందుకు పోనివ్వకుండా ఆపగలిగిన శక్తివంతుడు ఎవరై వుంటాడా - అని ప్రతాపుడు కొంతసేపు ఆలోచిస్తూనే, తన రూపాన్ని బయల్పరచుకున్నాడు.

మరుక్షణం - నీల నీరదగంభీరస్వరూపుడు, ఆకారం రాక్షసత్వం చాటుతున్నప్పటికీ అందంలో తన బావమరిదియైన మదనుడికి ఏమాత్రం తీసిపోకుండా - అదే పోలికలతోవున్న ఓ రాక్షస యువకుడు కూడా అతడి ముందు బయల్పడ్డాడు.

ప్రతాపుడి చేతిని బిగించి పట్టుకున్న ఆ రాక్షస యువకుడు చిన్నగా నవ్వి "మిత్రమా! శతృవువైనా నీ సాహసగుణాన్ని మెచ్చుకుంటున్నాను. ఈ భయంకర మాయామయవనంలో ప్రవేశించ టానికే మానవమాత్రులకు సాధ్యంకాదు. అటు వంటప్పుడు ఇంతదూరం రాగలిగి, పులిని సంహరించి, మరణించిన ఆ పులి సృష్టించిన ప్రాణోపద్రవాన్ని కూడా తప్పించుకుని నువ్వు ఎక్కడికి ఎందుకు వెళ్ళుతున్నావో నాకు బాగా తెలుసు. కాని, ఇప్పుడు నీ ప్రయత్నం వృధా



అని చెబుతూ, నిన్ను హెచ్చరిస్తున్నాను. ఇంత టితో వెనుతిరిగి, నీ ప్రాణాలు కాపాడుకొమ్మని కోరుతున్నాను. నేను కాపలాగా వున్నంతకాలం మా గురువైన కాలభైరవ రాక్షస మాంత్రికుడి ప్రాణాలుగాని ఆయన అనుచర శిష్యురాలైన కాలంధర ప్రాణాలనుగానీ నువ్వు స్వాధీన పర్చుకోలేవు. వెళ్ళు, వెనక్కివెళ్ళు" అన్నాడు.

అతడి మాటలతీరు, ఉచ్చారణ, ధ్వని, అచ్చం మదనుడి కంఠస్వరాన్ని అనుకరిస్తున్నట్లే వున్నది. ప్రతాపుడు నిశ్చలంగా అతడి ముఖం లోకి చూస్తూ "నన్ను మిత్రమా అని సంభోధించి నందుకే కాకుండా, నీ రూపురేఖా విలాసాలు కూడా నన్ను ఆకర్షించాయి. నీతో పోరాడటానికి మనసు రావటంలేదు. రాక్షస రూపంలోని నీలో మానవత్వపు



ఛాయలున్నాయి. నీరూపం నాకు బాగా పరిచయ మైనట్లుగా అగుపిస్తున్నది. దయచేసి మీ వివరాలు చెప్పండి. మీ తల్లిదండ్రులెవరు?'' అన్నాడు.

ఆ రాక్షసయువకుడు. ''నాపేరు ఘంటాకర్ణుడు. అతులిత మాయామేయ ప్రతిభా సంపన్నత నా తల్లివల్ల నాకు సంక్రమించింది. స్వచ్ఛమైన శౌర్యం, పరాక్రమం, పౌరుషం, ధైర్యం, వాటితో బాటు మానవత్వం, నా తండ్రివల్ల ఏర్పడ్డాయి. నా తల్లిపేరు ఘంటాకర్ణి. సాత్విక స్వభావం కలిగిన బ్రహ్మరాక్షసుడికి జన్మించినందువల్ల మాతల్లి ఉగ్గుపాలతోనే మంచితనం, సేవాభావం అలవర్చుకుంది. అందుకే - సుమారు ఇరవై సంవత్సరాల క్రిందట విశాలుపురి కోట కందకంలో కొనవూపిరితోవున్న ఆ నగరప్రభువైన ధర్మపాలుణ్ణి రక్షించి, అతణ్ణి ఈ వనానికి తెచ్చి, శుశ్రూషలు, వైద్యంచేసి, బ్రతికించుకున్నది. అప్పుడు నా తల్లి వయస్సు పదహారు సంవత్సరాలే! ఆ ఇరువురి మనసులు కలయికవల్లనే నేను జన్మించాను. చెప్పింది చాలా ఇంకా ఏమైనా వున్నదా?'' అన్నాడు అసహనభావంతో.

ఘంటాకర్ణుడి మాటలకు ప్రతాపుడు ఆనందో త్సాహాలలో ఓలలాడుతూ ''చాలావున్నది. నన్ను మీ ఆత్మీయుణ్ణిగా, బంధువుగా భావించండి. ధర్మపాలు చక్రవర్తిని నమ్మక ద్రోహులైన ఆయన సామంతులు దారుణంగా వధించారనే - లోకం ఇంతవరకూ చెప్పుకుంటున్నది. అంతెందుకు సాక్షాత్తూ ఆ సార్వభౌముని కూరిమి ఇల్లాలు ప్రభావతీ మహారాణి కూడా ఆయన మరణించే వున్నట్లు భావిస్తున్నది. మీరిప్పుడు చెప్పినదంతా నాకు దిగ్భ్రాంతిని కలిగిస్తున్నది. మీరు ధర్మపాల చక్రవర్తికి ఘంటాకర్ణి మాతవల్ల జన్మించివుంటే, నాకు బావగారు అవుతారు. నీ అన్న మదనుడు ప్రస్తుతం ఘోరమైన ఆపదలో వున్నాడు... ఘంటాకర్ణా! నిజం చెప్పు. మామ గారు - ధర్మపాల ప్రభువులు జీవించే వున్నారా? ఎక్కడున్నారు వారు?'' అన్నాడు.

అతడు కొద్దిక్షణాలు ఆలోచించి, మనసులో తల్లిని ధ్యానించుకున్నాడు. అప్పటికే తనచేతి పట్టును సడలించాడు. ప్రతాపుడు ఘంటాకర్ణుడి ముఖాన్నే సంతోషంగా చూస్తూండగానే - ఓ బ్రహ్మరాక్షస స్త్రీ అక్కడ ఆవిర్భవించింది. ఆమెను చూడగానే ఘంటాకర్ణుడు, ప్రతాపుడు,

నమస్కరించారు. సౌమ్యమంగళ సౌభాగ్యాలు మూర్తీభవించినట్లున్న ఘంటాకర్ణి 'ఏం నాయనా? ఎందుకు నన్ను స్మరించుకున్నావు? ఇక్కడికి చేరగల సాహసవంతుడైన ఈ వీరయువకుడెవరు? చూడగానే మనస్సును ఆకట్టుకుంటున్నాడే?'' అన్నది కొడుకుతో.

ప్రతాపుడు వినయంతో ఆమెకు తాను గురుకులం నుండి బయలుదేరినప్పటినుంచి అప్పటిదాకా జరిగినదంతా చెప్పాడు.

అద్భుతమూ, అత్యంత విషాదపూరితమూ, అయిన ఆ వృత్తాంతమంతా వినగానే ఘంటాకర్ణుడు ఆనందంతో, ఆవేదనతో తల్లివేపు చూశాడు. ఘంటాకర్ణి అమాంతం ప్రతాపుణ్ణి కౌగలించుకున్నది. ఆనందబాష్పాలు రాలుస్తూ అతడితో "చిరంజీవి! నేను దక్షిణప్రాంతపు వింధ్యారణ్యంలోని కొండమీద బంధువులను చూడటానికి వెళ్తూండగా విశాలపురి రాజమందిరంనుండి ఓ మహరాజు రక్తసిక్త శరీరంతో కందకంలోకి త్రోసివేయబడటం చూశాను. వెంటనే నామాయాజాలంతో కందకం నుండి అతణ్ణి చేరదీసుకుని నా నివాసానికి వచ్చాను. సేవలతో, నాకు తెలిసిన బ్రహ్మ వైద్యం విధానంతో ఆ మహారాజును బ్రతికించాను. తనపేరు ధర్మపాలుడనీ, శత్రువులు తనను అలా చేశారని చెప్పి, వెంటనే తన రాజమందిరానికి చేర్చమనే కోరాడు. కాని, కన్యనైన నేను ఆ మహారాజుమీద మనసుపడి, ఆయనకు పూర్వస్మృతి లేకుండా చేసి వివాహమాడాను. ఇప్పుడు నువ్వు చెప్పిన దానినిబట్టి నేనెంత పొరపాటు చేశానో



అర్థమైంది. పర్వాలేదు. ఇప్పుడు పొరబాటును సరిదిద్దుకుందాం. — పాతాళలోకంలో హోమం తలపెట్టిన కాలభైరవుడు ఇంత క్రూరుడని నాకు తెలియదు, మీ మామాగారి దగ్గరికి నిన్ను తీసికెళ్లి, ఆయనకు పూర్వస్మృతి తిరిగి రప్పిస్తాను. అక్కడే కర్తవ్యం నిర్ణయించుకోవచ్చు" అన్నది. ప్రతాపుడి ఆనందానికి మేరలేకుండాపోయింది.

ఇక అక్కడ తాంత్రికకోటలో కాలంధర తన బలిపూజకు కావలసిన కన్యలైన యువతులను భైరవ మాంత్రికుడి అనుచర రాక్షసుల ద్వారా పాతాళ కోటకు చేర్పించింది.

ఆదినం చలిపూజకు నిర్దేశించిన సమయం సమీపించటంవల్ల కాలంధర కన్యలందరినీ స్నానంచేయించి, మెడలకు వేపమాలలను,



కపాలమాలలను ధరింపజేసింది. కాలంధర అనుచరురాండ్రు సుగంధమాల, సువర్ణ, గుణ సాగరి, మొదలైన వారందరికి శరీరాల నిండా పసుపు కుంకుమలు పూసి బలికి సిద్ధంచేసి వరుసగా నిల్చోబెట్టారు. మాంత్రికురాండ్రు క్షుద్ర మంత్రాలు చదువుతుండగా - మొదటి బలికన్యగా సువర్ణపురి రాజ పుత్రికయైన సువర్ణకుమారిని, ఆ తర్వాత గుణసాగరిని, అనంతరం తక్కిన రాచ కన్యలనందరినీ వరుసగా నిలబెట్టారు. ఎదురుగా జ్వాలాజిహ్వకయై భయంకరరూపంలోవున్న క్షుద్ర శక్తి విగ్రహాన్ని చూస్తూ, సువర్ణకుమారి తన మేనత్తయైన ప్రభావతీదేవి చెప్పిన మాటలనే మననం చేసుకోసాగింది. మంత్రగత్తె చేతిలోని బలిఖడ్గం సువర్ణ మెడమీద పడబోతూండగా ఆ అరనిండా తెల్లని కాంతిరేఖలు వ్యాపించాయి.

కాలంధర చెయ్యి స్తంభించిపోయింది. ఆ మాంత్రికురాలు "అయ్, ఎవరు నాకెదురు శక్తిని ప్రయోగించింది" అని నలుదిక్కులూ చూడ సాగింది.

మరుక్షణం "నేనేనే క్షుద్రమాంత్రికురాలా! వశీకృత, స్తంభీకృత, సంచారీకృత, సిద్ధులకు కేంద్రబిందువైన 'సర్వశక్తిబిందు' సిద్ధిని వశం చేసుకోవటానికే అంతకాలంనుంచి అదృశ్యంగా దీక్ష వహించాను. ఈనాటితో నీపాపం పండింది" అంటూనే దివ్యతేజస్సులతో ప్రకాశిస్తూ ప్రభావతీ దేవి అక్కడ ప్రత్యక్ష్యమైంది.

ఆమెను చూడగానే సువర్ణమాల మొదలైన కన్యలంతా ఆమెదగ్గరికి పరుగెత్తారు.

కాలంధర వికటంగా నవ్వి "ఓహో, విశాలపురి మహారాణీగారా! నా శక్తులను మించిన శక్తులను సంపాదించి, వాటి ప్రయోగంతో నా మంత్రశక్తులను అరికట్టగలవేమోగాని, నా ప్రాణాలను మాత్రం తీయలేవు" అన్నది.

అంతలో "కాలంధర! నీ ప్రాణాలను తీసికొనే వచ్చాను" అన్న గంభీర కంఠస్వరంతో ప్రతాపుడు అక్కడ వెలిశాడు. అతడి చేతిలోని తుమ్మెదను చూస్తూ "అం,అం? అది నీకెలా వచ్చింది? దాన్నేం చెయ్యకు..కావాలంటే నీవాళ్ళనందరినీ విడిచేస్తాను ఆ తుమ్మెదను నాకిచ్చెయి?" అంటూ ప్రతాపుడి దగ్గరికి రాబోయింది కాలంధర. ప్రతాపుడు తుమ్మెద రెక్కనొకదాన్ని త్రుంచాడు. కాలంధర కుంటుకుంటూ రాసాగింది. ఆ మంత్రగత్తె

అవస్థకు రాజకన్యలంతా నవ్వటం ప్రారంభించారు. కొంతసేపు కాలంధరను ఆటపట్టించి, ఆ తర్వాత ప్రతాపుడు తుమ్మెదను చేతివ్రేళ్ళతో చిదిమి కాలంధర మీదకు విసిరాడు. ఆ అరంతా ప్రతిధ్వనించేట్టు ఆర్తనాదం చేస్తూ కాలంధర క్రిందపడి గిలగిల కొట్టుకుంటు మరణించింది.

ఆ పాపాత్మురాలినలా అంతంచేసినందుకు కన్యలంతా తనకు జేజేలు పలుకుతూండగా ప్రతాపుడు ప్రభావతీదేవి దగ్గరికి వెళ్ళి నమస్కరించాడు.

ఆమె అతణ్ణి లేవదీసి, "నాయనా! నీబావ మదనుడెక్కడ? ఒంటరిగా వచ్చేవేం" అన్నది.

ప్రతాపుడు "అత్తయ్యా! ఆ బావకు తోడు మరో కొత్త బావను సంపాదించి, నా మిత్రులైన రాజపుత్రులందరితో కలసి - నాహితుడైన నాగలోక యువ రాజు రత్నపాలుడి సహాయంతో ఇప్పుడే పాతాళ లోకంలోని కాలభైరవ మాంత్రికుడి కోటకు పంపాను. అంతేకాదు - నాకు మరో చిన్నత్తనుకూడా సంపాదించుకున్నాను అన్నాడు.

ప్రభావతీదేవి ఆశ్చర్యంతో "కొత్త బావ ఏమిటి, చిన్నత్తమిటి?" అన్నది.

ప్రతాపుడు ఆనందంతో "అత్తయ్యా! అంతేకాదు, లోకంతోబాటు మీరు కూడా - మరణించారనుకున్న మా మామగారిని శ్రీ ధర్మపాల చక్రవర్తిని కూడా తీసికొని వచ్చాను." అని అంతకుముందు జరిగినదంతా సవిస్తరంగా చెప్పాడు.

చెవులకు అమృతపువూటల్లా సోకిన ఆ మాటలు వినగానే ప్రభావతీదేవి నిలువునా పులకించి పోయింది. భర్తను ఎప్పుడెప్పుడు సందర్శించ



గలనా అని ఆమె మనస్సు ఆరాటపడింది.

పాతాళహోమం కార్యక్రమంలో నిమగ్నుడైవున్న కాలభైరవుడు ఉన్నట్టుండి ధర్మపాలుడు, ఘంటాకర్ణుడు, ఘంటాకర్ణి, మదనుడు, వీరసింహుడు మొదలైన రాజపుత్రులు తన ముందు ఆవిర్భవించగానే దిగ్భ్రాంతి చెందాడు. సునంద మొదలైన యువతులను అప్పటికే అతడు హోమంలో చిందించే రక్తంకోసం సిద్ధం చేసుకుని వుండి పోయాడు. మదనుడి చేతిలోని తుమ్మెదను చూడగానే మాంత్రికుడి నవనాడులు కృంగిపోయాయి. అప్పటికి రత్నపాలుడు తన నాగవీరులతో కలసి మాంత్రికుడి అనుచరులందరిని ఆక్రమించుకుని వున్నాడు. హోమగుండం నుంచి చివాలునలేచి, మదనునితోబాటు తన విరోధులందరికి చైతన్యాన్ని

స్తంభింపజేయాలని మంత్రం పఠించబోయాడు.

అదే సమయంలో ప్రతాపుడితోబాటు అక్కడ సాక్షాత్కరించిన ప్రభావతీదేవి తన దివ్యశక్తుల ద్వారా మాంత్రికుడి మంత్రశక్తిని మటుమాయం చేస్తూ తన వారికందరికీ విముక్తిని కలిగించింది.

ప్రచండుడు, దుర్జయుడు మొదలైన శత్రురాజులు అక్కడి నుంచి పారిపోవటానికి ప్రయత్నించారు. కాని, ధర్మపాలుని ఖడ్గం వాళ్ళను విడిచిపెట్టలేదు. మదనుడు తుమ్మెదను చిదిమి పారేశాడు. ఆ ప్రదేశమంతా దద్దరిల్లేట్లు ఆర్తనాదం చేస్తూ కాపాల భైరవుడు హోమగుండం ముందు పడి ప్రాణాలు విడిచాడు.

అనంతరం - ప్రభావతీదేవి పద్దెనిమిదేళ్ళ తర్వాత కన్నుల పండువు చేసిన భర్తను సమీపించి ఆతడి పాదాలకు అల్లుకునిపోయింది. ధర్మపాలుడు ఆమెను లేవనెత్తి బిగికౌగిట చేర్చుకున్నాడు. అక్కడివారంతా ఆనందోత్సాహాలతో తమ్ము కొనియాడుతుండగా - ఘంటాకర్ణి, ఘంటాకర్ణుడు ప్రభావతీదేవికి పాదనమస్కారం చేశారు.

ఆ తర్వాత - ప్రభావతీదేవి రాజపుత్రులను, దేశదేశాల యువతులను, ఎవరి నివాసానికి వాళ్ళను పంపివేసింది. ధర్మపాలుడు ఇరువురు భార్యలను, ఇరువురు కుమారులుతోను, సూర్య ప్రతాపుడితోనూ, విశాలపురి చేరాడు. ప్రభాకర సింహుడూ, శత్రుంజయుడు, పరమానందంతో అందరినీ కౌగిలించుకున్నారు. చిరకాలం తర్వాత తమ ప్రభువు చల్లని పరిపాలనను నోచుకున్నందుకు విశాలపురి పౌరులంతా జయజయ ధ్వానాలు చేశారు.

ఓ శుభముహూర్తంలో ధర్మపాల దంపతులు మదనునికి సువర్ణమాలతోను, సూర్యప్రతాపుని సుగంధమాలతోను వివాహ మహోత్సవం జరిపించారు. అరాచకాలను అంతరింపజేసిన తమ మహారాణికి ప్రజలు నిత్యపూజలు చేస్తూ ఆనందంగా గడపసాగారు.

(అయిపోయింది)

